సహజ సౌందర్యానికి నిండుతనం చేకూర్చే
శంఖు మార్కు లుంగీలు




# శంఖు మార్కు

## లుంగీలు
## చేతిగుడ్డలు

**మొహమదు అబూబకర్ & కంపెనీ**
95, తంబుచెట్టి వీధి, మదరాసు - 600001
బ్రాంచీలు మధురై • క్విలాన్ • కలకత్తా








ముఖచిత్రం వాసంతి

చిత్రకారుడు వడ్డాది పాపయ్య


యువ సాలుచందా రూ 36-00

దీపావళి సంచికతో రూ 42-00

యువ హైదరాబాదు-500001




ఫిబ్రవరి నెల యువ 'బంగారు తల్లులు' ముఖచిత్రంతో అత్యంతాకర్షణీయంగా వెలువడింది లక్ష్మీనరసింహ శాస్త్రిగారి 'తిరుగులేని అదృష్టం' చాల బావుంది. నవలల ఎంపికలో మీరు తీసుకుంటున్న శ్రద్ధకు అభినందన. "కుబుసం", 'మావూరు కథలు యువకే హైలైట్ 'వాణిశ్రీ' గారి 'జలుబు' కడుపుబ్బ నవ్వించింది. జోక్స్ బాగా నవ్విస్తున్నాయి 'చక్రపాణి' చాల ఇంటరెస్టింగ్‌గా ఉంది "అరేబియన్ నైట్స్" యువకోసం ప్రతినెలా ఎదురుచూచేలా చేస్తున్నాయి విజయావారి సినీ కథ యస్.ఆర్.వి. కాఫీ క్లబ్ చదివితే మనస్సు ఆనంద డోలికల్లో తేలియాడుతుంది చిత్రం ఎప్పుడు విడుదల అవుతుందా అనే ఆతృత కలుగుతోంది. మాకు ఇంత ఆనందాన్నిస్తున్నందుకు థాంక్స్.

సత్య గోపీ సీతారామరాజు,
పాణంగిపల్లి.

ఫిబ్రవరి యువలో చిత్రకారుడు వడ్డాది పాపయ్య వేసిన 'బంగారు

---

తల్లులు', ముఖచిత్రం చాలా బాగుంది ఇనుకపల్లి లక్ష్మీనరసి హశాస్త్రిగారి 'తిరుగులేని అదృష్టం నవల చాలా బాగుంది పోల్కంపల్లి శాంతాదేవిగారి 'కుబుసం శ్రీధర్‌గారి నెమిలి', అవసరాల రామకృష్ణారావుగారి 'మేం చేసిన తప్పు మీరూ చేస్తారా' సీరియల్ కావిలిపాటి విజయలక్ష్మిగారి చక్రపాణి సీరియల్ ఇంకా పాలగుమ్మి పద్మరాజుగారి శ్రీరాజేశ్వరీ విలాస్ కాఫీ క్లబ్' సీరియల్ చాలా బాగుంది.

సైదమియ్యా
కరీంనగర్

ఫిబ్రవరి నెల యువ ముఖచిత్రం 'బంగారు తల్లులు' చాల బాగుంది 'తిరుగులేని అదృష్టం' నవల చాల బాగుంది జయించింది నేను కాదు', యం వీరన్నగారి కథ యువకే హైలైట్ కావిలిపాటి విజయలక్ష్మిగారి చక్రపాణి' సీరియల్ చాల బాగుంది అనుకోనివిధంగా మలుపు తిరిగిన 'చక్రపాణి' సీరియల్ గూర్చి యువ గురించి ఎదురు చూస్తున్నాము- యువలో కథలు కార్టూన్లు యువకి యువే సాటి

ఉపాధ్యాయుల అన్నపూర్ణ,
జయపురం

# యువ చందా వివరములు

| | | |
|---|---|---|
| యువ సంవత్సర చందా | రు | 36-00 |
| దీపావళి సంచిక | రు | 6-00 |
| దీపావళి సంచిక రిజిష్టర్డు పోస్టుతో | రు | 7-50 |

గమనిక చందాదారులు తమ చందా పంపేటప్పుడు పూర్తి చిరునామా పిన్‌కోడ్‌తో వ్రాయగోరుచున్నాము

యువ కార్యాలయం
హైదరాబాదు--500 001

# ఎవరు వీరులో

కాలం కొత్త స్వయంవరానికి వచ్చింది

చేతిలో పూలమాల ధరించి

ఎవరు వీరులో ముందుకు రండి పరిశ్రమల పూల మాలలు ధరించండి

కొత్తగా పరిశ్రమలు పెట్టదలచినవారికి ఆంధ్రప్రదేశ్‌లో ఎన్నో అవకాశాలు వున్నాయి ప్రభుత్వం సౌకర్యాలు కల్పిస్తుంది

విద్యుచ్ఛక్తి ముడిపదార్థాలు నీరు ఫ్యాక్టరీ భవనాలు
మీ బాగుకోసం  దేశ బాగుకోసం

నెం 8/75 76

---

సమాచార పౌరసంబంధ శాఖ హైదరాబాదు

# చందమామ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 33     మార్చి, 1976     సంచిక 3


ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి ప్రకటించిన 20-సూత్రాల ప్రణాళికను వివిధ రాష్ట్రప్రభుత్వాలు అమలుజరపడం 1975 జులై 1 నుంచి ప్రారంభమైంది. దేశంలో ఎమర్జెన్సీని ప్రకటించిన వెనువెంటనే ప్రధాన మంత్రి యీ ప్రణాళికను ప్రకటించారు. అంచేత, ఎమర్జెన్సీ పద్ధతిలోనే యీ ప్రణాళిక సూత్రాలను అమలుజరపడం జరుగుతున్నది.

ప్రజల నిత్యజీవితానికి అత్యవసరమైన వస్తువుల ధరలను అదుపులో పెట్టడమూ, కారణం లేకుండా పెరిగిపోయినవానిని తగ్గించడమూ, 20-సూత్రాలలో ఒకటి. గత ఎనిమిది మాసాలలోనూ, యీ విషయంలో చాలా పరిగణనీయమైన ఫలితం సాధించబడింది. బియ్యం, పప్పులు, నూనెలు మొదలైన ఆహారదినుసుల ధరలు సగానికి సగంకూడా తగ్గాయి. స్వల్పఆదాయంమీద ఆధారపడి ఒక కిలో బియ్యానికి నాలుగురూపాయలు ఇచ్చుకోలేక, ఒక పూట తిండితో అవస్థపడుతూవున్న కుటుంబాలు యీనాడు రెండుపూటలా తిండి తినగలుగుతున్నారు. దీనికి, ప్రభుత్వాన్ని అభినందించవలసిందే.

ఆహారదినుసుల ధరలను అదుపులోకి తెచ్చిన ప్రభుత్వం, ప్రజల ఆరోగ్యం

విషయంలోకూడా మరింత శ్రద్ధ చూపవలసిన అవసరం వుంది ఎన్నో మందుల ధరలు, గత నాలుగైదు సంవత్సరాలలో విపరీతంగా పెరిగిపోయినవి. కొన్ని మందుల ధరలు యింకా పెరుగుతూనే వున్నాయి. మందుల ధరల నిర్ణయం విషయంలో దిట్టమైన కట్టుబాట్లను ఏర్పచి, వాటిని బాగా తగ్గించే టట్టు ప్రభుత్వం శ్రద్ధతీసుకోవాలి ఆహారంతోపాటు, ఆరోగ్యరక్షణకు అవసర మైన మందుల ధరలు కూడా సామాన్య కుటుంబీకుల అందుబాటులో లేక పోతే, ఆ కుటుంబాలు పడే బాధ వర్ణనాతీతం

ఈనాడు లభించే ఆహార పదార్థాలు శరీరానికి ఏమాత్రం సత్తువని చ్చేవిగా లేవు కృత్రిమ ఎరువులతో పండించబడి, ధాన్యమూ, కూరగాయ లూ శరీరానికి సత్తువనివ్వనందున, ప్రతివ్యక్తీ, ఏవో విటమినులను, ఎంజైమ్సును తినవలసివస్తోంది.

ప్రధానమంత్రి 20-సూత్రాల ప్రణాళికను అవిచ్ఛిన్నంగా అమలుజరప వలసి వున్నదనీ ప్రభుత్వోద్యోగులు ఒక నిముషంకూడా ఏమరకుండా తమ విధులను నిర్వహించాలి.

——

మార్చి నెల

# భావపరిచయపోటీ

( బహుమతి పొందిన వ్యాఖ్య )



రోడ్డురోమియోల రోగంబు కుదిరింప
ప్రేమలేఖ విడిచి భామ నడువ
అందుకొనగ దాన్ని 'ముందు' పోటీపడె
మంద భాగ్యులంత తొందరొంది.

— కామేశ్వరి, యలమంచిలి.


రాధా! నిన్ను నేను - మనసారా ప్రేమిస్తున్నాను!


సారీ... నెక్స్ట్‌ఇయర్ కనిపించు! నేను ఓ ఏడాదిపాటూ పెళ్లిచేసుకోనని ప్రతిజ్ఞ చేసా!
రాగతి పండరి




నిత్యావసర వస్తువులంటే ఏమిటి - నాన్నా?


సిగరెట్లూ - అగ్గిపెట్టె..


మీ తెలివి తెల్లారినట్టే ఉంది నిత్యావసర వస్తువులంటే స్నో పౌడర్ లిప్‌స్టిక్ మొదలైనవి తెలుసు!!
రాగతి పండరి

ఏప్రిల్ నెల

# యువ

# భావపరిచయ పోటీ

బహుమానం రూ. **15-00**



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

గమనిక : వ్యాఖ్యలు పోస్టుకార్డుమీదనే వ్రాయాలి.



కాత్యాయిని ఖాళీ అయిన రైల్లోనుంచి నీరసంగా చేతిలో సూట్కేసుతో ప్లాట్‌ఫారం మీదకు దిగింది. ఆ ప్లాట్‌ఫారం తన మనస్సంత గజిబిజిగానూ

# ధేనుక

## పి.యస్.నారాయణ

వున్నది ఒకళ్ళమీదగా ఒకళ్ళు దాటుకుంటూ మనుష్యులు నడుస్తున్నారు వాళ్ళ మీదనే పడుతున్నట్లుగా పుస్తకాలబండీ, బిస్కెట్లబండీ మీదిమీదికి వస్తున్నాయి.

కాత్యాయిని చేత్తో సూట్కేసు పట్టుకొని, మనుష్యులను తప్పించుకుంటూ గుంటూరు స్టేషన్ బయటకు వచ్చింది.

అక్కడంత చీకటిగా— జానకి బ్రతుకంత భయంగా వున్నది. ముందుగా ఖాళీస్థలం జానకి ముందు బ్రతుకులా వెలితిగా కనిపిస్తోంది. ఎత్తైన స్థంభాలకు మిణుకు మిణుకుమంటూ వెలుగుతున్న విద్యుత్‌దీపాలు ఆమె జీవితంలాగానే కళాహీనంగా కనబడుతున్నాయి

దూరంగా వెలుగుతున్న ఓవర్ బ్రిడ్జిమీద తెల్లబలుబులు ఆమె గడిచిపోయిన జీవితంలా వున్నాయి. ఆ బ్రిడ్జిమీదగా రిక్షాలో పోవాలంటే తనకు గుండెల్లో భయం భయంగా వుంటుంది. అందుకే కాస్త దూరమయినా ఆ బ్రిడ్జిక్రిందగా చీకట్లోనుంచి వెళ్ళి, మెడికల్ కాలేజీమీదగా, కలెక్టరాఫీస్ ముందుగా, పధ్నాలుగో అడ్డరోడ్డు గేటులోంచి బ్రాడీపేటకు వెళతోంటుంది.

"రిక్షాకావాలా అమ్మా ?"

మెదలకుండా సూట్కేసును రిక్షాలో పెట్టేసి ఎక్కి కూర్చున్నది. చల్లని మంచు— జానకి కన్నీళ్ళలా మీద కురుస్తుంటే టాపువేయమందామని అనుకొని గూడా— కన్నీళ్ళలో తడిసిపోయి నోరు పెగలక అలాగే కూర్చున్నది.

జనరల్ హాస్పిటల్ వైపుకు రిక్షాతిప్పబోతుంటే, "ఊహూ... కలెక్టరాఫీస్ వైపు పోనీయ్ !" అన్నది.

వెలుగంటే తనకు భయమేస్తున్నది.

సాయింత్రం ఆయన ఆఫీసునుంచి వస్తూ పిడుగులాంటి వార్త మోసుకు వచ్చాడు— జానకి భర్త రామ్మూర్తి పోయాడట !

ఇదెక్కడి ఘోరం !

తన స్నేహితురాలు, ఆత్మీయురాలు— ఎందుకు— తన మరో ఆత్మ జానకి— దాని భర్తపోవడమా ?

"నిజమా !... నిజం చెప్పండి !... నిజం చెబుతున్నారా మీరు !" భర్తను కుదిపేస్తూ అడిగింది. "మీకెలా తెలుసు ?"

"గుంటూరునుంచి ఉదయమే శివం వచ్చాడు... వాడి పెళ్ళాం పురిటికి వెళ్ళి అక్కడే వున్నది... వాడి అత్తగారిల్లు జానకి వాళ్ళింటి దగ్గరే... ఏదో మాటమీదొచ్చి— వాళ్ళు మనకు తెలుసని గుర్తుకురావడంతో చెప్పాడు— హార్ట్ఎటాక్ అట !"

పక్కగా పట్టాలమీదగా పోతున్న రైలు కూసిన కూత రాబందు కేకలా వున్నది.

జానకిని ఎలా చూడాలి?... ఎలా పలకరించాలి ??

జానీ... జానీ... జానీ... నీ కెంత కష్టమొచ్చిందే !

కళ్ళల్లో నీళ్ళు ఉబుకుతున్నాయి. గుండె పట్టు తప్పుతున్నట్లుగా అదిరదిరి పడుతున్నది.

ఊగుతున్న రిక్షాలో— అసహనంగా అటూ యిటూ కదులుతూ కూర్చున్నది కాత్యాయిని.

జానకిని వెంటనే చూడాలి.

పట్టాలమీదగా దిగి రిక్షా లోయలోకి జారిపోతున్నట్లుగా చీకట్లోకి జారిపోయింది.

"ఇంకాస్త ముందుకు పోనీయ్... రెండో లైనుకు తిప్పు !"

అవును— అదే జానకివాళ్ళ యిల్లు !

ఎప్పుడూ కళకళలాడుతూ తళతళా మెరుస్తుండే ఆ యిల్లు అంత నిర్జీవంగా వున్నదేం ?

—ఇంటి యజమానే లేకపోతే ఆ యింటికి వెలుగెక్కడిది ?

రిక్షా దిగుతుంటే గుండె పట్టుకున్నట్టుగా కలవరపడింది. చేతిలోకి తీసుకున్న సూట్కేసు మొయలేని బరువవుతోంది. వేస్తున్న ప్రతి అడుగూ గతపు వెలుగు మీద పడుతున్న చీకటి నీడే అవుతున్నది.

దగ్గరకు వేసివున్న గేటును శవంలా పడివున్న జానకిని తట్టి లేపుతున్నట్లుగా నెట్టి లోపలకు అడుగువేసింది.

తొమ్మిది గంటలకే ఎక్కువ జనం అక్కడ— స్మశానంలో వున్న బూడిద కుప్పల్లా పడివున్నారు. పైనుంచి పడుతున్న వెలుగు శవాన్ని కాల్చేటందుకు ముట్టించిన కట్టెల వెలుగులా వున్నది. వంటయింట్లో తిరుగుతున్న మనుష్యులు రాబందులకోసరం పిండాలు తయారుచేసే మనుష్యుల్లా కనబడ్డారు.

ముందుహాల్లో మూలగా— గద్దల గుంపులా కూర్చున్నారు నలుగురయిదుగురు మనుష్యులు— మాటలాపి చప్పుడయిన గేటువంక కొత్తగా స్మశానంలోకి వస్తున్న శవాన్ని చూస్తున్నంత ఆసక్తిగా కాత్యాయినిని చూడసాగారు.

వాళ్ళకళ్ళు— కళ్ళల్లోనుండి ప్రాణంపోయిన శవం కళ్ళలావున్నాయి.

కాత్యాయిని గొంతులో ఏడుపు— ఆస్తమా రోగి కంఠంలో కఫంలా వుండ చుట్టుకుపోతోంది.

"జానకి ఏది ?"

అందరూ విచిత్రంగా కాత్యాయినిని చూచారు.

అందులో ఒకామె లేచి 'రండి' అన్నట్లుగా ముందుకు నడిచింది.

ఓ దీపం లేని గదివంక చూపుతూ, "లోపల వున్నది...వెళ్ళండి !" అన్నది ఆమె. కాత్యాయినిని చీకటి గదిలోకి తోస్తున్నట్లుగా చేయి ఊపింది.

కాత్యాయిని కొద్దిగా వంగి సూట్కేసును నేలమీద పెట్టి రెండడుగులు ముందుకువేసి, తలుపు మండిగం మీద రెండు చేతులూ వేసి, ముందుకు వంగి, చీకట్లోకి కళ్ళు చించుకు చూస్తూ, "జానీ" అన్నది.

ఘొరుమన్నది.

ఆ క్షణంలోనే ఆ గృహంలో మరో శవం లేచిందేమో నన్నంతగా జానకి కంఠం ఘొల్లుమన్నది.

* * *

"జానీ !"

శవాన్ని స్నానం చేయిస్తున్నట్లుగా మీదపడి ఏడుస్తున్నది జానకి. కాత్యాయినిని కౌగిలించుకున్నది. స్నేహితురాలిని ఉండచుట్టుకునిపోయి, తన సర్వస్వం ఆమేనన్నట్లుగా గుండెలకు అదుముకోసాగింది. "కాత్యాయినీ !"

అరగంటతరువాత ఆ ప్రదేశం శవం కాలి బూడిదయింతరువాత ఆవరించిన నిశబ్దంలా వున్నది ఉండి ఉండి జానకి గుండెల్లోనుండి ఎగతన్నుకొస్తున్న వెక్కిళ్లు సాయిబుల గోరీలమీదగా గుబురుగా వున్న చెట్లలోనుంచి వస్తున్న పేరు తెలియని పిట్టల కూతల్లా వున్నాయి. ఆ గదినంతా ఆవరించిన చీకటి

అమావాస్యనాడు ఇక్క శవాన్ని చూడని స్మశానంలా వున్నది— అంత పెద్ద గదిలో మూలగా పడివున్న జానకి విడిచిన గుడ్డల కుప్పలా వున్నది.

"ఎందుకయింది ఇలా ?"

"నా ఖర్మ కొద్దీ !"

"త్రాగుతోందేవారా ?"

''త్రాగినవాళ్ళంతా చస్తున్నారా ఏమిటి ?"

"డాక్టరు ఏమన్నారు ?"

"అంత క్రైం ఎక్కడున్నది ?" ఏడుపు ఘొల్లుమన్నది.

"యిరవైనాలుగు గంటలు గడిచిపోయింది... నీవు మనిషివి కాలేవా ?"

"మనిషినికాబట్టే బ్రతకగలిగి వున్నాను !"

"బాబుకి నీవే తల్లి తండ్రివి అని గూడా తెలుసా ?

జానకి కళ్ళముందు ఒక పెద్ద లోయ గజిబిజిగా కనబడుతోంది.

"అవును గదూ... అసలు నా బాబు ఏడి ?" పిచ్చిపిచ్చిగా చూస్తూ ఏడ్వసాగింది.

కాత్యాయినికి ఆ చూపులకు దుఃఖం ఆగలేదు.

"నీకు బాబే గుర్తులేదా ?"

"నేను జీవించివున్నాననే గుర్తులేనప్పుడు- బాబు ఎక్కడ ?"

"బాబును నీవు నిన్నటించి చూడనేలేదా ?" కళ్ళు చించుకు చూస్తూ అడిగింది దిగులుగా కాత్యాయిని.

"లేదు !'' అన్నది బెక్కుతూ జానకి

"జానీ ! ఎంత దగా పడిపోయావే నీవు జీవితంలో..." కాత్యాయిని చీరె చెంగుతో జానకి కళ్ళు తడుస్తూ అన్నది

కాత్యాయిని లేచి నిలబడింది, ఆ చీకట్లోనుంచి వెలుగులోకి రావాలన్నట్లుగా అంతేగాదు తన మిత్రురాలు, ఆత్మీయురాలు జానకిని గూడా తీసుకురావా లన్నట్లుగా బాబుకోసం బయటకు బయల్దేరింది.

రెండడుగులు వేసి, "కొరివి ఎవరు పెట్టారు ?" అడిగింది ఒక్క క్షణమాగి.

"బ్రతికి వున్న ఎవరో ?"

ఇక ఆ స్మశానంలో బ్రతికివున్నవాళ్ళు బ్రతకటం కష్టం అన్నట్లుగా గడప వతల కాలు పెట్టేసింది.




ఎక్కడా మనుష్యుల అలికిడిలేదు. నిర్జీవప్రాంతంలా నిశ్శబ్దంగా వున్నది.

ముందు హాల్లోకి వచ్చింది. వంటయింట్లో లైటు వెలుగుతోంది. రెండగులు అటుగా వేసింది

మాటలు వినబడుతున్నాయి.

మరో అడుగు ముందుకువేసి, తలుపివతలే నిలబడి లోపలికి తొంగి చూచింది.

అందరూ ఒక బంతిగా కూర్చొని భోజనాలు చేస్తున్నారు.

ఎవ్వరూ కాత్యాయినిని చూడనేలేదు.

"ఏమేః అరటికాయకూరలో ఉల్లిపాయలు వేయలేదేమేః" అంటున్నాడు ఒకాయన.

''కొంపలో ఉండిఏడవద్దుః" మరొకరి జవాబు.

''తెప్పించగూడదూః"

"గోపిగాడిని వెళ్లమంటే వెళ్తేనాః" విసుగ్గా ముసలమ్మ సమాధానం.

ముందుకువంగి అసహ్యంగా చూస్తూ "బాబు ఎక్కడః" అన్నది కాత్యాయిని పెద్దగా.

అందరూ ఉలిక్కిపడి వాకిలివైపు చూచారు.

ఒక్క క్షణం తరువాత ముందుగా ముసలమ్మే కోలుకొని "స్నానంచేసి రా అమ్మా ః ఎపుడనగా బయలుదేరావో...భోజనం చేద్దువుగానిః" అన్నది.

"బాబు ఎక్కడున్నాడో ముందు చూడనీయండి!" అన్నది అసహనంగా.

"ఏ బాబు?" ముసలాయన వుల్లవిరుస్తున్నట్లుగా అన్నాడు.

"జానకి కొడుకు!"

"వాకిట్లో మంచంమీద పడుకొని నిద్రపోతున్నాడు!" అన్నది పదేళ్ళ పిల్ల.

జానకి విసురుగా బయటకు వచ్చింది.

పాడుబెట్టిన ప్రదేశంలో వున్న ఆ ముందుభాగంలో వంటరిగా వట్టిమంచం మీద పడుకొని వున్నాడు. పసిపిల్లవాడు—జానకి మూడేళ్ళ కొడుకు!

వంటిన ఉన్న చొక్కాకు గుండీలు వూడిపోయివున్నాయి. పెరిగి జులపాలు తిరిగిన జుట్టు చెదిరి ముఖమంతాపడి అసహ్యంగా ఉన్నది. కళ్ళవెంట కారిన నీరు, ముక్కులమ్మటకారిన చీమిడి అట్టలుకట్టి అసహ్యంగా వున్నది. అతడు అంత నిద్రలోనూ ఉండి ఉండి వెక్కుతూనే వున్నాడు.

"అరె బాబూ!" అంటూ ఎత్తుకోపోయినదలా షాక్ కొట్టినట్లుగా వదిలేసింది.

వాడి వళ్ళు సలసల కాగిపోతోంది. కాత్యాయిని కదిలించడంతో ఉలిక్కిపడి వణికిపోతూ ఏడుస్తున్నాడు

"నాయినా! బాబూ!" అంటూ భుజాన వేసుకున్నది వాడిని కాత్యాయిని.

కాత్యాయినికి ముందు జానకిమీద కోపమొచ్చింది. ఆ పైన లోపల మరీ బంతులుతీరి కూర్చుని తిండితింటున్న మనుష్యలలాంటి మృగాలమీద కోపం వచ్చింది. ఆ పైన మనుష్యలను ఏడిపించేటందుకే పుట్టిస్తున్నట్లున్న దేవుడిమీద కోపమొచ్చింది.

భోజనాలు చేస్తున్న వాళ్ళదగ్గరకు బాబును భుజంమీద వేసుకొనివచ్చి. "బాబు వళ్ళు జ్వరంతో సలసలా కాగిపోతున్నదని ఎవ్వరికీ తెలియదా?" అన్నది.

నిర్మల ఒక్కఉదుటున లేచి అక్కడికి వచ్చింది. ఆమె జానకి ఆడబిడ్డ. భోజనం చేయకుండా అందరి ఎదుటా కూర్చొని సవాళ్ళు తీస్తోంది.

"అవుమా...ఆ మాటే మర్చిపోయాను ఈ వంట హడావిడిలో...అరేయ్ గోపీ.. భోంచేయగానే వెళ్ళి ఏవైనా రెండుమాత్రలు పట్టుకురారా ... వేద్దాం!" అంటూనే రెండుచేతులూ జాచి, "ఇటివ్వండి...భయపడినట్టున్నాడు!" అన్నది.

—ఆ మాట జానకిలాంటి కొత్తమనిషి ఎత్తుకోవటంతో వాడు భయ పడ్డాడు, అనే అర్ధమొచ్చేలా వున్నది.

కాత్యాయిని ఆమె మాటతీరుకు కాస్త కలవరపడింది కాని క్షణంలోనే కోలు



కొని, "మీ కెందుకులెండి శ్రమ...భోజనాలు కానివ్వండి ముందు...నేనే తీసుకు వెళ్ళి ఎవరైనా డాక్టర్‌కి చూపించివస్తాను!" అంటూనే గిరుక్కున వెనక్కు తిరిగింది.

వెనకగా నిర్మల ఏదో అంటున్నా కాత్యాయిని వినిపించుకోలేదు.

దబదబా ముందుకువెళ్ళి నిలబెట్టివున్న సూట్‌కేసును మామూలుగా పెట్టి మంగళసూత్రాలకు కట్టుకున్న తాళంచెవితో వంగి తాళంతీసి చిన్న పర్సు తీసికొని, తిరిగి సూట్‌కేసుకు తాళంవేసి, జానకి గదిలోకి తొంగిచూస్తూ "జానకీ ఒక్క పదినిమిషాల్లో వస్తానే!" అంటూ బయటకు విసురుగా వచ్చింది.

* * *

రాత్రి ఆ చీకటి గదిలో జానకి పక్కగా దుప్పటి పరుచుకొని, బాబుని పక్కలో పెట్టుకొని కాత్యాయిని పడుకున్నది

చీకటి నల్లగా భయంకరంగా ఆ ప్రదేశాన్నంతా ఆవరించి ఉన్నది బాబు వంటిమీద వున్న ఆమె చేయి ఇంకా కాలుతూనే వున్నది. పక్కగా జానకి తన ముఖాన్ని ఈ ప్రపంచంలో ఇంకెవ్వరికీ చూపించలేనట్లుగా మాసి ముడతలు పడ్డ చీర చెంగుతో కప్పుకున్నది.

ఒక్క సంఘటన జానకి జీవితాన్ని ఎంతగా మార్చివేసింది?

స్మశాన భూమిలో సమాధుల్లా అందరూ పడుకొని నిద్రలోకి ఒరిగిపోయారు ఆ యింట్లో.

## 2

తెల్లవారుతుండగానే లేచింది కాత్యాయిని.

బాబు వళ్ళు చల్లగావున్నది. 'హమ్మయ్యా' అన్నట్లుగా ఓ తేలిక నిశ్వాసం విడిచింది పక్కన జానకి ఇంకా ముఖంమీద కప్పుకున్న చీరచెంగును తన ముఖాన్ని ఎవ్వరూ చూడగూడదన్నట్లుగా తీయనేలేదు.

"జానీ! లేచి మొఖం కడుక్కో!"

జానకి మాట్లాడలేదుగాని, మెలకువతోనే వున్నట్లుగా కదిలింది.

"ఇప్పుడేం తొందర?"

"తొందరలేదుగాబట్టి ముఖం కడుక్కోనంటావా?"

"లేచి ఏంచేయమంటావు నన్ను?"

"ముందు లేచి ముఖం కడుక్కో—అంతే!" అన్నది కరుకుగా.

— రాత్రి బాబు అలా జ్వరంతో వాకిట్లో అనాధుడిలా పడివుంటే ఎవ్వరూ పట్టించుకోకుండా వంటయింట్లో పడి మేస్తుండటం కాత్యాయిని గుండెల్లో కరుకుతనాన్నే పేర్చింది.

దీని కంతటికీ కారణం ఎవరూ?"

ఆ చచ్చిన మొగమనిషా?

బ్రతికున్న ఈ ఆడమనిషా?

—చచ్చిపోయాడు ఆయనకేం మహారాజు!

బ్రతికుండి చచ్చినట్లు పడివుండటానికి దీనికేమొచ్చింది రోగం?

—ఆ క్షణాన జానకి ఎలాంటి పరిస్థితులలో వున్నదీ ఆమె మనస్సంతా ఎంత అస్తవ్యస్తంగా వున్నదీగూడా ఆలోచించనీయలేదు కాత్యాయినిని ఆమె

మనస్సు...సలసలా పళ్ళు కాగిపోతుండగా వంటిన సరైన చొక్కాగూడా లేకుండా వంటరిగా ఆరుబయట వాకిట్లో పడివున్న బాబు రూపమే కళ్ళముందు కదులుతోంది.

"బీరువా తాళంచెవులు ఇటు ఇవ్వు!" అన్నది చేయిజాపుతూ

"ఎక్కడున్నయ్యో!"

"బీరువా తాళంచెవులు ఎక్కడున్నయ్యో గూడా నీకు తెలియదా!" అన్నది అసహనంగా చూస్తూ కాత్యాయిని.

"అన్నిటికీ మించిన ఆయనే నాకు కాకుండా పోయినప్పుడు—ఆ వెధవ బీరువా తాళంచెవులు ఎక్కడున్నయ్యో ఎవరిక్కావాలే!" అన్నది జానకి విసుగ్గా

"పోయిన ఆయన ఎలాగూ తిరిగి రాలేడు...ఆయనతోటే ఆ తాళంచెవులూ పోవాలా?"

"కాత్యాయినీ! నన్ను విసిగించబోకు...నీ సవాళ్ళకు సమాధానం చెప్పేటంత ఓపిక నాకు లేదు!...ఎవరిదగ్గరున్నయ్యో అడిగి తీసుకో!" అంటూనే ముఖంమీద చీరచెంగును మరింత బిగించుకున్నది.

కాత్యాయిని బయటకు వచ్చేసింది ఇక అక్కడ నిలబడటం అనవసర మన్నట్లుగా.

మళ్ళీ బాబును డాక్టరు దగ్గరకు తీసుకువెళ్లాలి. ముందు గదిలోకివచ్చి, జానకి ఆడబిడ్డ నిర్మల, అక్కడ కుర్చీలో కూర్చుని కాఫీ త్రాగుతుంటే అడిగింది, "బీరువా తాళంచెవులు ఎవరిదగ్గరున్నాయి?" అని.

"తెలియదు!" అన్నది ముఖం పక్కకు తిప్పుకుంటూ నిర్మల.

"కనుక్కోండి...నాకు కావాలి అవి!" అని అంటూనే మరోమాటకు అవకాశమివ్వకుండా బాత్‌రూంలోకి వెళ్ళి ముఖం కడుక్కోసాగింది

తనకు తెలుసు...ఆయన పోయిన యిరవైనాలుగుగంటలలోనే అక్కడ జేరిన అందరూ కలసి జానకిని ఎలాంటి స్థితిలోకి దిగజార్చింది...

ఇంకా ఒక్కక్షణం ఆలస్యంచేసినా జానకి బ్రతుకు ఇక రోడ్డుమీదకే ఈడ్చబడుతుంది

నిస్సందేహం అది...అందుకే—

లక్షమంది లక్ష అనుకోనీ—తను జానకి సర్వనాశనాన్ని చూడలేదు...

తను జానకి అడుక్కుతినడం చూడలేదు

తనైనా నడుంకట్టుకోక తప్పదు

చీరెచెంగుతో ముఖం తుడుచుకుంటూ బాత్‌రూంలోనుంచి బయటకువచ్చింది వస్తూనే నిర్మలను చూస్తూ, ''తాళంచెవులు దొరికినయ్యా!" అన్నది.

"నాకు తెలియదని చెప్పానుగదా!" అన్నది నిర్లక్ష్యంగా నిర్మల

"తెలియదంటే ఎలా అండీ... పిల్లవాడు మూసినకన్ను తెరనకుండా పడివున్నాడు...డాక్టర్ దగ్గరికి వెళ్లాలి...ఎవ్వరూ వెళ్ళే ప్రయత్నంకూడా చేయటంలేదని నాకుతెలుసు...కనీసం నేను వెళ్ళుదామన్నా డబ్బుకావాలిగదా... అందుకే బీరువా తాళంచెవులు కావాలనేది...జానకి అలా అక్కడ చీకట్లో సగం చచ్చిపడి వున్నది!" అన్నది సౌమ్యంగా—అర్థంచేసుకోగలదనే సదుద్దేశ్యంతో.

''ఇదేం అదవిగాదే...మేమేదో పిల్లవాడికి ప్రాణంమీదకు వచ్చినా మందు ఇప్పించటంలేదని మీరెందుకనుకోవాలి!"

"అనుకోవటమేమిటి...నా కళ్ళతో చూస్తుంటేను!''

"ఏంచూశారు మీరు!" నిర్మల కంఠం హెచ్చించింది. "మా కంటే దగ్గర బంధువులా మీరు...ఎవరి పరిధుల్లో వాళ్ళుఉండటం ఎంతో మంచిది ... వాడి మంచి మాకంటే మీరెక్కువగా చూడగలరనా మీ వుద్దేశ్యం...ఆవిడగారు మీకెంత స్నేహితులైనా...వాడు నా స్వంత అన్నకొడుకని మాత్రం గుర్తుంచుకోండి...అన్నది. "అంతేగాదు...ఆ మూలగదిలో మా అమ్మ ఉబ్బసంతో ఎలా రొప్పుతోందో ఒక్కసారి తొంగిచూడండి...కానీ మేం మీలాగా మనుష్యుల ప్రాణాలే పోతున్నట్లుగా...జనమంతా కలిసి చంపేస్తున్నట్లుగా హడావుడి చేయటంలేదే!''

అప్పటికే అన్ని తలుపుల దగ్గరా అందరూ పోగయ్యారు.

తను తొందరపడుతున్నానా అనిపించింది, క్షణం కాత్యాయినికి. మరుక్షణంలోనే—అనాధలా చీకటిలో మూలపడివున్న జానకి గుర్తుకు వచ్చింది. ఆ పైన మంచులో వంటిన చొక్కాగూడా సరిగ్గా లేకుండా—జ్వరంతో వెక్కుతూ పడివున్న బాబు గుర్తుకు వచ్చాడు.

ఊహూ...తప్పదు—కంఠం తనూ హెచ్చించింది.

"అయితే రాత్రి నేను వచ్చేటంతవరకూ వాడికి మందు ఎవ్వరూ ఎందుకు ఇప్పించలేకపోయారు!''

"మాకూ పిల్లలున్నారు...మేమూ పిల్లల తల్లులమే...కాస్త వళ్ళు వెచ్చపడి.. ముక్కునుండి రెండుబొట్లు నీరు కారినంత మాత్రానే గిజగిజలాడిపోం...

ఇంత మిరియాల కషాయం కాచిపోస్తే అదే పోతుంది...దానికోసంగానూ పదులకు పదులు తగలెయ్యక్కర్లేదు!"

"పోనీ ఆ మిరియాల కషాయమైనా పోశారా ?"

"పోయలేదని మీకెలా తెలుసు ?" ఆమె మొండిగా అడిగినతీరు అది సర్వార్ధమనే చెప్పక చెబుతోంది.

"ఖచ్చితంగా నేను చెప్పగలను...మీరు పోయలేదు!'' మరింత మొండిగా అన్నది కాత్యాయిని

"సరేనమ్మా మేంపోయలేదు...పోయం...చూశావూ —మేం రాక్షసులం... మేం ఎందుకూ పనికిరానివాళ్ళం...మాకు జాలిలేదు...మేం పిల్లల్ని పెంచలేదు—ఇప్పుడు ఇంతకీ ఏమంటావ్ ? "అప్పటివరకూ గోడకు జారిగిలబడి కూర్చున్న సన్నటి ముసలాయన లేచి వాళ్ళిద్దరి సమీపానికి వచ్చాడు.

ఆయన మాటలకు అవాక్కై అయింది కాత్యాయిని

"అదిగాదు బాబాయిగారూ ! ... నా ఉద్దేశ్యం మీరంతా కలిసి వాడినేదో చేసేస్తారని గాదు...వాడు తెల్లవార్లూ నిద్రలో ఉలిక్కిపడుతూనే వున్నాడు... నా బాధంతా ప్రస్తుతం జానకి భర్తలేనిదే అయింది...కొడుకు కూడా లేనిదవ్వగూడదనే నా కోరిక—అంతే !''

"మా కోరికా అదేనమ్మా ?... దానికోసరం శవంలేచి ఇంకా ఇరవై నాలుగు గంటలయినా కాలేదు ఈ గృహంలో అప్పుడే మనస్పర్ధలా ... ఉహూఁ ... ఇదేం బాగోలేదమ్మా ... నిన్నూ నేను అర్థంచేసుకోగలను ... మీ మిత్రురాలి దుఃఖాన్ని నీవు చూడలేని స్థితిలో వున్నావ్...నీవు ఏం మాట్లాడుతున్నావో నీకే తెలియని స్థితిలో వున్నావ్ ... తప్పమ్మా అది ! పోయింది నిర్మలకు స్వంత అన్నయ్య...వాడి కొడుక్కి జ్వరమంటే అదిమాత్రం సుఖంగా వుంటుందనే... నీకు తెలుసో తెలియదో—రాత్రి వాడికోసరమే పచ్చిగంజయినా ముట్టకుండా పడివున్నది...అలాంటి దానిమీదే అభాండాలువేసి మనస్తాపం కలిగిస్తే ఎలా... ఇటు యివ్వు ఆ పిల్లవాడిని...నేను డాక్టర్ దగ్గరకు తీసుకువెళ్ళి మందు ఇప్పించి తీసుకువస్తాను !'' అన్నాడు అనునయంగా — అంతేగాదు అతడి మాటలు కాత్యాయినికి సన్నసన్నగా చివాట్లుపెడుతున్నట్లే వున్నయి.

కాత్యాయిని ఆయన మాటలకు నోరెత్తలేకపోయింది.

"చూడు నిర్మలా ! పదో, ఇరవయ్యో ఖర్చు అవుతయ్యని మంచి మందు ఇప్పించలేదని నలుగురూ ఎందుకనుకోవాలి...ఇప్పటికే నీ చేతివి రెండువంద

లయినా ఖర్చుపెట్టావా...దాని ముందు ఈ పదీ ఎంత...ఇటు పారేయ్...ఒక సూదిమందు వేయించుకువస్తే అందరికీ తృప్తి !" అన్నాడు

"అలాగే మామయ్యా !" అన్నది నిర్మల కాత్యాయిని వంక ఒక్కసారి గర్లురిమి చూసి, గదిలోకివెళ్ళి, తన పెట్టెతెరిచి రెండు అయిదు రూపాయిల నోట్లుతెచ్చి ఆయన కిచ్చింది.

"చూడమ్మా ! నీ పేరేమిటో నాకు తెలియదుగాని...పిల్లవాడికి కాస్త ముఖం కడిగి ఓ ఇస్త్రీ చొక్కా తొడిగి తెచ్చి ఇవ్వమ్మా...వెళ్లొస్తాను !"

"అలాగేనండీ !"

కాత్యాయిని లోపలికి వచ్చింది. వాళ్ళంతా ఒక్కటేనని ఆ సంఘటన అక్షరాలా ఋజువుచేసింది. అంతేగాదు ... ఆయన మాటల్లోని సౌమ్యత తెచ్చిపెట్టుకున్నదేనని స్పష్టంగా తెలుస్తూనే వున్నది.

దబదబా పిల్లవాడివంటిని వేడినీళ్ళగుడ్డతో తుడిచి శుభ్రమయిన చొక్కా వకటి తొడిగి తీసుకువచ్చి ముసలాయనకు అందించింది

"నీవు గూడా వస్తావా అమ్మా ?"

"మీరు వెళ్ళరండి బాబాయిగారు ! ఇదుగోండి రాత్రి చీటి !"

"మంచిదమ్మా !"

* * *

పదకొండు గంటలప్పుడు ఇంటిముందు ఆటో ఆగింది. అందులోనుంచి జానకి బావగారు దిగారు ఆయన ఢిల్లీలో ఓ పెద్ద ఆఫీసరు. తమ్ముడు పోయిన విషయం టెలిగ్రాంద్వారా తెలియజరిచినా అక్కడ పనుల ఒత్తిడిలో ఆయన వెంటనే బయల్దేరి రాలేకపోయాడు.

అప్పటికీ పనులన్నిటినీ ఎక్కడివక్కడ వదిలేసి ... హైద్రాబాద్‌వరకూ ప్లేన్‌లోవచ్చి ఆపైన ఇక్కడికి బస్సులో వచ్చేటప్పటికి ఈ టైం పట్టింది.

వస్తూనే పలకరించినవాళ్ళకు ముక్తసరిగా రెండుమాటలు సమాధానంగా చెప్పి జానకి గదిలోకి వెళ్ళాడు.

ఆయనన్ను చూస్తూనే బావురుమన్నది జానకి.

"ఊరుకో జానకీ ! ... వాడు నాకంటే చిన్నవాడే అయినా ముందుగానే వాడికి నూరేళ్ళు నిండినయి ... ఏం చేస్తాం చెప్పు ... కొన్ని కొన్ని మనం ఊహించలేనివీ, సరిపెట్టుకోలేనివీ జరుగుతుంటయి ... కానీ తప్పదు...అదృష్టు




అవ్వాలి... నీవే తల్లడిల్లిపోతే ఊహ తెలిసీ తెలియని బాబున్నాడు ... రేపటి నుంచీ వాడి బాగోగులు చూడవలసినదానివి నీవే !" అన్నాడు అనునయంగా

ఆయన వెనకగా నిర్మల వచ్చింది.

"చచ్చిపోయేటంతవరకూ నవ్వుతూ మాట్లాడాడుటరా.. నిన్నే అనుకున్నాడుటరా !" అన్నది పెద్దగా ఏడుస్తూ.

ఎనగ్గా తల్లి వచ్చినట్టున్నది. ఆమెకిది పెద్ద దెబ్బే.

"నాయినా ! చలపతీ ! ...ఇక ఈ ఇంటిని ఓ కొలిక్కి తీసుకురావాల్సినవాడివి నీవు... ఈ ప్రపంచంలో మన జానకి తల్లి ఏలా నెగ్గుకువస్తుందో ఆపైనున్న భగవంతుడికే తెలియాలి...పసివాడు ఇప్పుడే వెలిగించిన దీపం...వత్తి కొడిగట్టకుండానూ, దీపం కొండెక్కకుండానూ నూనెపోస్తూ చూస్తూవుండటమే అది చేయవలసినపని...తరువాత దాని అదృష్టం !" ముసలాయన గోడనానుకొని మోకాళ్ళమీద కూర్చుంటూ అన్నాడు.

కాత్యాయిని దూరంగా ఓ మూలగా భుజంనిండా చీరచెంగు కప్పుకొని ఆ మనుష్యులను చూస్తూ నిల్చున్నది.

జానకి దుఃఖంతో మెలికలు తిరిగిపోతోంది.

"నేనెందుకు బ్రతకాలి ?"

కాత్యాయినికీ జానకి దుఃఖం కళ్ళవెంట నీరు తెప్పిస్తోంది.

"ఇంకా జరగవలసిన తతంగాలు చాలా వున్నయి.. ఇక నీవు వద్దావు—

నాకు సగం భారం తీరింది ... ఓ పదిహేనురోజులు శెలవుపెట్టావా ?" ముసలాయినే అడిగాడు.

"లేదు మామయ్యా! సాయంత్రం బయల్దేరి అక్కడికి రేపే వెళ్ళిపోవాలి... అటు డైరెక్టర్స్ మీటింగ్ ... ఇదేమో నేను వచ్చేనెలలోనే ఫారిన్ వెళ్ళాలి బిజినెస్ టూర్‌మీద ... వాటి ఏర్పాట్లు చేసుకోవాలి ... మళ్ళీ వీలుంటే పదో రోజుకు వస్తానులే..."

ముందు గదిలో అంతా మంచంమీద కూర్చున్నారు.

తల్లి దుఃఖానికి అంతులేకుండా వున్నది కంఠం హెచ్చించి పెద్దగా రోధించసాగింది. పెద్ద కొడుకు ఎన్ని మాటలుచెప్పినా ఆమె ఏడుపు ఆపటమే లేదు

ముసలాయిన ఆయన ఎదురుగ్గా కూర్చున్నాడు.

"చెప్పు మామయ్యా ! నీ ఆరోగ్యం ఎలా వున్నది...నిన్ను చూచి అయిదారేళ్ళయింది...ఇటు రావటమేలేదు ఈ మధ్య అంతగా ... వీడి పెళ్ళికివచ్చినా అంతా కలుసుకునేవాళ్లం ... అప్పుడు అమెరికాలో వుండటంతో రాలేక పోయాను ... తరువాత ఇటు రెండు మూడుసార్లు వచ్చినా ... మన ఊళ్ళదాకా రాలేకపోయాను !"

"అవునుతా నాయినా ! మేం ముసలవాళ్ళం అయిపోయాం ... ఆపైన దూరాన వుండటం—అంతస్థులు మారటం..."

"ఎన్ని అంతస్థులు మారినా ... అవన్నీ క్షణికాలే మామయ్యా ! ఇవాళ ఇలా వున్నాను...రేపు ఎలా వుంటానో ... ఎప్పుడు ఎలా వున్నా కావాల్సిన మీకుమాత్రం దూరంకాలేను !"

నిర్మల తువ్వాలలు తెచ్చిపడేస్తూ, "లేవరా పెద్దన్నయ్యా ! ... స్నానం చేస్తే ... టిఫిన్ చేస్తున్నాను ... తిందువుగాని ... కాఫీత్రాగి కూర్చోవచ్చు !" అన్నది మంచం పక్కగా నిల్చుంటూ. "పిల్లలు కులాసానా ? ... వంటరిగా వదిలిరాకపోతే వాళ్ళనుగూడా తీసుకురాగూడదూ !"

"వచ్చి ఏంచేస్తారు ఇక్కడ—అక్కడ స్కూలు పోగొట్టుకోవటంతప్ప— వండి పడేసేటందుకు నాయర్ వున్నాడు — కావాల్సినవి చూసేందుకు ఆయా వున్నది !"

"అదిగాదురా అన్నయ్యా ! నీకెంత వయస్సువచ్చిందని అలా పెళ్ళిచేసుకోకుండా కూర్చుంటావ్ — అప్పుడే వదినపోయి మూడేళ్ళుకాలా — ఇంటికి

ఇల్లాలే ఓ దీపం అన్నారు — ఇంటిముందు సీళ్ళచల్లి ముగ్గేయని ఇల్లు ఏమిల్లు ?" అన్నది కాస్త పెద్దతనం ఒలకబోస్తూ కోపగించుకుంటున్నట్లుగా.

"గడిచినన్నాళ్ళే గడుస్తుందిగానీ—అమ్మా! ఇక నీవు నా దగ్గరకు వచ్చేయరాదుటే—ఇంకెన్నాళ్ళుంటావ్ ఆ పల్లెటూళ్లో—ఆ కాస్త పొలం అమ్మేద్దాం—ఇన్నాళ్ళు ఏదో ఓ పనిమైళ్ళదూరంలోనైనా పీకున్నాడని నిన్ను వంటరిగా వుండనిచ్చాంగానీ అక్కడ—''

తల్లి ఏడుస్తూనే, ''నేను రానురా నాయినా ఎక్కడికీ—నేను అక్కడ ఆ మట్టిలో కలిసిపోవాల్సిందే — వాడున్నాడుగా ?'' అన్నది ముసలాయనను చూపిస్తూ.

ఆయన లేవటంతో అందరూ లేచారు.

పసివాడికి ఇంకా జ్వరం తగ్గలేదు.

జానకి పక్కగా వాడిని పడుకోపెట్టి, వాడి వంటిమీద చేయివేసుకొని శూన్యంలోకి చూస్తూ కూర్చున్నది కాత్యాయిని.

ఆ గది మళ్ళీ శవాన్ని తగలేసి జనమంతా వెళ్ళిన తరువాత స్మశానంలో ఏర్పడ్డ నిశ్శబ్దంలా వున్నది. జానకి మనస్సు కాలుతున్న శవంలా వున్నది.

ఆయన వున్నకాలంలో—ఆయనమీద ఇంత ప్రేమ వలకబోసే ఒక్కళ్ళూ వచ్చేవారుగాదు -- అంతదాకా ఎందుకు శవాన్ని వాకిట్లో పెట్టేటందుకే మనుష్యుల్ని వెతుక్కోవాలా అన్నంత భయపడిపోయింది తను.

ఆయన మిత్రులు సుబ్రమణ్యంగారే చాలావరకు ఆదుకున్నారు.

ఎందుకు ఈ చుట్టాలు ?

ఎత్తుకు తిననా ?

భర్తరూపం కళ్ళముందు మెదిలింది.

కంటివెంట నీరు కారసాగింది.

కాత్యాయిని జానకి భుజంమీద చేయివేసి తనవైపుకు తిప్పుకుంటూ, "జానకీ ఒక్కమాట అడుగుతాను చెప్పు !" అన్నది. "మీ బావగారు ఎలాంటివారు—ఆయనా ఓక రాజందేనా ?''

జానకి శూన్యంలోకి చూస్తున్నట్లుగా భయంగా చూస్తూ, "స్మశానంలో తిరిగేవి ఏంవిటి ?'' అన్నది.

కాత్యాయిని మిత్రురాలి ముఖంలోకి ఒక్కసారిచూచి, "జానీ! నన్నుగూడా అలాగే అనుకుంటున్నావా ?'' అన్నది నవ్వుతూ.

జానకి ఆవేశంగా కాత్యాయని భుజంమీద పడిపోయి ఏడుస్తూ, "నన్ను ఎంతగా అర్థంచేసుకున్నావె కాత్యా ! అన్నది

ఒక వేడి నిట్టూర్పు విడిచింది కాత్యాయని.

"ఊఁ హూఁ—నాకెలాంటి అనుమానమూ లేదుగాని—ఈ క్షణాన నీ మానసికస్థితి ఎలావున్నదో తెలుసుకుందామని అడిగాను — అయితే నేనోపని చేద్దామనుకుంటున్నాను—నీకు అభ్యంతరమా ?''

ఏమిటన్నట్లుగా కన్నీటితెరల నడుమగా చూచింది

"ఈ స్మశానానికి నేను కాటికాపరి నవుతానే !"

"మిగిలిన అస్థికలని ఏం చేస్తుంటావ్ ?"

పేలవంగా నవ్వుతూ, ''జాగ్రత్తగా తీసుకువెళ్ళి త్రివేణీసంగమంలో ... వుతాను !" అన్నది తలఎగరేస్తూ

* * *

సాయంత్రం అయిదవుతుండగానే జానకి బావగారు మరోసారి స్మశానంలో కాలుపెడుతున్నట్లుగా జానకి గదిలో కాలుపెట్టారు.

వస్తూనే, "అమ్మా జానకీ ! నీవు చిన్నదానివి— నీ కొచ్చిన కష్టాన్ని ఎన్నిసార్లు ఏకరువుపెట్టినా ఒరిగేదమీలేదు — నేను ఈ రాత్రికే వెళుతున్నాను — ఏదోరోజుకు మళ్ళీ రావటానికి ప్రయత్నిస్తాను — నీవేం అధైర్యపడవద్దు — మేమంతా వున్నాం — నీకే ఇబ్బందీ కలగకుండా చూస్తాం — ఇదుగో ఈ రెండొందలూ వుంచు— నీ దగ్గర డబ్బులేదనిగాదు — నా తృప్తి — అంతేగాదు—ఇంకా అవసరమనుకుంటే ఓ టెలిగ్రాం పారేయించు—నేను టిఎమ్వో పంపుతాను—డబ్బుకు వెనకాడటంగాని, ఇబ్బందిపడటంగాని ఏమీ చేయవద్దు—మొఖమాటపడివద్దు— వస్తాను మరి—బాబు జాగ్రత్త !'' బయటకు వచ్చేశాడు ఆయన.

ఒక్కసారి దడదడా వానకురిసేసి వెలిసినట్లుగా వెళ్ళిపోయాడు ఆయన.

ఆయన వెళుతుండే ఇంట్లోవున్న జనమంతా—శవాన్ని ఎత్తుకెళ్తుంటే చివరిచూపుకు వాకిట్లోకివచ్చి నిల్చున్నట్లు నిల్చున్నారు.

ఆ రాత్రి పడుకోబోయేముందు కాత్యాయని మరోసారి జానకిని అడిగింది.

"ఏమే జానీ !—చెప్పన్నది గుర్తున్నదిగదా—నేను నడుంకట్టుకోక తప్పేటట్లు లేదే—ఏమంటావ్ — నేనేం చేసినా నీవు అపార్థంచేసుకోకుండా వుంటావనే ముందుగా నీకు చెప్పటం !''

జానకి మాట్లాడలెదు—ఆమె శరీరాన్ని భయింలాంటి ఒణుకు ఊపుల ంటు.

తనమీదగా ఎగురుతున్న రాబందుల చూపులనుండి, వాటి పోట్లనుండీ తప్పు కోవటం కష్టమే—

కాని—

రేగిన జుట్టుతో, గుండీలు గూడా పెట్టుకోని చొక్కాతో కటిక నేలమీద పడివున్న బాబు భవిష్యత్తును మలుచుకోవాలంటే తప్పదు—తన జీవన రహదారితోనూ ముళ్ళనూ, రాళ్ళనూ వేరేసుకోక ఇక చేసేదేమున్నది—

''మాట్లాడవేం ?''

''ఏం మాట్లాడమంటావ్ ? నాకోసరం నిన్ను నిప్పుల్లో దూకమనేదా ?''

"ఛస్—వెధవ ఏడుపూ నీవూనూ—నిప్పుల గురించి నాకు భయంలేదు—నీ వద్దా సే నాకు కావాలి ?''

"ఊఁ—" అన్నది దిగులుగా, భయంగా.

''థాంక్యూ— గెలుపు అనే ధైర్యం లేకపోతే మనిషి ఏ పనీ చేయలేడు—నాకు కావాల్సినంత వున్నది—సరా ?'' అన్నది కాస్త ఎగతాళిగా కాత్యాయిని.

3

ఉదయాన లేస్తూనే బాత్‌రూంలో ముఖంకడుక్కొని చీరెచెంగుతో ముఖం తుడుచుకుంటూ బయటకువచ్చింది. అప్పటికే రాజుగారూ, మంత్రులూ, సామంతులూ, సైన్యాధిపతులూ పరివేష్టించి నిండుపేరోలగంలా వున్న ఆ హాలులో కాలుపెడుతూనే, "నిర్మలగారూ ! జానకి మిమ్మల్నెవరినైనా ప్రస్తుతానికి ఓ వేయిరూపాయిలు సర్దమన్నది—ఈ హడావుడి అంతా అయింతరువాత చూసుకుందాం అన్నది ?'' అన్నది.

ఆ హాలంతా ఒక్కసారిగా చీమ చిటుక్కుమంటే వినబడేటంత నిశ్శబ్దమేర్పడింది.

"మిమ్మల్నే నిర్మలగారూ !" రెట్టించింది జానకి.

''నిన్ననేగదా పెద్దన్నయ్య రెండొందలు ఇచ్చింది — ఇప్పుడంత అవసరమేమొచ్చింది—అయినా అంత వెయ్యికావాల్సివచ్చినప్పుడు వాడు అడగమనంగానే అడిగితే వెళ్ళగానే పంపేవాడుగదా ?" అన్నది కోలుకొని.

''ఏవో మరి—కొద్దిగా అర్జంటుగా తీర్చవలసిన అప్పులు వున్నయ్యనుకుంటాను—ఇంట్లో ఎంత వున్నదో దానికి తెలియదు — ఆ బీరువా తాళం చెవులు ఇలా పారేయండి—చూద్దాం ?''

"ఆ బీరువాలో ఏమున్నది మట్టి—శూన్యం !" అన్నది విసురుగా నిర్మల.

"ఇంకేం—ఏఁవీ లేనప్పుడు ఆ తాళంచెవి ఇలా పారేస్తే దాన్నే ఒక్కసారి ఆ ఖాళీ అయిన బీరువాచూసి ఆనందించమంటే సరిపోతుందిగదా — అదేదో దాంట్లో తను పెట్టిన లక్షలన్నీ భద్రంగా వున్నయ్యనుకోవటం — అక్కడేమీ లేకపోవటం—ఇదంతా దేనికి ?"

"అమ్మా కాత్యాయినీ ! బీరువా తాళంచెవులూ — బీరువా తాళంచెవులూ అంటావ్—ఒక్కమాట నాకు చెప్పమ్మా — ఆదేదో నీకు కావాలని ఇవ్వటం లేదనా నీ ఉద్దేశ్యం— ఆఁ హాఁ—నాకు తెలియక అడుగుతాను — నిర్మలా ఇచ్చేయమ్మా — మనిషి లేచి రెండురోజులయినా కాలేదు ఇంకా ఈ ఇంట్లో— అప్పుడే అపార్థాలూ, అనుమానాలూనా—వద్దమ్మా—ఇచ్చేయమ్మా !" ముసలాయన గోడకు జారిగిలబడే చేతులూపుతూ అన్నాడు.

"అదికాదు బాబాయిగారూ !— నా ప్రయత్నమంతా—"

"నాకు తెలుసమ్మా !—నాకు తెలుసు— నా వయస్సు ఇదుగో వున్నది చూడావూ— నా తలమీద మిగిలిన వెంట్రుకలకన్నా ఎక్కువే — ఏం ఫరవా లేదు—నా అండదండలు నీకు ఎప్పుడూ వుంటయి — నీ ప్రయత్నాలన్నిటికీ నా చేయూత ఎన్నడూ వుంటుంది—మన మెంతమందిమి, ఎన్నిచేసినా కష్టంలో వున్న ఆ జానకి కోసరమేగదమ్మా—కానీయమ్మా కానీయ్ !" అన్నాడు సౌమ్యంగా ఆయన నవ్వుతూ.

కాత్యాయిని వింతగా ఆయన ముఖంలోకి చూచింది.

—ఈ మహానుభావుడు అవులించకుండానే పేగులు లెక్కపెట్టేస్తాడు !

నిర్మల విసురుగా వచ్చి కాత్యాయిని ముందు తాళంచెవులగుత్తి పడేసింది. "తీసుకోండి — దాంట్లోవన్నీ మేం తింటున్నామని మీకెందుకు బాధ — నూరేళ్ళు బ్రతకవల్సిన మా చిన్నన్నయ్య పాతికేళ్ళకే మాకు గాకుండా పోయాడు—చెట్టంత మనిషి వాడే పోంగా వెధవ బీరువాలూ, తాళంచెవులూ మాకెందుకు ? మేం ఏంచేసుకోను !"

ముసలాయిన ఒక్కఉదుటున గోడనువదిలిపెట్టి లేచాడు. లేస్తూనే క్రిందపడ్డ తాళంచెవుల గుత్తిని చేతిలోకి తీసుకుంటూ కళ్ళకద్దుకొని, "తప్పమ్మా నిర్మలా ! ఉఁ హూఁ—అలా చేయగూడదు—నవ్వుతూ ఇవ్వాలమ్మా", అంటూనే కాత్యాయిని వైపుకు తిరిగి, "దానితత్వమే అంత కాత్యాయినీ—కానీ మనస్సు వున్నది చూడావూ వెన్నలాంటిది—చిన్నన్నయ్య పోయాడనే వ్యథలో




ఏవేవో పిచ్చిపిచ్చిగా వేస్తున్నదిగానీ — క్షమించి మర్చిపో అమ్మా — ఇదిగో తాళంచెవులు—కళ్ళకద్దుకొని మరీ తీసుకో అమ్మా !" అన్నాడు.

కాత్యాయిని తాళంచెవులు తీసుకొని కాస్త అస్తవ్యస్తంగా వున్న మనస్సుతో జానకి గదిలోకి వచ్చేసింది.

కాత్యాయిని అటు వెళ్లగానే నిర్మల సుడిగాలిలా ముసలాయిన దగ్గరకు వచ్చింది.

"నీ పద్ధతేం బాగోలేదు మామయ్యా ! ముక్కూ మొహం తెలియని ఆ అమ్మాయి అడగటం—నీవు ఇమ్మనటం—" ముక్కుపుటాలు ఎగరవేస్తూ నిల్చున్నది కోపంతో వగరుస్తున్నది.

ఆయన సన్నగా పెదిమలు కదల్చకుండా నవ్వాడు. ఆ తరువాత పాము నాలికను కదిలించినట్లుగా వడివడిగా పెదిమలను నాలికతో తడిచేసుకున్నాడు.

"నేను ఆ అమ్మాయికి యిచ్చింది తాళంచెవులు కాదే నిర్మలా — పెద్ద తాటికి చివరికొస—ఇప్పుడు ఆ అమ్మాయి ఆ కొసను పట్టుకొని ఎటూ చూడకుండా హుషారుగా పైపైకి పాకేస్తుంది — చివరిదాకా ఎక్కనిచ్చి సింపుల్‌గా తాడును కోసేయటమే మనం చేయాల్సిన పని," కళ్ళు చికిలించి విషం చిమ్మాడు ఆయన.

* * *

"చెప్పు జానకీ ! నీ మెళ్లో గొలుసులన్నీ ఏమయినయి—బీరువాలోనే వున్నయ్యా !".

"అవునే కాత్యాయినీ! ఆ క్రితంరోజు ఆసుపత్రికి వెళుతూ ఈ బోడి అలంకరణంతా దేనికిలే అని తీసి బీరువాలో పడేశాను—"

కాత్యాయిని వెళ్ళి బీరువా తెరిచింది.

అలా తీస్తూనే ఇట్టే గమనించింది—కిటికీలలోనుంచి, తలుపు సందులలో నుంచి అందరూ తననే గమనిస్తున్నారు. సిగ్గుతో క్షణం కలవరపడింది.

ఆపైన గుండెను ఇనుములా చేసుకొని ఇంకొక్క క్షణంగూడా ఆలోచించకుండా బీరువాతలుపుతీసి సగంమూత తెరిచివున్న చిన్న రేకుపెట్టెను చేతులోకి తీసుకొని మళ్ళీ బీరువా మూసేసింది.

జానకి దగ్గరకు వస్తూనే, "చూడు అన్నీ వున్నయ్యా?" అన్నది.

"వుండకేమౌతాయి—అన్నీ వుంటయి...నీవే చూడు!"

"నీ వీమధ్య కొత్తవేమీ కొనకపోతే నీవన్నీ నాకు తెలుసు—" అన్నది పెట్టెమూత తీసిచూస్తూ.

"రవ్వల నెక్లెస్మాత్రం ఆయనింకా పదిహేనురోజులకు పోతారనగా వచ్చింది!—ఆ ఒక్కరోజే పెట్టుకున్నాను దాన్ని! దుఃఖం కంఠంలో గరగర మన్నది.

కాత్యాయిని తలెత్తి ఒక్కసారి తీక్షణంగా జానకి ముఖంలోకి చూచింది

"దీంట్లో అదిలేదుగాని—నా లెఖ్ఖ కరెక్టయితే—మీ ఆడబిడ్డ మెళ్లో వున్నది అదే అవ్వాలి!"

"అయివుండవచ్చు!" అన్నది నిర్లిప్తంగా జానకి.

"సిగ్గులేదూ అలా అనటానికి—ఎందుకు ఇంత వయస్సువచ్చి - ఎత్తుకు తిననా—కనీసం బుద్ధితెచ్చుకొని నేను ఏంచేసినా చూస్తూవూరుకో—అయిందేదో అయిపోయింది—ఇకముందు జాగ్రత్తన్నా పడదాం — కాదూ అని నోరుతెరిచావా—నీ కళ్లముందే నాతల పగలగొట్టుకుచస్తాను—నీవు ఈ ప్రపంచంలో ఎప్పుడు బ్రతకటం నేర్చుకుంటావే పిచ్చిదానా!"

జానకి ఎంత నిగ్రహించుకున్నా కళ్ళవెంట నీటిని ఆపుకోలేకపోతోంది.

కాత్యాయిని లేచివెళ్ళి బీరువాతలుపులు బార్లాతెరిచి గుడ్డలన్నీ కెలికింది. బరబరా డ్రాయరు సొరుగులు లాగి తిరిగిమూసింది. రెండు మూడు స్టీలు గిన్నెలు దాంట్లోనే వంచిచూసి ఎత్తిపడేసింది.

"ఇసేయ్ జానకీ ఇలారా! వచ్చి నీ సౌభాగ్యాన్ని చూసుకో—ఏవో వంద



లుండాలంటుంటివి గదా — ఏమున్నయ్యో — ఈ పదిరోజులు ఎలా తెల్లవారుస్తావో — నట్టింట నయాపైసా లేకుండా...రా !"

జానకి తనకి చేసింది ఏదేవన్నట్లుగా కంఠాన్ని పెంచి రోదించసాగింది.

'ఏడిస్తే డబ్బువచ్చి వళ్ళోవాలుతుందనుకున్నావా — ఊఁహూఁ!" అంటూనే బీరువాకు తాళంవేసింది. "ఆలోచించు...ఆలోచించి చెంబూ, తప్పాలాలు ఏవేవి అమ్మాలో చెబితే అమ్మి డబ్బుతెస్తాను !" అంటూ జానకి దగ్గరకు వచ్చింది.

జానకి తలెత్తి చిన్నగా, "అనవసరంగా రభస చేయబోకే కాత్యాయినీ ! నీకు పుణ్యముంటుంది. మాది జాయింట్ ఎకౌంటే...డబ్బు బ్యాంకులో వున్నది – చెక్ సంతకంచేసి ఇస్తాను – ఎంత కావాలో తీసుకురా !" అన్నది చికాగ్గా.

కాత్యాయిని గబుక్కున ముందుకువంగి గుర్రురిమిచూస్తూ, "నోరుమూసుకోమన్నానా— మరోమాట మాట్లాడావంటే సూదీ దారం తీసుకువచ్చి నోటికి కుట్టువేస్తాను..." అంటూనే బంగారు వస్తువులున్న రేకుపెట్టెను చేతిలోకి

తీసుకుంటూ, "ఆ చేతులకున్న రెండు జతల గాజులుగూడా ఇటివ్వు..." అంటూనే చేతులవి ఊడబెరుక్కొని హాల్లోకి వచ్చింది.

"నిర్మలగారూ! మీకు తెలిసిందేగదా... బీరువాలో నయాపైసాలేదు... ఈ పదిరోజులూ ఎలా లేదన్నా ఖర్చు వేయిదాటేలా వున్నది ... ఏం చేస్తాం చెప్పండి...జానకి గొలుసు ఇలా ఇస్తే పడంటికి బ్యాంకుకువెళ్ళి వాటిని తాకట్టు పెట్టి డబ్బు తీసుకువస్తాను!"

"మా అన్నయ్య అంత గతిలేకుండా చావలేదు.. చచ్చిన నాలుగురోజుల లోనే మా వదిన వంటినవున్న సొమ్ములన్నీ తాకట్టుపెట్టాల్సిన ఖర్మ పట్ట లేదు...ఇంట్లోవుంటే అడ్డమైన వాళ్ళచేతుల్లోనూపడి కనబడకుండా కరిగిపోతుం దేమోననే బ్యాంకులోవేసి వుంచాడు—బీరువాలో పాస్‌బుక్ వున్నది—రెండు వేలకుపైగానే డబ్బువున్నది—నేను చూశాను—కావాల్సినప్పుడు బ్యాంక్ నుండి తెప్పిస్తాంగాని మీరేం హైరానపడి అనవసరంగా ఈ ఇంటి వ్యవహారా లల్లో జోక్యం చేసుకోబోకండి!" అన్నది చిటపటలాడుతూ.

క్షణం అవాక్కయింది కాత్యాయిని — నిజమే తన పిచ్చిగాని - కోటలో పాగావేసినవాళ్ళు ఇంతవరకూ దాని గుట్టూ వట్టూ లాగకుండా వుంటారా?

భగవంతుడా ఇక జానకిని రక్షించగలిగేది — మాకు కనబడని నీవు ఒక్కడివే!

తల్లీ! జానకమ్మా — కాసిని నువ్వులూ నీళ్ళూ తీసుకువస్తే రేపు మీ ఆయనకిచ్చే తిలోదకాలతోపాటు — ప్రస్తుతానికి ఈ రవ్వల నెక్లెస్‌కీ, ఆపైన ఇలాంటి మరికొన్నిటికి యిచ్చేసి, తూర్పు తిరిగి ఒక్క దణ్ణం పెట్టేద్దువుగాని!

క్షణంలో సగం ఒక రాయివేద్దాం అన్నట్లుగా తలెత్తి, "క్షమించాలి - నన్ను మీరెందుకు అపార్థం చేసుకుంటున్నారో నాకు తెలియదు - చచ్చిపోయిన ఆయననుగాని - ఆపైన ఆయనకు ఆత్మీయులయిన మిమ్మల్నిగాని తూల నాడాలనుకోవటం నా అభిమతంగాదు — నాకూ చెప్పింది జానకి బ్యాంక్‌లో వున్న డబ్బు సంగతి - కానీ ఎదురుగ్గా కనబడుతు వుండి ఏం లాభం - ఉప యోగించుకోవటానికి వీలులేకపోయినప్పుడు - చచ్చిపోయిన ఆయన చెక్కు మీద సంతకంపెట్టందే బ్యాంక్‌లో డబ్బు ఎవరిస్తారు — ఆ వ్యవహారాలన్నీ పూర్తయి ఆ డబ్బు మన చేతుల్లోకి రావాలి అంటే కనీసం రెండు మూడు నెల లయినా పడుతుంది—" అన్నది చాలా నెమ్మదిగా.

ఆ చిన్నరాయి పెద్ద అటంబాంబులా గానే పనిచేసింది నిర్మలమీద - ఆమె తెరుచుకున్ననోరు 'నిజమే కాబోలు' అన్నట్టుగా చాలా సేపటివరకూ మూత కూడా పడలేదు.

ఆ అవకాశాన్నే జారవిడవకుండా, "పోనీయ్ ఓ పని చేయండి - సొమ్ములూ వద్దు - తాకట్టూ వద్దు - మీ వారికి రాసేసి ఓ రెండు వేలు తెప్పించేయండి - ఎక్కడికి పోతుంది - రేపు అది రాంగానే తీసుకోవచ్చు - లేదా మీ పెద్దన్నయ్యకి రాయండి - డబ్బు ఎక్కడినుంచి వచ్చినా మన అందరి ధ్యేయం మీ చిన్నన్నయ్య గౌరవానికి 'ఎలాంటి భంగమూ రాకుండా వుండాలనేకదా - ఏం బాబాయిగారూ - ఏమంటారు ? - నేను చిన్నదాన్ని - నేనన్నదాంట్లో తప్పేమైనా వున్నదంటారా - చెప్పండి బాబాయిగారూ !" వాళ్ళను గుక్కతిప్పుకోనీయకుండా ఉక్కిరిబిక్కిరి చేయసాగింది.

ఆయన నడుములమీద చేతులు వేసుకుంటూ, "అవునే నిర్మలా - మీ ఆయన్ను వచ్చేటప్పుడు పట్టుకురమ్మనమని రాయగూడదూ !" అన్నాడు.

"ఆఁ — వున్నాయి ఇక్కడ చెట్టునకాస్తూ అడ్డమైన ఖర్చులకు !"

"అయితే ఒక పనిచేయి - కాత్యాయిని చెప్పిందే బాగున్నది - యిచ్చేయ్ ఆ గొలుసు—"

ఆయన మాటలకు నిర్మల ముఖం తెల్లగా పాలిపోయింది.

"మామయ్యా !" అన్నది నీరసంగా.

యిచ్చేయమ్మా - ఫరవాలేదు !" అన్నాడు ఒత్తిపలుకుతూ ఆయన.

నిర్మల విసురుగా మెళ్ళో నెక్లెస్‌తీసి కాత్యాయినికి యిచ్చేసి ముక్కు చీదేసుకుంటూ వంట యింట్లోకి వెళ్ళిపోయింది.

దాన్ని చేతిలోకి తీసుకొని విజయదరహసంతో జానకి గదిలోకి వచ్చింది.

"వీటిని ఏంచేయమంటావ్ ఇప్పుడు !"

"నీ యిష్టం !"

కాత్యాయిని బుస్సున లేచింది - "నీ యిష్టం నీ యిష్టం అంటూ వుండు - నిలువునా ముంచేస్తాను నిన్ను !"

సరిగ్గా ఆ సమయంలోనే నిర్మల మళ్ళీ ముసలాయన్ను వంటయింట్లోకి పిలిచి నిలవేసింది.

ఆయన నవ్వాడు, "ఆ అమ్మాయి ఆ తాడు పట్టుకొని ఓ అడుగు పైకి పాకిం

దన్న మాట - అంటే యిప్పుడా అమ్మాయి వేళ్ళు నేలమీద ఆని వుండవు. అవునా - అంతే - ఆ మాత్రం గుర్తుంచుకో !"

*　　　　*

"వీళ్ళను బదులిమ్మషాక్లో అల్లల్లాడించాను—" అన్నది కాత్యాయని గర్వంగా. మాటమాటకు నల్లబడిపోయిన నిర్మలముఖం గుర్తుకురాగా హేలగా నవ్వుకుంటోంది.

ఆ హుషారులోనే పదిగంటలకు సావకాశంగా జానకి ఎదురుగ్గా కూర్చొని భర్తకు ఉత్తరం రాయసాగింది.

"శ్రీవారికి నమస్కారములు.

నేను మీ ముందు లేకపోవటం మీకు పిచ్చెక్కిస్తుందనేది నిజమే అయినా అప్పుడప్పుడూ మగవాళ్లకు అలాంటి పిచ్చెక్కటం శరీరానికి శ్రేయస్కరం గనుక నా రాకను మరి కొన్నాళ్ళు పొడిగించేస్తున్నాను. మన్నించండి మాష్టారూ—

జీవితం సముద్రంలాంటిది. అందమైనదీ, లోతైనదీ - ఉప్పులాంటి చేదైనదీ గూడా - ఏది అతి అయినా భరించలేం—

జానకి ప్రయాణిస్తున్న నౌక నట్టనడిసముద్రంలో తుఫానులో చిక్కుకొని విరిగి ముక్కలై చిన్నాభిన్నమైపోయింది. అది సర్వనాశనమైపోయింది. ఇప్పుడు ప్రస్తుతం నేను అలాంటిదానిచేతికి అందిన కొయ్యపలకను - అది నా యీ చిన్న ఆధారంతో ఒడ్డుకు చేరగలుగుతుందో లేదో — నేను జేర్చగలుగుతానో లేదోనని నా భయం—

అది కుక్కలు చింపుతున్న విస్తరాకు అవుతోంది.

ఈ పరిస్థితులలో నేనేం చేయాలో, ఏం చేయగూడదో - నేను వేసే అడుగుల్లో ఏది తప్పటడుగులో నాకే తెలియటంలేదు —

మీరు నా పక్కన వుంటే ఎంత హాయి ? ఎంత ధైర్యం ?

జానకి బ్రతుకు సర్వనాశనంకాకుండా వుండాలంటే అదీ దాని బాబు బ్రతికి బట్టకట్టాలంటే - నాలుగురోజులక్రితం జరిగిన దుర్ఘటనే దాని చావుకీ కారణం కాకుండా వుండాలీ అంటే - కనీసం ఓ పదిరోజులు నేనిక్కడే వుండవలసి వచ్చేటట్లున్నది.

— మీరూ రాగూడదూ ?

ప్లీజ్ -

నా జానీ ఏడుపును నేను భరించలేను. దాని బాబు - ఇప్పుడిప్పుడె విచ్చుకుంటున్న పువ్వు - రెక్కలూడిపోయి వాడిపోవటం నేను సహించలేను.

ఎవ్వరూ లేని అది మరొకరిఇంట్లో వంటలు చేసుకు బ్రతకటం నేను సహించలేను. అది అకుక్షుతినటం నేను ఊహించలేను...

— మీ కాత్యాయిని."

ఆ ఉత్తరాన్ని మడతపెట్టి కవర్లో పెడుతుండే కాత్యాయినికి కళ్ళవెంట నీళ్ళు గిర్రున తిరిగినయి. ఎదురుగ్గావున్న జానకిని - జుట్టురేగిపోయి, కట్టుకున్న చీరె మాసిపోయి - నాలుగుకోణాలకే రూపుమారిపోయి, వయస్సు పెరిగిపోయి - పళ్ళు వేలగిలపడివున్న బాబుతో - ఎదురుగ్గా వాడిచేత రెండు ఉడ్లీ తినిపించగా మిగిలిన ఖాళీప్లేటుతో...

అలాగే కన్నార్పకుండా జానకిని చూస్తున్న కాత్యాయిని - గుంటూరు రైల్వేస్టేషన్ పక్కగా ఓవర్ బ్రిడ్జి ఎక్కేముందు మెట్లక్రిందగా కూర్చునే ఓ స్త్రీ రూపం కళ్ళముందు కదలాడింది.

దుఃఖం గుండెల్ని ఎగతన్నింది.

ఇక నిగ్రహించుకోలేకపోయింది.

ఏడుపుతో బోరుమన్నది!

* * *

"ఊc - చెప్పు జానకీ! ఈ సొమ్ములన్నీ ఈ రాబందులకు అందకుండా దూరంగా దాచిపెట్టాలి - ఎక్కడ పెడదామంటావ్?"

జానకి పరిశీలనగా కాత్యాయిని ముఖంలోకిచూస్తూ, "నీవు భయపడుతున్నదంతా నిజమేనంటావా?" అన్నది.

చాలా సావధానంగానూ, తొణక్కుండానూ అన్నది కాత్యాయిని, "అది నిజమవ్వనూవచ్చు - కాకనూపోవచ్చు - కాకుండావుంటే సంతోషమే - అయిందే అనుకో — తరువాత నీవు చేసేదేమిటి? — మన ముందు జాగ్రత్తలో మనం వుండటంలో తప్పేంలేదుగదా!"

"నిజమే!"

తనకూ భయంగానే వున్నది - కాత్యాయిని మాటలను కొట్టివేయటానికి వీల్లేదు. అసలు తానాయింటికి కోడలిగా రావటం ఆ కుటుంబంలో ఎవరికీ యిష్టంలేదు. తనది బీదకుటుంబం. తల్లిలేని తనకు ఓ స్కూలు మేష్టారు తండ్రి - ఇప్పుడు ఆయనా లేడు. అన్నలు లేరు. అక్కలు లేరు. తమ్ముళ్ళు లేరు. చెల్లెళ్ళు లేరు - ఎవ్వరూ లేరు...

కట్నమిచ్చేందుకు పైసా లేదంటూ వున్న ఒక్క కండువానూ భుజంమీద వేసుకొని లేచివెళ్ళి దూరంగా కూర్చుంటే -

ఆయనే -

పట్టుబట్టాడట !

తనకున్న ఆస్తే చాలన్నాడట - అంత అందమైన అమ్మాయికి మించిన కట్నమేముంటన్నాడట - తన రెండు కళ్ళే రెండుకోట్ల వరహాలన్నాడట - తన పొడవాటి వత్తయిన వాలుజడే ఓ ముత్యాలహారం అన్నాడట -

- అసలు మిత్రురాలు మైత్రేయి ఇంట్లో దాని పుట్టినరోజు పార్టీకి వెళ్ళినప్పుడు తన ఊరు ఏదో ఆఫీసు పనిమీదవచ్చి - వాళ్ల ఇంట్లో బసచేసిన 'ఆయన' తనని మొదటిసారిగా చూడటం - తన రెండు కళ్ళనే వెంటాడి వెంటాడి పూర్వాపరాలన్నీ ఆరాలుతీయటం - మైత్రేయి తండ్రిద్వారానే తనని చూడటానికి రావటం -

వాళ్ళింట్లో ఎవ్వరికీ ఇష్టంలేదు -

కట్నం తీసుకోకపోవటం ఎంత చిన్నతనం అంటూ గునిశారు అత్తగారి ఆడబిడ్డలకట్నాలు లేకపోవటం నలుగురిలో తలకొట్టేసినట్లే వున్నదంటూ వాపోయారు - పెళ్ళి జరుగుతున్నంతసేపూ వెయ్యిరూపాయల సంపాదనలో వున్న తమ అందాల రాకుమారుడు - ఓ పల్లెటూరి పిల్లను చేసుకొని వంశానికీ, రాజ్యానికీ గూడా అప్రతిష్ఠతెస్తున్నట్లే లబోమని ఏడ్చారు.

తను ఈ మూడు సంవత్సరాల స్వర్గంలో వాళ్ళు కాలుపెట్టింది ఒకటి రెండు సార్లే అయినా - నరకం ఎలా వుంటుందో అప్పుడే చూచింది తను.

అయినా ఆయన రక్ష తన కుండటంతో తను అంతగా వాళ్ళ మాటలను, దేష్టలనూ పట్టించుకోలేదు. తన హృదయంలోని పన్నీరునంతా చల్లి, తనమీద వాళ్ళు విరజిమ్మిన విషాన్ని విరిచేశాడు. తన అంతరంగంలోనే తన వాళ్ళ మీద బాధను కుముద్చుకొని తనమీద పువ్వులు విరజల్లాడు.

ఇప్పుడో -

'వాళ్ళు' అంటే ఎంత భయమో ఇప్పుడిప్పుడే తెలుస్తోంది.

నిర్మల - తన ఆడబిడ్డ - గడపలో కాలుపెడుతూనే - వాకిట్లో వున్న శవంమీదపడి - తనే ఆయన్ను చంపినట్లుగా దీర్ఘాలు తీయసాగింది.

ఆమె మాటల్లోని అర్థం తనకు అర్థమే అయినా సర్వనాశనమయిన తనను అంతగా బాధించలేదు



- ఆలోచిస్తుంటే సర్వం చీకటిగానూ, భయంకరంగానూ కనిపిస్తోంది — బోనుల్లోనుంచి బయటపడ్డ పులులూ, సింహాలూ ఆకలిని తీర్చుకోవటానికే అన్నట్లుగా మీదిమీదికి వస్తున్నాయి.

తనేం చేయాలి ? తనకు కాస్త నీడనైనా వుంచుతారా వీళ్ళు ? ఇక తన బ్రతుకేమిటి ?

—వణికిపోతూ కాత్యాయిని ముఖంలోకే చూస్తూ వుండిపోయింది జానకి.

"చెప్పు ! ఏఁవిటి ఆలోచిస్తున్నావ్ ?" అడిగింది కాత్యాయిని "ఆయన కనబడుతున్నారా ?" కంఠం వణికింది.

"అవును !"

మొట్టమొదటిసారిగా తను ఆయన ఒడిలో జేరినప్పుడు, తన రెండు కళ్ళనూ పదేపదే ముద్దుపెట్టుకుంటూ, "నీవు నాదానివి కావటానికి కారణం ఇవే !" అన్నాడు.

- తీయని రాగాలు పలకవలసిన గత స్మృతులు హృదయం ఫలకంమీద సమ్మెటపోట్లే అవుతున్నయి.

"ఒక పని చేయవే కాత్యా ! ఆయన మిత్రులు సుబ్రమణ్యంగారని స్టేట్ బ్యాంకులో వున్నారు - ఇవన్నీ తీసుకువెళ్ళి ఆయన సలహా తీసుకొని ఏం చేయమంటే అదిచేయి - అంతకుమించి నా మనస్సు ఇప్పుడు ఏ సలహాలూ ఇచ్చేస్థితిలో లేదు !"

* * *

సాయంత్రం అయిదుగంటలప్పుడు ముసలాయిన కాత్యాయినిని "ఒకసారి పైకివస్తావా అమ్మా!" అంటూ పిలిచాడు

పైకి వెళ్ళింది కాత్యాయిని.

ఓ పక్కగా శుభ్రంగావున్న చోటుచూసుకొని, "కూర్చో అమ్మా!" అన్నారు ఆయన పిట్టగోడవారగా జారిగిలబడుతూ.

"ఫరవాలేదు - చెప్పండి బాబాయిగారూ!" ఆయనకు కాస్త దూరంగా రోడ్డుమీదకు చూస్తూ నిల్చున్నది కాత్యాయిని.

"చెప్పేందుకు ఏవున్నదమ్మా!" నీ అందుకో మమ్మల్ని అపార్థంచేసుకుంటున్నావని మా భయం - మేమంతా కలసి జానకికేదో అన్యాయం చేస్తున్నామని, ఆ అనాథను దగాచేస్తున్నామని నీ ఉద్దేశ్యంలా వున్నది - నిండు జీవితంలో నాలుగోవంతు గడవకముందే అన్నీ పోగొట్టుకున్న ఆ అమ్మాయి అంటే నీకెంత జాలివున్నదో నాకూ అంతే వున్నది - నిర్మలకీ అంతే వున్నది - కామాక్షికీ అంతే వున్నది - రాఘవులమ్మకీ అంతే వున్నది - ముసలివాడిని ఏదో చాదస్తంగా వాగేస్తున్నాననుకోకుండా నేను చెప్పింది వినమ్మా! ఈ ఇంటి విషయాలల్లో నీవు అనవసరంగా జోక్యంచేసుకోబోకు తల్లీ - మనమంతా ప్రయాణీకులం - ఎవ్వరి సీట్లలో వాళ్ళం కదలకుండా కూర్చొని మన గమ్యం రాగానే దిగిపోవటం - అటు అందరికీ హాయి, ఇటు మనకూ హాయి - నిర్మలనేదో నీవు శంకిస్తున్నావని నిర్మలబాధ - రాత్రింబవళ్ళు అన్నం నీళ్ళు లేకుండా కటికనేలను పడి ఏడుస్తోంది - నీ మనస్సును ఎవ్వరో విరిచారమ్మా? నీకు ఏదైనా అనుమానమంటూ వుంటే అదంతా నీ భయమే - గడిచిన ప్రతిక్షణం మరిచిపోతల్లీ - నీవు మా అందరికంటే గూడా జానకి మనస్సును ఎక్కువగా గ్రహించినదానివి గనుక ఆ అమ్మాయిని అనునయించి ధైర్యం చెప్పు - ఆ అమ్మాయికో అందమైన బాటను ఏర్పరుచు - ఆ అమ్మాయి తన భావిజీవితాన్ని తాను వెలిగించుకున్న చిన్న దీపంలోనే చూచుకుంటూ కూర్చోమను - ఇంకేం కావాలి? మనమంతా వున్నాం - ఆ అమ్మాయి కాళ్ళో చిన్న నూగుగుచ్చుకున్నా తీసివేసేందుకు మనమున్నాం - పైన దేవుడున్నాడు - ఈ ముసలివాడిని మన్నించమ్మా! నీవు సుఖంగా పిల్లా పాపలతో నూరేళ్ళు నవ్వుతూ తుళ్ళుతూ జీవించాలని ఆశీర్వదిస్తున్నాను - పెద్దవాళ్ళ ఆశీర్వాదం వట్టిది పోదు తల్లీ!" ఆయన లేచి కిందకువాను

దులిపి భుజానవేసుకొని తన పని అయిపోయిందన్నట్లుగా మెట్లుదిగి వెళ్లిపోయాడు.

* * *

## 4

ఉదయం పదిగంటలప్పుడు నిర్మల బయటకు బయల్దేరింది.

నిన్న సాయంకాలం మునసబుగారి నీతి బోధల్లాంటి మాటలు చెప్పిన తరువాత నోరెత్తి కాత్యాయిని మరెవ్వరితోనూ మాట్లాడనూలేదు.

స్నానంచేసి బాత్‌రూంలోనుంచి బయటకువస్తూ, "బాబుకు ఇవ్వాళ పత్యం పెడదాం — కొత్త బియ్యం వేయించి అన్నం వండండి వేరే చిన్నగిన్నెలో!" అని చెప్పింది వంటచేస్తున్నావిడితో. పనిమనిషి రాములమ్మని పిలిచి కాసిని బియ్యంతెప్పించి రాళ్ళులేకుండా ఏరించి ఇచ్చింది.

నిర్మల వరండా మెట్లుదిగుతోండగా కాత్యాయినికో అనుమానమొచ్చి వడివడిగా జానకి గదిలోకి వెళ్లింది. జానకిని తట్టిలేపుతూ, "ఒక్కసారి బయటకు చూడు!" అన్నది.

విసుగ్గా జానకి లేచింది చింపిరి తలను సర్దుకుంటూ.

"బయటకు ఎవ్వరు పోతున్నారో చూడు!"

"నిర్మలగదూ!" అన్నది కళ్ళు చికిలిస్తూ — ఎండను చూడలేనట్లుగా.

"నిర్మలేవే —!" విసుగుతున్నట్లుగా ఒక్కక్షణమాగి, "ఆవిడగారు కట్టుకున్న చీరె నీ పెళ్ళి చీరెల్లో ఒకటిగదూ!" అన్నది.

చటుక్కుని తలతిప్పి కాత్యాయిని ముఖంలోకి చూచింది జానకి. ఆపైన ఓ నిట్టూర్పు విడిచి, "పోనీయ్ వాటిని ఆలాగేనైనా సద్వినియోగం చేయనీయ్ — ఇక వాటి అవసరం నాకేమున్నది!" అన్నది తలవాల్చుకొని.

అక్కడే ఆ కిటికీ పక్కనే నిల్చున్న కాత్యాయిని కన్నార్పకుండా జానకిని చూస్తూ మూతిని సున్నాలా చుట్టి కుడిచేతిమధ్య వేలితో కొట్టుకోసాగింది. అరగంటవరకూ అక్కడనుంచి కదలలేదు. చూపుమరల్చలేదు, కన్నార్పలేదు. తరువాత ఎప్పటికో ఎవ్వరో మనుష్యులు వచ్చిన అలికిడైతే తలెత్తి గేటువంక చూచింది. అప్పుడే ఆగిన కారులోనుంచి నలుగురు మనుష్యులు లోపలికివస్తూ కనబడ్డారు.

కాత్యాయిని బయటకు వచ్చింది.

"నమస్కారమండి — మేమంతా రామ్మూర్తిగారు పనిచేసిన ఆఫీసులో పని

చేస్తున్నాం - వారి శ్రీమతిగారిని ఒక్కసారిచూచి పలకరించి మా సానుభూతి చెప్పి వెళ్దామని వచ్చాం !"

"రండి !"

హాల్లో వున్న కుర్చీల్లో నలుగురూ కూర్చున్నారు.

కాత్యాయిని లోపలికి వచ్చింది జానకి దగ్గరకు. "మీ ఆయన పనిచేసిన ఆఫీసులోవాళ్ళు వచ్చారే - కాస్త లేచి ఆ కుళ్ళుగుడ్డ మార్చుకొని ముఖం తుడుచుకొని బయటకురా !"

"దేనికి !"

"తెలియదు !"

"కనుక్కోకపోయినావా ?"

"అదేం మర్యాదే - ఒక్కసారివస్తే నీ సొమ్మేంపోయింది !"

"ఇక్కడనుంచి లేచి గడప దాటటానికే మనస్కొప్పటం లేదే !"

"ఛీ ! ఏం మనిషివే - పెద్దమనుష్యులు వచ్చినా జ్ఞానంలేకుండా ప్రవర్తిస్తానంటావ్ !"

"నన్ను బాధించకే కాత్యా !"

జానకిని చూస్తే జాలివేసింది కాత్యాయినికి.

"సరే ! చెప్పిచూస్తాను "

బయటకు వచ్చేటప్పటికి అప్పటికే మునలాయిన వాళ్ళతో బాతాఖానీలో పడ్డాడు. నిట్టూర్పులు విడుస్తూ చేతులూపుతూ ఏదేదో చెబుతున్నాడు.

"జానకి ఏదమ్మా ! రామంకు రావాల్సిన జీతం తీసుకువచ్చారు వాళ్ళు - జానకి సంతకంపెట్టి తీసుకోవాలి !"

మళ్ళీ కాత్యాయిని వెనక్కు తిరిగి రాకతప్పలేదు.

"తప్పదే జానకీ ! నీవు సంతకాలుపెట్టి మీ ఆయన జీతం తీసుకోవాలి పద !"

బిగుసుకుపోయి కొన్ని యుగాల తరువాత మొదటిసారిగా, ఈ ప్రపంచంలో కాలుపెడుతున్నట్లుగా గడపదాటింది. తూలుతూ నడిచి తలుపు పట్టుకు నిలబడింది - అయోమయంగా బయటకుచూస్తూ.

వెనగ్గా వచ్చిన కాత్యాయిని, "నమస్కారం పెట్టు !" అన్నది.

"నమస్తే !" అన్నది రెండుచేతులూ జోడించి ఖంగున.

జానకి కంఠం, కాత్యాయినికి భయంకలిగించింది.

అవతల పక్కన ద్వారం దగ్గర అత్తగారు ఆయాసపడుతూ నిల్చున్నది. వచ్చిన నలుగురూ లేచినిలబడ్డారు.

"మమ్మల్ని క్షమించాలి - ఇలాంటి పరిస్థితులలో రామ్మూర్తి ఇంటికి మేం రావాల్సి వస్తుందని ఎప్పుడూ అనుకోలేదు — చిన్నవాడే అయినా మంచివాడూ అనిపించుకొని మాకు తమ్ముడిలా మెలిగాడు — అతడికి రావాల్సిన యిరవై ఒక్కరోజుల జీతం ఏడువందల యిరవై రూపాయిలూ యివుగోండి - ప్రస్తుతానికి యక్స్‌గ్రాషియాక్రింద అయిదువందలు కంపెనీ శాంక్షన్ చేసింది - అది గూడా ఇందులోనే వున్నది - ఇక్కడ మీరు సంతకం పెట్టండి !"

అందులోనుంచి ఓ చిన్నతను స్టాంపు అంటించిన కాగితాన్ని తీసుకువచ్చి, పెన్ క్యాప్‌తీసి, - రెండింటినీ కాత్యాయినికి యిచ్చి, "సంతకం పెట్టించండి !" అన్నాడు.

జానకే అందుకొని సంతకం చేసింది. డబ్బున్న కవరును అందుకుంది.

"ఒక్కసారి లెక్కపెడితే మాకు తృప్తిగా ఉంటుంది !''

"వరవాలేదండీ !" అన్నది జానకి ఎలాంటి వికారమూ, తొణుకూ లేకుండా.

ఒక్కక్షణం కళ్లు రెపరెపలాడిస్తూ అటూ యిటూ చూసి, గడపదాటి రెండడుగులు బయటకువేసింది. ఈ ప్రపంచమంతా గిరగిరా తిరుగుతున్నట్లే అనిపిస్తోంది. సుడిగాలిలో శరీరం తేలిపోతున్నట్లే వున్నది — ప్రతి మనిషి రెండు తలలతోనూ, మూడు తలలతోనూ కనబడుతున్నాడు.

కాత్యాయిని తత్తరపాటుతో జానకిని నీడలా అనుసరించింది పడుతుందేమో పట్టుకోవాలి అన్నట్లుగా.

జానకి అత్తగారి ఎదుట నిలబడి, "ఇదుగోండి అత్తయ్యా ! మీ చిన్నబ్బాయి చివరి జీతం !" ఆమె చేతిలో ఆ డబ్బు కవరును కుక్కుతూ కటికనేలమీద కుప్పలా కూలిపోతూ రోధించసాగింది.

అప్పటిదాకా బిగపట్టుకున్న ఏడుపు - గట్టుతెగిన వరద నీటిలా బయటపడింది తలను మండిగానికి వేసికొట్టుకుంటూ, "నేను బ్రతకను - నేను బ్రతకను - నన్ను ఆయన దగ్గరికే వెళ్ళనివ్వండి !" అంటూ ఘొల్లు ఘొల్లున ఏడ్వసాగింది.

వచ్చిన నలుగురు అప్రతిభులయ్యారు. వాళ్ళ కళ్ళు చెమ్మగిల్లినయి.

కాత్యాయిని వంకచూస్తూ అందులో పెద్దాయన, "ఆమెను అనునయించి లోపలికి తీసుకువెళ్ళండి - మమ్మల్ని మన్నించండి !" అన్నాడు- బయటకు దారితీస్తూ.

*  *  *

నిర్మల తిరిగి వచ్చేటప్పటికి మధ్యాహ్నం పన్నెండుగంటలయింది. ఎవ్వరో తెలిసినవాళ్లుంటే చూసిరావటానికి వెళ్ళింది. ఆమె వరండాలో చెప్పులు విడిచిన అయిదు నిముషాలల్లోనే ఆమె వెళ్ళింతరువాత ఆ యింట్లో జరిగిన సంగతులన్నీ ముసలాయిన మోకాళ్ళమీద గోడకు ఆనుకు కూర్చొని పూసగుచ్చినట్టు చెప్పాడు.

ఆఫీసువాళ్ళు డబ్బులిచ్చి వెళ్ళారూ అన్న విషయం తెలియగానే ఎగిరి గంతేసింది. అందునా ఆ డబ్బు తల్లి దగ్గరే వున్నదన్నప్పుడు ఆమె ఆనందానికి పట్టపగ్గాలే లేక పోయినయి. ఒక్క ఉదుటున తల్లి పడుకున్న మూలగదిలోకి వెళ్ళి - ఆ యాసపడుతున్న ఆమె పక్కగా కూర్చున్నది.

"ఒసేయ్ ! దేవుడున్నాడు కాబట్టే ఇలాంటి పనులు జరుగుతుంటయ్యే - చిన్నన్నయ్య ఎన్నిసార్లు అన్నాడు - నాకు నీలంరాయి ఉంగరం చేయించి ఇస్తానని - అది చేయించకుండానే వెళ్ళిపోయాడు - చిన్నన్నయ్య కోరిక కోరికగానే వుండిపోయింది ! వాడి ఆత్మ శాంతించాలీ అంటే వాడి ఆఖరి జీతంలోనుంచి నేనే ఆ నీలంరాయి ఉంగరం చేయించుకొని వాడి పేరుచెప్పుకొని పెట్టుకుంటాను ! — వాడు ఎంతో సంతోషిస్తాడే అమ్మా - ఏమంటావ్ — చెప్పమ్మా ! - " అన్నది ఆమె అయాసాన్ని గూడా లెక్కచేయకుండా వూపేస్తూ.

"ఇలాంటి పరిస్థితులలో ఏం సమంజసమే అది !''

ముసలాయన వచ్చాడు ''కామాక్షీ ! ఇందులో ఆలోచించాల్సిందేవున్నది - అది చేయించుకోలేకపోతే జీవితాంతం దానికి వెలితిగానే వుంటోంది - వాడి ఆత్మకి అసంతృప్తిగానే వుంటుంది - నా వటుకు నాకు - వాడు లక్షసార్లు నీకు ధోవతులు పెడదామనుకుంటున్నాం మావయ్యా అనేవాడు - పోనీయ్ - స్వర్గానికి పోయాడు - నాకేం వెలితిలేదు - వాడు పెట్టినట్టే రేపు ఇంటికి వెళ్ళగానే రెండు నా డబ్బులతోనే తెప్పించుకొని వాడి పేరుచెప్పుకొని అక్షింతలు వేసుకుంటాను - కాని - ఇంటి ఆడబిడ్డ దాని మనస్సుమాత్రం కష్టపెట్టబోకు చెల్లమ్మా !'', అన్నాడు.

"అట్లా చెప్పు మామయ్యా ! మనమేమైనా పరాయివాళ్ళ సొమ్ము తింటున్నామా ? - లేకపోతే మనకు లేక ఏడుస్తున్నామా ? - వాడు నాకు స్వంత అన్నయ్య - ఒక్క తల్లి బిడ్డలం - ఎప్పుడూ నిమ్మీ, నిమ్మీ అంటూ ఒక్క క్షణం వదిలేవాడుగాదు నన్ను - ఆమాత్రం పోయినవాడి కోరిక ఇంతమందిమి వుండి మనం తీర్చలేమంటే !"

"లేదనకమ్మా కామాక్షీ ! నా సంగతి వదిలెయ్ గాని - దానికివ్వు - దానికిస్తే వాడికీ ఆనందంగా వుంటుంది !"

కామాక్షమ్మ మాట్లాడలేనట్లుగా ఆయాసపడుతోంది. ఉబ్బసం కొడుకు పోయిన దగరనుంచీ మరీ ఎక్కువయింది ఆమెకు. "పెట్లో వున్నది - తీసుకో" అన్నట్లుగా రెండు మాటలు ననిగి పెట్టె వైపుకు చేయి చూపించింది.

"ఐదొందలు తీసుకోనా ?"

"ఐదొందలా ?"

"నిర్మల తల్లీ ! చేయించేదేదో మొద్దుగా చేయించమ్మా - చచ్చినవాడి కళ్ళకీ తృప్తిగా కనబడుతుంది - అయిదొందలుకాకపోతే ఆరొందలు తీసుకో - నాకూ ఓ నశ్యం డబ్బా కొనుక్కురామ్మా అందులోనుంచీ - ఈ నట్టింట తిరిగిన నాలుగురోజులూ వాడి నశ్యమే తృప్తిగా పీలుస్తాను !"

"నశ్యమేమిటి మామయ్యా - ధోవతుల చాపే తెస్తాను !" అన్నది తన ఉంగరం విషయంలో ఆయన ఇచ్చిన వత్తాసుకు కృతజ్ఞతగా.

"నీ ఆనందమే చచ్చినవాడి ఆనందమూనూ - మీ ఇద్దరి ఆనందమే నా ఆనందమూ !" ఆయనా తృప్తిగా లేచినిలబడ్డాడు — భుజాన కండువాను తీసి దులుపుకుంటూ.

* * *

మధ్యాహ్నంనుంచి కాత్యాయిని జానకితో నసుగుతోనే వున్నది - ఉపయాన డబ్బును తీసుకువెళ్ళి అత్తగారికి ఇచ్చినందుకుగాను.

"బుద్ధీ జ్ఞానం లేనివాళ్ళకు వయస్సువచ్చి దేనికి - ఎత్తుక తిన్నా !... మనుషుల్నీ, మనసుల్నీ కూడా తెలుసుకొని ఇలా ప్రవర్తించావూ అంటే నీకు పిచ్చెక్కిందనే అనుకోవాలి !"

"పోనీయ్‌లేవే పెద్దదాని చేతికిచ్చాను. సంతోషిస్తుంది - తింటుందా పాడా - ఈ అవసరానికే ఖర్చుపెడుతుందిలే..."

"ఏం చేస్తుందో అడిగి చూడనా ?"

"బాగుండదే!"

"నీవు నోరుమూసుకో ముందు!"

కాత్యాయిని లేచి జానకి అత్తగారు మూలుగుతూ పడుకున్న గదిలోకి వచ్చింది.

కాస్త ఎవ్వరినైనా పంపి ఇంట్లోకి కావాల్సిన సరుకులను తెప్పించమంటోంది జానకి!"

అలాగేనన్నట్లుగా చూచింది ఆవిడ ఆయాసపడుతూనే.

"ఉదయం బ్యాంకుకు వెళ్ళాను గదా - నగలన్నీ పెట్టి డబ్బుతెద్దామని - అది వీలుపడలేదు - వాటన్నిటిమీదా జానకి పేర్లున్నాయి - అది వస్తేగాని వీలుపడదన్నారు - అందుకనే పొద్దున యిచ్చిన డబ్బులోనుంచి తెప్పించమన్నది!"

అప్పటివరకూ ఏదో పాత పుస్తకం చదువుకుంటూ ఓ పడక్కుర్చీలో పడుకున్న నిర్మల తలెత్తి, "ఆ డబ్బు అయిపోయిందని చెప్పండి!" అన్నది విసురుగా

"పన్నెండువందలదాకా వచ్చిందిగదా!"

"అది మా కుటుంబ వ్యవహారం - ఊళ్ళోవాళ్ళంతా - ఎంతవచ్చిందీ, ఎంత ఖర్చుపెట్టారూ, ఎంత మిగిలిందీ అని ఆరాతీయ నక్కరలేదు - ఖర్చు అయిపోయిందని చెప్పండి - ఈ పదిరోజులూ ఎలా గడవాలో ఆలోచించమని చెప్పండి!"

కాత్యాయినికి కోపం తలకెక్కింది.

"పన్నెండువందలు ఖర్చుపెట్టిన వాళ్ళకు ఎందుకు ఖర్చుపెట్టారో తెలియదు - కాని మొగుడు చచ్చినముండ ఆ చీకటి గదిలోపడి ఏడుస్తూ ఇంటి ఖర్చులకు డబ్బు ఎక్కడనుంచి వస్తుందో ఆలోచించాలా? - అర్థమున్నదా ఆ మాటలకు!"

ముసలాయిన ముందు గదిలోనుంచి వచ్చి నిర్మల కుర్చీపక్కగా గోడకు జారిగిలపడ్డాడు.

"మట్టిగోడలు అలుక్కుంటున్న మనిషిని కానీ కట్నంలేకుండా అందలమెక్కిస్తే — మా చిన్నన్నయ్య పాతికేళ్ళకే పుటుక్కుమన్నాడు - ఒక్కొక్క మహాతల్లి పాదం అలాంటిది - ఎవర్నని ఏం లాభం - మా ఖర్మ - ఇదంతా వాడి ఆస్తీ - వాడు సంపాదించిటే కూర్చుకున్నదీనూ - అంతేగాని ఆవిడగారేం

పుట్టింటినుంచి నెత్తిన పెట్టుకొని మోసుకురాలేదు. దానిమీద హక్కు మాకున్నది గాని మరెవ్వరికీ లేదు - మాకు ఇష్టమొచ్చినట్లు మేం చేసుకుంటాం మా చిన్నన్నయ్య డబ్బుని - ఇష్టమయితే చూస్తూ కూర్చోవటం - లేదా బయటకు వెళ్ళిపోవటం..." చేతిలోవున్న పుస్తకాన్ని విసురుగా మూలకు విసిరికొట్టి ఇక అక్కడ వుండటం ఇష్టంలేదన్నట్లు బయటకు నడవసాగింది నిర్మల.

ఆమె అన్ని మాటలూ అన్నది జానకినే — ఆ గృహంలో జానకి స్థానాన్ని ఆమె విపులీకరించింది!

కాత్యాయిని తన కోపాన్ని ఎంత నిగ్రహించుకుందామనుకున్నా నిగ్రహించుకోలేకపోయింది "దేనిమీద ఎవరికి హక్కున్నది - వీటన్నిటికీ ఎవ్వరు వారసులూ అనేది కాలమే నిర్ణయిస్తుంది - కాదంటే న్యాయస్థానాలు నిర్ణయిస్తాయి - నోరుపారేసుకున్నంతమాత్రాన ఆస్తుల హక్కులే మారిపోతే ఇంకా చెప్పుకోవాల్సిందేమున్నదిగాని - ఓ గంటలోగా పొద్దున వచ్చిన డబ్బు పైసలతోసహా జానకి చేతుల్లోకి రావాలి - అలా రానిపక్షంలో - మీరన్నట్లుగానే ఈ ఇంటి లోపల ఎవ్వరిని వుంచాలో, బయట ఎవ్వరిని వుంచాలో నాకు బాగా తెలుసు! "గిరుక్కున మెరుపులా వెనక్కు తిరిగింది కాత్యాయిని

కాని ముసలాయిన ఊరుకోలేదు : "అమ్మా! ఒక్కక్షణం ఆగు తల్లీ - మీరెందుకు అజన్మశత్రువుల్లా తగువులాడుకుంటున్నారో నాకు అర్థమేకావటం లేదు!..."

"అదిగాదు బాబాయిగారూ...'

"నాకు తెలుసమ్మా! నాకేమీ చెప్పవద్దు - ఆ డబ్బు వున్నది మాదావూ ఒక్కపైసా కూడా ఖర్చుకాలేదు - కావటానికి వీల్లేదు గూడా - దానిని ఖర్చు పెట్టే విషయంలో అటు నిర్మలకీ హక్కులేదు - ఇటు జానకికీ లేదు - మధ్యలో మనకీ లేదు — ఆ డబ్బును వాడు కోరినట్లుగా సద్వినియోగం చేయటం మన అందరి ధర్మమూనూ - అలా చేస్తేనే రేప్పొద్దున కాకులు ఆ పిండాల్ని తినేది - ఈ కుటుంబం ఇలా నిలిచేదీనూ - కనుక మీరు మీరు కొట్టుకోవడం శుద్ధదండగ..."

"ఆయన కోరికలేమిటో తెలుసుకోవచ్చా బాబాయిగారూ—"

"జానికికి తెలుసమ్మా! అడుగు"

"దానికి మతిస్థిమితం తప్పి పిచ్చెక్కిందిగాని మీరు చెప్పండి!"

ఆయనగారి ఒక్కగా నొక్క చెల్లెలికిగాను ఏడెనిమిది వందలుపెట్టి ఓ నలుపు రాయి ఉంగరం చేయించడం మొదటిది !''

''నేను చెబుతానుండు మామయ్యా ! మా మామయ్యకు జరీఅంచు ధోవతుల చాపుపెట్టటం రెండవది - ఆ తరువాత మిగిలినదాంతో మా అమ్మకు ఓ పెద్ద చీరకొనటం - తెలిసిందా !'' అన్నది.

మునలాయిన లేచి కండువా దులుపుకుంటూ, '' - కనుక ఎట్టి పరిస్థితుల లోనూ వాడి ఇష్టాన్ని ఎగత్రించటం మనకు మంచిదిగాదమ్మా !'' అంటూ బయటకు వెళ్ళిపోయాడు.

కాత్యాయినికి నాసికారంధ్రాలనుంచి వెచ్చటిపొగలు బయటకు వస్తున్నాయి -

''నా కవేమీ తెలియవు - నేను చెప్పినట్లుగా ఓ గంటలో ఆ డబ్బు జానకి చేతిలోకి గనుక రాకపోతే - కాకులు తినటం వదిలేయండి, అసలు పిండాలు చేసే ప్రసక్తేరాదు - చూద్దాం - దానికి ఇంతకు మించిన అన్యాయం ఇంకా ఏం జరుగుతోందో !'' అలా నిప్పులు కక్కుతోనే - జానకి జట్టుపట్టుకొని ఆవిడగారి అప్రాచ్యపుపనికి ఆ చెంపా ఈ చెంపా పగలగొడదామా అన్నంత కోపంగా బయటకు వచ్చింది.

నిర్మల విసురుగా మునలాయిన దగ్గరకు వెళ్ళింది. ''తాడూ - తాడూ - పాకుతోందీ — అన్నావ్ - ఆవిడగారు పాకుతోన్నది తాడుగాదు - పది వరసలువేసిన ఇనపతీగె !'' అన్నది రెండుచేతులూ బారజాస్తూ.

''చూడమ్మా నిర్మలా ! ఇనుపతీగెల్ని తెంపాలన్నా దానికితగ్గ బ్లేడ్లు దానికి తగ్గబ్లేడ్లు వున్నాయి - ఏం ఫరవాలేదు - ఇంకో అడుగు పైకి వేసిందని మాత్రమే అనుకో !''

* * *

''ఒసేయ్ జానకీ ! ఓ పాత బొచ్చెఒకటి తోమిస్తానుగాని — ఓ చిరిగిన చీరె కట్టుకొని, జుట్టువిరబోసుకొని 'అమ్మా, తల్లీ !' అంటూ రోడ్లమ్మట తిరుగు - పైసలూ, రెండు పైసలూ ఎవరైనా దయతలచివేస్తే నీ అసమర్థతను ఆధారంచేసుకున్నవాడికి కాస్త గంజి కాచిపోసి మిగిలితే నీవు త్రాగు - మీ ఊళ్ళో అ పడిపోతన్న మట్టిగోడల పెంకుటిల్లు ఇంకా నీ అధీనంలో వున్నదో లేదో చూచుకో - వుంటే నీ అదృష్టం - నీకో నీడవున్నట్లే !''

''ఏంవిటే ఆ మాటలు !'' అన్నది విసుగ్గా జానకి.

''ఇవి నా మాటలు కావేతల్లీ - స్వయానా మీ ఆడబిడ్డ చెప్పినవి - ఇక్కడ

నీకు చిన్న పూచిక పుల్లమీదగూడా అధికారం లేదే పిచ్చిదానా! ఈ యింట్లో పేరుకుపోయిన దుమ్మూ, ధూళిగూడా వాళ్ళ చిన్నన్నగారి స్వార్జితం - వాటి మీద హక్కు వాళ్ళకే - నేలమీద నాలుగు అడుగులు వేయాలన్నా బ్రతికుండగా మీ ఆయన కొనిపెట్టిన చెప్పులేమైనా వుంటే వేసుకొని నడువమ్మా - వాళ్ళ దుమ్మూ, ధూళీ నీ కెక్కడ అంటుకుంటుందో!"

"అనవసరంగా నన్ను విసిగించబోకే!"

"నిన్ను నేనెవర్నే విసిగించేటందుకు - ఓ చిన్న తాడుముక్క కొనిస్తాను గాని - నా డబ్బులు పెట్టేలే — గొంతుకు బిగించుకొని ఏ దూలానికో వేలాడ బడ్డావంటే ఇంకా అంతా సుఖమే - సిగ్గులేక ఇంకా మాట్లాడుతున్నది - నోరు మూసుక పడివుండక!"

జానకి ముడుచుకుపడుకొని చీరె చెంగును కప్పుకొని వెక్కి వెక్కి ఏడ్వ సాగింది కాత్యాయినికి దుఃఖం ఆగలేదు. ఆ మెలోని కోపమంతా కళ్ళవెంట నీరుగా బహిర్గతమవుతోంది

"నిన్ను ఇక ఆ పైనున్న భగవంతుడే రక్షించాలే జానీ!" అన్నది బాబుని వళ్ళోకి లాక్కొని వాడి పెరిగిపోయినజుట్టుని చిక్కుతీస్తున్నట్లుగా సర్దుతూ.

ఉన్నట్లుండి దొడ్డివైపునుంచి పనిమనిషి రావులమ్మ కంఠం పెద్దగా వినబడ సాగింది: "ఇన్నాళ్ళబట్టి పనిచేస్తున్నాను - కావాలంటే అమ్మ నడగండి - నిన్నగాక మొన్నొచ్చారు మీరు - నా సంగతి మీకేం తెలుసు — నిప్పులాంటి దాన్ని - మరోసారి ఆ మాట అన్నారంటే మర్యాద దక్కదు!"

"నీవూ గాకపోతే ఎవరు తీస్తారే అది - పిల్లాడు అన్నంతిన్న తరువాత కడగ టానికి నేనే బాత్‌రూంలో పడేశాను - చిన్న వెండిగిన్నె ముద్దొస్తోంది - అయితే ఉంచుకునే నీవు తీసుకువెళ్ళావ్ అంటున్నాం అంటావా?"

"ఏంవమ్మోవ్! అవేం నాకు తెలియదు - నేనేం తీయలేదు - ప్రాణం పోయినా నేను అలాంటి వెధవ పనిచేయను - నేనేం నీతీ జాతీ లేనిదాన్నిగాదు అలాంటి వెధవ్వేషాలు వేసేటందుకు - తింటానికి లేకపోతే ఏదైనా ఇంతతిని గుటుక్కున చస్తానుగాని ఇలాంటి పనిచేయను!" అన్నది పెద్దగా అరుస్తూ

కాత్యాయిని ఒక్కసారి దొడ్లోకి తొంగిచూచి జానకి దగ్గరకు వచ్చింది

"ఏంవే! పనిమనిషి ఎలాంటిదే?"

"ఏం?"

"పొద్దున బాబుగాడికి అన్నంపెట్టిన వెండిగిన్నె కనిపించటంలేదట - మీ ఆడబిడ్డ పనిమనిషి ఎత్తుకు వెళ్ళిందంటోంది!"

"పాపం! అలాంటి పనిచేస్తుందనుకోనే అది!"

"అయితే ఈవిడిగారి పెట్టె పగలగొట్టి చూస్తే సరి!" అన్నది ఎగతాళిగా నవ్వి

* * *

## 5

"అమ్మా! జానకి తల్లీ! ఇదీ పరిస్థితి-ఇంట్లో బియ్యం ఈ పూటకుగానిరావు-ఉప్పు, పప్పుల సంగతి సరేసరి — కూరా నారా కనేలేదు - ఏ క్షణానవైనా మనవాళ్ళు ఎవ్వరైనా రావచ్చు - మరి ఏం ఆలోచిస్తావో ఆలోచించు - ఇది మన పరువు ప్రతిష్ఠలకు సంబంధించిన విషయం - వాడు పోయాడు - వాడితోటే అవన్నీ పోయినయి - ఇంటికి పోతే వచ్చి మంచినీళ్ళయినా నోచుకోలేదు అని ఒక్కమాట వచ్చిందంటే చాలు. కలకాలం అలాగే వుంటుంది - ఈ ఆశీర్వచనాలు అయ్యేటంతవరకూ వాడు ఇక్కడే తిరుగుతుంటాడు - వాడిని అసంతృప్తిపరిచిన వాళ్ళమవుతాం మనం... !" జానకి ఒంటరిగా వుండటం చూచివచ్చి గోడకు జారిగిలబడి కూర్చుంటూ అన్నాడు ముసలాయిన

అప్పుడు ఆ గది మంచుకు తడిసిన దూడిద కుప్పలతో నిండిన స్మశానంలా వున్నది.

జానకి నిర్లిప్తంగా అన్నది: "ఏం చేద్దామో చెప్పండి!"

"నాకేం తెలుసమ్మా ఈ యింటి పరిస్థితి - కావాలంటే ఏదైనా మాట సాయం చేద్దామన్నా — ఈ ఊళ్ళో పదిరూపాయలు అప్పిచ్చే ముక్కు ముఖం తెలిసిన మనిషి నాకు లేడు — లేదంటావా - మళ్ళీ మనూరు వెళ్ళి ఎవడి కాళ్ళమీదైనాపడి వున్న చెక్కేదో తాకట్టుపెట్టి రెండు మూడువేలు పట్టుకురావాలి — ఎట్లాలేదన్నా ఈ పదిరోజుల తతంగం పూర్తవ్వాలంటే అంతా కావాల్సివస్తుంది - గోదానాలు అంటారు. భూదానాలు అంటారు - నా పిండాకూడు అంటారు - వసినకూడు అంటారు - ఏవి మానతాం - ఏవీ మానలేం మన మధ్యతరగతి కుటుంబాల వాళ్ళం..."

— "ముందు ఓ పనిచేయండి - మొన్న బావగారిచ్చి వెళ్ళిన రెండొందలూ అలాగే వున్నాయి - ఇవాళ రేపటికి కావాల్సినవి తెప్పించండి — ఈలోగా ఏదో ఒకటి చూద్దాం!" అన్నది వంటినవున్న నలిగిన చీరెచెంగుకు వున్న ముడినివిప్పుతూ.



"అలాగేనమ్మా – అలాగే – అదే మంచి పద్ధతి – మనస్సుమాత్రం అనవసరంగా పాడుచేసుకోబోకు తల్లీ – అనుకున్నాను – అత్తగారున్నది – ఎలాగో అలాగా ఓ దారికి తెస్తాం – చూస్తూ ఊరుకోలేంగదా – రేపు ఆ పెద్దవాడు వచ్చి, 'నీవు పెద్దవాడివి ఇక్కడ వుండి ఏంచేస్తున్నావు మామయ్యా – ఇలా అప్రతిష్టపాలు చేస్తావా' అంటే – ముఖం ఎత్తుకొని ఏం సమాధానం చెవుతాను!'

రెండువందలూ అలా ముందుకు పడవేస్తున్న సమయంలోనే తలుపుదగ్గర శబ్దమవ్వటంతో తలెత్తింది. అక్కడ నిల్చున్న కాత్యాయినిని చూస్తూనే ఇద్దరూ తడబడ్డారు.

మొట్టమొదట ముసలాయినే కోలుకొని నవ్వుతూ, "అమ్మా కాత్యాయినీ! ముందు ఆ రెండొందలూ తీసుకొని కాస్త ఎవ్వరినైనా పంపి ఈ పూట ఇంట్లోకి కావాల్సినవి తెప్పించమ్మా!" అన్నాడు లేచి నిల్చుంటూ ఆ రెండొందలూ చేతిలోకి తీసుకొని "జానకి ఒక్కటే ఇదైపోతున్నదమ్మా..."

"మీరే తెప్పించండి బాబాయిగారూ! – ఆడకూతురిని నాకుమాత్రం ఏం తెలుస్తుంది –" అన్నది సౌమ్యంగా.

"అలాగేనమ్మా ! - అలాగే - నాకెలా తప్పుతోంది మరి !" అంటూనే క్షణాలమీద ఆ గదిలోంచి బయటపడ్డాడు బోనులోనుంచి బయటపడ్డట్లుగా.

జానకి తప్పుచేసినదానిలా తలవంచుకు కూర్చున్నది

కాత్యాయిని జానకి ముఖంలోకి అసహ్యంగానూ, చికాగ్గానూ ఒక్కసారి చూచి ఆ గదిలోనుంచి వెళ్లిపోయింది.

పదిగంటలవుతుండగా బయటకు వెళ్లేటందుకుగాను సూట్కేసులోనుంచి చిన్న పర్సు తీసుకొని బయల్దేరింది.

కాత్యాయిని బయల్దేరుతుండగా హాల్లో గోడవారనుండి లేస్తూనే ముసలాయిన, "అమ్మా కాత్యాయినీ ! ఎక్కడికో బయటకు బయల్దేరినట్లున్నావ్ - అదేం చీరెమ్మా — కాస్త మంచిది కట్టుకు వెళ్లగూడదూ - అమ్మా నిర్మలా ! కాత్యాయినికి నీ చీరెల్లో ఓ చీరె ఇచ్చి - నీ మెళ్లో గొలుసుగూడా ఒకటి ఇవ్వు - మరీ బోసిమెడతో బయటకువెళితే ఏం బాగుంటుంది చెప్పు !"

"అవ్వే వద్దండీ - ఏ పెళ్ళికి వెళుతున్నానని - నా పెట్లోనూ వున్నాయి చీరెలు !"

"నీకు లేవనిగాదు - పోనీయ్ గొలుసన్నా వేసుకెళ్ళమ్మా !"

"వద్దండీ !" బయటకు వచ్చేసింది.

ముసలాయిన తన వలకు ఆప్యాయత అనే రంగును పూసి మీదకు విసురుతున్నట్లే అనిపించింది.

జానకి భర్త పనిచేసిన ఆఫీసుకు వెళ్ళి నిన్న తమింటికి వచ్చిన ఆఫీసర్ను కలుసుకుంది. "నాకు చిన్న సాయం చేయాలి - రామ్మూర్తిగారికి రావాల్సిన ప్రావిడెంట్ ఫండూ గ్రాట్యుయిటీ వచ్చేందుకు కాస్త ఆలశ్యం అయ్యేలా చూడాలి" - నిన్న మీరు వచ్చి ఇచ్చివెళ్ళిన డబ్బు హారతి కర్పూరంలా అయిదు నిముషాలల్లో కరిగిపోయింది" - కాత్యాయిని చిన్నగా నవ్వింది. "ఇప్పుడు అది విషవలయంలోవున్నది - ఎవరికివారు దాని నగా నట్రా, ఆస్థిపాస్తులన్నీ కబళించివేసి దాన్ని కట్టుబట్టలతో నడిరోడ్డుమీదకు ఈడ్చివేయాలని చూస్తున్నారు - తవ్వుకుంటూ పోతే చాలా కథ వున్నది... అవన్నీ పోనీయండి - అది ఈ అస్థవ్యస్థమయిన మానసిక స్థితినుండి కోలుకునేటంత వరకూ ఎవ్వరు వచ్చి తొందరపెట్టినా 'చేస్తున్నాం, చేస్తున్నాం' అని అంటూ పంపించేయండి - అది కాస్త సెటిల్ అయింతరవాత మీరు గనుక దానికి డబ్బు

వచ్చేలా చేస్తే దాని డబ్బును అదే తినగలుగుతుంది - మీరు ఎంతో సహాయం చేసినవారూ అవుతారు!"

"అలాగేనమ్మా - తప్పకుండా!"

"షుమారుగా ఎంత వస్తుందో చెప్పగలరా - ఓ అయిడియా వుంటుంది!"

"అలాగే!" అని కాలింగ్ బెల్ నొక్కుతూ, "నిన్న సాయంత్రం ఆ యింట్లో ముసలాయిన గూడా వచ్చి ఎంక్వయిరీ చేసి వెళ్ళాడు!"

"ఆయన వచ్చి వెళ్ళాడా అప్పుడే!" అన్నది నీరసంగా వెనక్కు జారిగిల పడుతూ కాత్యాయిని. "ఆయనే ఒక రాబందువు!"

"ఈ విషయాలన్నీ నాకు తెలియవమ్మా!"

"పోనీయండి! చేతులు కాలలేదుగా - ఫరవాలేదు - నా ఆదుర్దా అంది- అన్నిటికీ మిన్న అయిన భర్తే పోయాడు దానికి - నిజమే - కాని - పోయిన ఆయన ఎలాగూ పోయాడు - తిరిగిరాలేదు- ఆయనకు సంబంధించిన ఆ డబ్బున్నా అది అనుభవించేలా మనం చూద్దాం - దాని జీవితమూ, ఆ పసివాడి జీవితమూ ఇంకా చాలా వున్నది!"

ఒక కాగితంమీద అంకెలు వచ్చినయి. అన్నీ కలిపి యిరవై వేలదాకా వస్తయి

వాళ్ళకు తన కృతజ్ఞతలు తెలుపుకొని బయటకు వస్తుంటే ఆయనే అడిగాడు. "ఇంతకీ ఆ అమ్మాయి ఏం చదివిందన్నారు?"

"పీయూసీ పాసయింది!"

"అలాగా - అయితే ఒకపని చేయండి - అవసరమనుకుంటే నాకు తెలియ బరచండి - మా కంపెనీలోనే క్లర్క్‌గా ప్రయత్నిద్దాం!"

క్షణం కాత్యాయిని కళ్ళు ఆయన మాటలకు కాంతితో తళుక్కుమన్నయి "అలాగేనండీ - చాలా థాంక్స్!"

* * *

ఇంట్లో కాలు పెడుతుండగనే కాత్యాయిని గమనించింది- ఓ పదిమంది దాకా కొత్తమనుష్యులు ఆ యింట్లోదిగారని, ముసలాయిన వెళ్ళి ఇంట్లోకి కావాల్సిన సరుకులు తెచ్చి పడేశాడనీను!

జానకిమీద కోపం ఇంకా తగ్గలేదు కాత్యాయినికి. నిన్న ఆఫీసువాళ్ళు యిచ్చిన పన్నెండొందలూ ఇవ్వటమే గాకుండా ఈ రోజున బావగారిచ్చిన రెండొందలు గూడా ఇచ్చివేసింది. మౌనంగా వెళ్ళి ఓ మూలగా కూర్చున్నది

కాత్యాయని. అనవసరంగా లేనిపోని గొడవల్లో తను ఇరుక్కుంటున్నదా అని పించింది ఒక్క క్షణం - రేపు వాళ్ళూ వాళ్ళూ ఒక్కటే అయితే తన స్థితి ఏంవిటి ?

అర్థంగాని అయోమయమయిన ప్రశ్న అది !

—కాని సర్వం కొల్లగొట్టబడినట్లుగా వున్న జానకి- ఇప్పుడిప్పుడే మాటలు నేర్చుకుంటూ, తప్పటడుగు వేస్తూ, అమాయకపు చూపులు చూసే బాబు-

ఏంపీ చేతగాక అంతా పోగొట్టుకున్న తరువాత వాళ్ళ గతేంవిటి ?— నిలబడ టానికి నీడలేక, కడుపునిండా తినటానికి తిండిలేక, వంటికి గుడ్డ లేకుండా రోడ్లమీద అడుక్కు తినటమేనా ముగింపు ?

జానకి భవిష్యత్తు కాత్యాయిని కళ్ళకు అమావాశ్యనాటి స్మశానంలా భయం కరంగా కనిపించింది.

"ఏమే కాత్యా ! ఉదయాన ఎక్కడకు వెళ్ళావే... ?"

"ఏట్లోకి - నాతో మాట్లాడవద్దన్నానా !" అన్నది విసురుగా.

జానకి ఒక్కసారి కాత్యాయిని ముఖంలోకి సావధానంగా చూచి మొఖం అటు తిప్పుకు పడుకున్నది. దూరంగా బిక్కమొఖం వేసుకు చూస్తున్న బాబుని దగ్గరకు లాక్కొని చీరచెంగుకప్పి నిద్రపొమ్మన్నట్లుగా చిచ్చికొట్ట సాగింది

కాత్యాయిని చాలా సేపు అలాగే గోడవైపుకు తిరిగి పడుకున్న జానకిని చూస్తూ కూర్చొన్నది. గతంలో తాను ఆయన వున్నప్పుడు ఈ గృహంలో గడిపిన ఆనందక్షణాలు కళ్ళముందు తారట్లాడుతున్నాయి.

ఎంతో అందంగానూ, ఆనందంగానూ వుండేవాడు ఆయన. చిరునవ్వు ఎప్పుడూ ఆయన పెదవులకు అతుక్కుపోయి వుండేది. తను అంటుండేది మీ ఆయన్ను ఒక్కసారి కోపంగా వున్నప్పుడు చూపించవే అని - బాబ్బాబు ఆయన్ను నాలుగు చివాట్లు ఏదైనా వంకతో పెట్టవే - ఆయన మొఖాన్ని అప్పుడు నేను తలుపు సందుల్లోనుంచైనా చూస్తాను - ఎగతాళిగా అనేది.

ఒకరోజు సాయంత్రం తన పోరుపడలేక అలాంటి దృశ్యానికి అన్ని ఏర్పాట్లూ చేసింది. ఆయన సాయంత్రం ఇంటికిరాగానే రోజూ కాఫీయిచ్చేది- ఆయనకు యిష్టంలేని టీ చేసి యిచ్చింది. ఆయన త్రాగుతూ కనీసం మొఖమైనా చిట్లించలేదు. కాకపోంగా, "నీ మరో ప్రాణం వస్తే నాకు శిక్ష తప్పదంటావ్ - శంకర్ విలాస్‌లో స్పెషల్ కాఫీ త్రాగివస్తాను గాని - ఆ టిఫిన్ డబ్బా గూడా

ఇలా ఇవ్వు - గులాబ్‌జాంగాని, బాదుషాగాని తీసుకొస్తాను - అందరం తినేద్దాం - అరేయ్ బాబీ పౌడర్ రాసుకు వచ్చేసేయ్!"

"ఆ సంతోషించాంలేండి - ఎక్కడికీ కదలకుండా ఇంట్లో కూర్చోండి - ఒక్కపూట కాఫీలేకపోతే కొంపలేం అంటుకోవ్ - రేపొద్దున్న గూడా టీనే - అసలు కాత్యాయిని వున్నంతకాలం టీనే!" అన్నది విసుగ్గా.

రామ్మూర్తి పెద్దగా నవ్వాడు: "అరేయ్ నానీ - ఓ రిక్షా పిల్చుకురారా... అమ్మకు బి. పి రైజ్ అవుతోంది! డాక్టర్ దగ్గరకు అర్జంటుగా పరుగెత్తాలి!''

తలుపు పక్కనుంచి చూస్తున్న తనకు నవ్వాగటమేలేదు

జానకి ఒక్కసారి అటూ యిటూ చూసి ఆయన దగ్గరకు వెళ్ళి గొణుగుతున్నట్లుగా, ''మీకు దణ్ణం పెడతాను - నన్ను ఒక్కసారి తిట్టండి!" అన్నది.

"అరేయ్ నానీ!... మీ అమ్మకు పైత్యం గూడా ప్రకోపిస్తున్నదిరోయ్... అటునుంచి అటే ఏ ఆచార్యులగారి దగ్గరకు వెళితే సితాంకుశరసమో... ఆనందభైరవ తేనెలో రంగరించి శుభ్రంగా నాకించేస్తాడు... రారా!"

''ప్లీజ్ - ఒక్కసారి తిట్టండి!'' బిక్క మొహమేస్తూ అడిగింది.

"అలాగే - నీవు అంత సరదాపడుతుంటే ఎందుకు కాదనాలి - ఏమిస్తావ్ మరి!" అన్నాడు భుజంమీద రెండు చేతులూ వేసి దగ్గరకు లాక్కుంటూ

తనకు చచ్చే సిగ్గేసింది

"ఒక ముద్దు!''

''ఛస్! నాతో మాట్లాడవద్దు!''

"ఎబ్బే - నీతో మాటల్తో నాకేం పని!"

''నా మొఖం చూడొద్దు!"

"కళ్ళు మూసుకుంటాగా!"

"దూరంగా పోండి!"

"నా మనస్సు నీ దగ్గర లేనేలేదోయ్ పండూ - ఎక్కడున్నా నవ్వా నేను!''

"వదలమంటుంటే!"

"వదలటమా - నేను నిన్ను పట్టుకున్నానా?"

"మీతో నేను మాట్లాడలేను బాబు!"

"అసలు నిన్ను నాతో ఎవరు మాట్లాడమన్నారు - మనకు మాటలతో పనేమిటోయ్!"

"అబ్బ - ఖర్మరాబాబు - చెబితే అర్థం గాదు!"

"అవును నిజమే ఏనాటి ఖర్మో - ఇప్పుడెక్కడ అర్థమవుతుంది!..."

"నాకు తల నొప్పి వస్తోంది!"

"అయ్యో పాపం - ఎక్కడ బుజ్జీ!"

"తల్లో!"

"అవును.. తలనొప్పి తలలోనే వస్తుంది గదూ - మరయితే పద మొద టాటకి వెళ్దాం - అయ్యయ్యో - ఎంత కష్టమొచ్చిందమ్మా నీకు..." అంటూనే ముందుకు వంగి "ఇది మొదటి డోస్ - సింపుల్!" అంటూ ముద్దు గూడా పెట్టేసుకున్నాడు.

తనకు చచ్చే సిగ్గువేసింది. ఇక ఒక్క క్షణం గూడా అక్కడ వుండకుండా వంట యింట్లోకి పారిపోయింది.

వెయ్యి క్యాండిల్ దీపంలా వెలిగిన వాళ్ళ వివాహ జీవితం విధివిసిరేసిన రాతికి పగిలి ముక్కలయి వికృతంగా చెల్లా చెదురయిపోయింది.

* * *

ఫోంచేసి పడుకున్నా నిద్రపట్టలేదు. ఒకటే ఆలోచనలు. నిన్న తీసుకున్న పన్నెండొందలూ వాళ్ళు ఎంతగా ఇవ్వమన్నా ఇవ్వలేదు. తను ఇవ్వమని దబాయించింది. అయినా యివ్వలేదు. ఇప్పుడేం చేయాలి? ఓటమిని వొప్పుకొని నోరు మూసుకు పడివుండటమా! లేక మరొకసారి రణరంగంలోకి దూకటమా?

పన్నెండొందలూ రాబట్టటం ఎలాగా అని తల్లక్రిందులవుతోంటే మళ్ళీ బావ గారిచ్చిన రెండొందలూ ధారపోసేసింది. జానకే కష్టాన్ని కొనినెత్తికి తెచ్చు కుంటుంటే తనెంతవరకు ఆదుకోగలుగుతోంది?

చికాగ్గా వున్నదని కాస్త నీళ్ళుపోసి మొఖం కడుక్కుందామని బాత్‌రూం దగ్గరకు వెళితే రాంవులమ్మ నిలవేసింది. అంతకు ముందు ఆ యింటికి కాత్యాయిని రావడంతో దానికి పరిచయమున్నది.

"చూడండమ్మా! ఇల్లంతా వాళ్ళు దోచేస్తున్నారు - ఎవ్వరికి చెప్ప మంటారు - అసలు అయ్యలేదు - అమ్మేమో నిండా మునిగివున్నది - నేనె లాంటిదాన్నో మీకు తెలుసు గదమ్మా - అమ్మ యీ యింట్లో కాలు పెట్టినప్పటి నుంచీ నేనే పనిచేస్తూన్నా - నోరు తెరిచి అమ్మ ఒక్కసారి నన్ను ఒక్క మాట అనలేదు - ఏనాడూ నన్ను ఒట్టి చేతులతో ఇంటికి పంపలేదు - పోసీ




లేమ్మా పీళ్ళు పెట్టలేదని నాకు బాధలేదు - అమ్మ ఇప్పుడు కష్టంలో వున్నది. నాకు పెట్టాలని గూడా అనుకోను - అమ్మ అలా పడివుంటే వీళ్ళు చేస్తున్న మోసాలు నేను చూడలేనమ్మా ! - ఆ యిత్తడి గిన్నెలేవో పాతవయి పోయినయి అంటూ మార్చేసి స్టీలు గిన్నెలు కొనుక్కొచ్చుకున్నారు - వాళ్ళ పిల్లాడికి ఏదో కావాలిట, సంచీలో శేరు బియ్యంపోసిచ్చి కొట్లో యిచ్చి కొనుక్కొచ్చుకురా అని పంపిస్తున్నారు - నేను అడ్డుకుందామనుకున్నాను గానీ మధ్యలో నీవెవరివే అంటే నేనేం చెప్పాలమ్మా - నిన్నటికి నిన్న బాబు వెండి గిన్నె నేను తీసా నంటుంది ఆ రాక్షసి - అదే అమ్మేసి వుంటుంది - !'' అన్నది మెటికలు విరుస్తూ. "తిండికి లేకపోతే పస్తులుంటానమ్మా - ఉండలేకపోతే ఇంత మందే మైనా తిని చస్తానుగాని - అలాంటి వెధవ పనులు చేయనమ్మా !''

"ఊరుకో రాముల్లూ! నాకు అన్నీ తెలుసు - కానీ ఏంచేయాలో అర్థంగాక చూస్తున్నాను !"

"మీరు 'ఊఁ' అనండమ్మా ! మా వాడికి ఓ చుక్కేసి పంపుతాను - అయిదు నిమిషాల్లో ఇల్లు ఖాళీ అవ్వాలి !"

తదేకంగా ఒక్క క్షణం రాములమ్మ మొఖంలోకే చూసింది. ఎంతో సిన్సియర్ గా మాట్లాడుతున్న దాని మాటలు వింటుంటే కాత్యాయినికి వెయ్యి ఏనుగుల బలం చేకూరింది. ఆనందంతోటి, తృప్తితోటి కళ్ళు చమర్చినయి.

"తొందరపడవద్దే రాములూ ; - చూదాం - చివరికి ఆ పని చేయాల్సి వస్తే చేద్దాం !"

కాత్యాయిని లోపలికి వచ్చేసింది.

రాంవులమ్మ చెప్పినదంతా జానకికి చెబుదామా అని ఒక్క క్షణం అని పించినా - స్మశానంలో సమాధికి చెబితే ఏమి లాభమో ఇప్పుడు దానికి చెప్పినా అంతే అనుకొని మెదలకుండా కూర్చున్నది. తనే ఏదో ఒకటి చేయాలి. ఇక బ్యాంకునుంచి డబ్బు తీసుకువచ్చి ఇవ్వకపోతే వాళ్ళే ఆ డబ్బు తీసి ఖర్చు పెట్టక ఏంచేస్తారు? వచ్చిన వాళ్ళందరికీ భోజనాలు పెట్టకుండానే పంపి వేస్తారా? చూద్దాం...

ఆయన చచ్చిం తరువాత జానకి వచ్చినవాళ్ళకు మంచినీళ్ళ చుక్క కూడా ఇవ్వలేదని ప్రచారం చేస్తారు - అంతేనా? - చేయనీ - ఆయన పోంగా లేనిది - ఆ మాట ఎంత!

బాబు లేచి ఏడ్వసాగాడు. బయటకు తీసుకువెళ్ళి చాక్లెట్ కొనిపెడదామని ఎత్తుకున్నది.

సరిగ్గా ఆ అదనుకోసరమే కూర్చున్నట్లుగా ముసలాయిన కాత్యాయిని గద పవతల కాలుపెట్టటం ఆలశ్యం లోపలికి వచ్చాడు. "అమ్మా! జానకీ - నిద్రపోతున్నావా?" అంటూ.

"లేదండీ! - రండి!" - అంటూ లేచి ఒదిగి కూర్చున్నది జానకి.

"నీవు నా నెత్తిన పెట్టిన బాధ్యతను తీర్చుకున్నాను - కానీ చూశావూ మళ్ళీ ఇందాక ఇంకో పదిమంది వచ్చారు - ఇంకా అమరావతినుండి వాడి పింతల్లి, దాని కూతుళ్ళు రానేలేదు - బెజవాడలో రాఘవరావు వున్నాడు - వాళ్లు వస్తారు - ఎట్లా లేదన్నా రేపు పదో రోజుకి ఓ వందమంది అవుతారు - ఏంచేద్దామంటావ్ మరి - ముందు ఓ రెండు బస్తాల బియ్యం - పప్పులూ ఉప్పులూ తెచ్చి పడేస్తే - మిగతావి వుంటే చేస్తాం లేకపోతే లేదు -" గోడవారకు జారగిలబడి కూర్చున్నాడు మోకాళ్ళమీద - భుజానవున్న కండువాతో మొఖం తుడుచుకుంటూ.

"నాకూ ఏమీ తోచటంలేదు - అంతా అగమ్యగోచరంగా వున్నది - అత్త గారు ఏమన్నారు?" అన్నది జానకి.

"అదేమంటుంది - నోట మాటలేక ఎగశ్వాస దిగశ్వాసలతో మూల గదిలో పడివున్నది - వాడు పోయినదగ్గరనుంచి దానికి ఆ ఆయాసం తగ్గనేలేదు!"

జానకి కళ్ళల్లో నీళ్లూరుతున్నాయి.

"నాకూ అర్థంకావడంలేదమ్మా! ఎలాగడుస్తుందో ఈ గండం -"

అంటూనే, "పోనీయ్ అంతగా అయితే ఏదైనా నగ తాకట్టుపెట్టి తీసుకుంటే.. ఆపైన ప్రావిడెంట్ ఫండ్ వచ్చినప్పుడు విడిపించుకోవచ్చు గదమ్మా... అఁహాఁ .. అంత అవసరమనుకుంటే !"

"చూద్దామండీ !"

"చూద్దామంటే గాదమ్మా !... ఏదైనా ఇవాళ జరిగిపోవాలి !"

జానకికి ఏం మాట్లాడాలో అర్థంకావేదు. ఒక్క క్షణం బ్యాంకులో వున్న డబ్బు సంగతి చెప్పి ఏ మాంటి అత్రుత పడనవసరం లేదని చెబుదామా అని పించింది - కాని కాత్యాయిని ఏం తిట్టిపోస్తుందో !

"సరేనండి - ఒక గంటపోయాక చెబుతాను !"

ముసలాయిన పసిగట్టేశాడు - కాత్యాయినిని సంప్రదించేదాకా విషయంలో జానకి తప్పదాటే వేస్తుంటుందని !

"ఏం లేదమ్మా ! నా వయస్సుకు నేను ఎన్నో చూశాను ఇలాంటివి... ఇలాంటి అవసరాలకే సొమ్ములెప్పుడూ !"

కాత్యాయిని గడపలో కాలుపెడుతూనే, "ఏదో బాబాయిగారు సొమ్ము లంటున్నారు !" అన్నది కళ్ళు చికిలించి చూస్తూ.

ముసలాయన కాస్త గతుక్కుమన్నాడు, ఈ పాపిష్టిది అప్పుడే వచ్చిందే అన్నట్లుగా.

"వచ్చావూ — నీ కోసమే చూస్తున్నామమ్మా - కూర్చో - డబ్బు సంగతే- నేనంటాను సొమ్ములెప్పుడూ—"

ఆయన మాటల్ని కొనసాగనీయకుండానే, "డబ్బుకు యిబ్బందేమున్నది బాబాయిగారూ - ఆఫీసువాళ్ళు యిచ్చి వెళ్ళిన పన్నెండు వందలూ అలాగే వున్నయ్యా - ఏ దిగులూ లేకుండా ఈ పబ్బం గడిచిపోతుంది !" అన్నది కూర్చుంటూ "తరువాత చూద్దాం... దాని ఖర్మ !"

కాత్యాయిని తలను పగలగొట్టిందాలనిపించింది ముసలాయనకు.

"అదికాదు జానకీ..." రామ్మూర్తి ఏఁమన్నాడంటే .."

"బాబాయిగారూ ! చచ్చిపోయిన ఆయన ఏమన్నాడో ఏమనుకున్నాడో ఆ పైనున్న దేవుడికే తెలియాలి - పోనీయండి ఆయన ముచ్చట తీర్చగూడదని ఎక్కడున్నది గాని - ఒకపని చేద్దాం - నిన్నెలాగూ మీరెళ్ళి ఆఫీసులో ఇంకా దానికి ఎంతొచ్చేది కనుక్కువచ్చారు గదా - అది వచ్చిన తరువాత ఆయన కోరికలన్నీ తీరుద్దాం - ఇప్పుడా పన్నెండొందలూ ఖర్చుపెట్టమనండి ఈ అవసరాలకు !"

మునలాయిన గతుక్కు మన్నాడు.

"నేను చెబుదాం - చెబుదాం అనుకుంటూనే మర్చిపోయాను - ఎవరో ఒకరం కలగజేసుకోవాలిగదా - ఆ ఆఫీల్లోనుంచి మన డబ్బు బయటకు రావాలీ అంటే మాటల్లో తేలేపనా - వెళ్ళానమ్మా - నీవూ వెళ్ళావేమిటి ?"

"ఏం చేయమంటారు బాబాయిగారూ ! వెళ్ళినవారు మీరు మాట మాత్రం నాకు చెప్పినట్లయితే నా శ్రమ తప్పించిన వాళ్ళయ్యేవారు..."

మునలాయినకు ఇంకేం మాట్లాడాలో అర్థంకాలేదు - నిర్మల అన్నట్లుగా ఈవిడగారు పది వరసలు పేనిన జనపతీగే అయ్యేలా వున్నది అనుకుంటూ, "అలాగేనమ్మా - నిజమే !" అని అర్థం పర్థంలేని రెండు మాటలని లేచి పోయాడు.

"ఎందుకు వెధవ రాద్ధాంతం - బ్యాంకునుంచి తెప్పిద్దామే !" అన్నది జానకి.

"నీవు ముందు నోరు మూసుకోవే !"

## 6

మరునాడు ఉదయం స్నానం చేసేటందుకు వెళుతూ చీర తీసుకుందామని పెట్టి మూత తీసిన కాత్యాయిని - పెట్టెలోకి చూస్తూనే కొయ్యలా బిగసుకు పోయింది.

అలాగే వళ్ళంతా చెమటలు పడుతుండగా కన్నార్పకుండా చూస్తూ కూర్చుండిపోయింది - నిస్సందేహంగా ఇదెవ్వరో కావాలని చేసిన పని !

పెట్టెను తీసుకు వెళ్ళి జానకి ముందు పడేయాలనిపించింది. మరొకరు తనను దోషిగా నిలబెట్టేముందే తను వెళ్ళి జానకికి చెప్పివేయాలి !

పెట్టెమూ ద్దామని మూతపీత చేయివేస్తున్న సమయంలోనే నిర్మల ఏదో పని వున్నదానిలా వచ్చి, క్షణం గూడా ఆలశ్యం చేయకుండానే "ఇదేమిటి పిల్ల వాడి వెండిగిన్నె, ఆ కంచం మీ పెట్లో వున్నాయి - ఇంకా పనిమనిషి ఎత్తు కెళ్ళిందేమోనని దానిని నానా మాటలూ అన్నాను !" అన్నది పెద్దగా అరుస్తు న్నట్లుగా. అంతేగాకుండా, మామయ్యా ! అమ్మా - రండి రండి - పోయిందను కుంటున్న గిన్నె కంచం కాత్యాయిని పెట్టెలోవున్నాయి - రండర్రా రండి !" అన్నది చేతులు తిప్పుతూ.

కాత్యాయినికి సిగ్గుతో ప్రాణమేపోయింది - ఇదెక్కడి ఘోరం ?

"నాకేమీ తెలియదండి - ఎవరో పెట్టినట్లున్నారు !" ఒక్క క్షణం గూడా

అక్కడ ఆగకుండా జానకి గదిలోకి పరుగెత్తుకుంటూ వెళ్ళి ఒకమూల కూల బడి వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

ఎంత నామర్దా ?

జానకి విచిత్రంగా కాత్యాయినిని చూచింది. "ఏమైందే ? - ఏం జరిగింది ?" దేకుకుంటూ కాత్యాయిని దగ్గరకు జరిగింది నీరసంగా.

నిర్మల ఆ గదిలోకి చేతిలో వెండి సామానుతో వచ్చింది. "ఇవిగో వదినా ! బాబుగాడి వెండి గిన్నె - కంచమూనూ - పోయినయ్యని నానాహైరానా పడు తున్నాం - దొరికితేనే ఎవరైనా దొంగలు - నోరులేని దాన్ని నానా మాటలూ అన్నాను — ఇప్పుడు మీ మిత్రురాలి పెట్టెలోనే దొరికినయి - ఇవుగోనమ్మా - నీ సొమ్ము నీ దగ్గర భద్రంగా పెట్టుకుంటే వున్న నాలుగు రోజులూ మాకు ఏ మాటా రాకుండా వుంటుంది !" అవి అక్కడపడేసి చేతికీ నోటికీ కావాల్సిన పని దొరికినట్లుగా గిర్రున బయటకు వెళ్ళిపోయింది.

ఇంకా కంఠం పెరిగింది. మాటలు పెరిగినయి.

"బీరువా తాళంచెవులూ — బీరువా తాళంచెవులూ అని వెంటబడింది... మేమేదో దాంట్లోవాటిన్నిటినీ తినేస్తున్నట్లుగా - బ్యాంకులో పెడతానని సొమ్ములన్నీ తీసుకువెళ్ళింది - బ్యాంకులో పెట్టిందో - అటునుంచి అదే యింటికి పంపించిందో - మా కుటుంబాలల్లో ఎవ్వరికీ లేవమ్మా ఈ బుద్ధులు... నేనింతవరకూ చూడలేదు. వుంటే తినాలి - లేకపోతే పస్తులు పడుకోవాలి... అంతేగాని ఇవేం దరిద్రపుగొట్టు బుద్ధులు - అసలు పైకి నీతులు చేప్పేవాళ్ళే లోపల గోతులు తీసేది - నాయన్నాయనోయ్ - ఈలాంటి మనిషిని నేనెక్కడా చూడలేదురోయ్ - మామయ్యా నీవే దీనికీ దారి చూడాలి — ఆ బంగారు సొమ్ములన్నీ బయటకు లాగించాలి - పోనీయ్ పోలీసు కంప్లెయింట్ ఇద్దా మంటావా ?"

"అమ్మా నిర్మలా ? నీకు అంతా ఆవేశమేనే ! — నేను నీకేం చెప్పాను... తొందరపడవద్దూ అన్నానా ! - ఊఁహూఁ — వింటేనా ? - ఏదో పోయిన వెండి గిన్నె దొరికిందనే పిచ్చి ఆనందంతో కేకలు పెట్టేశావ్ - ఇప్పుడు ఆ అమ్మా అంటుంది గదా - నాకేం తెలియదు - వెధవ సూట్ కేసులు - ఏ తాళం చెవి పెట్టినా ఇట్టే వచ్చేస్తయి— నామీద కోపం వున్నవాళ్ళెవ్వరో నా పెట్టెలో ఇవి పారేసి నాకు దొంగతనం అంటగట్టి నన్ను ఈ ఇంట్లోనుంచి వెళ్ళగొట్టా లని చూస్తున్నారు— అని లబోదిబోమని ఏడుస్తుంది... పాపం జానకి తల్లికి

లోకజ్ఞానం తెలియదు... అసలే అస్తవ్యస్తమయిన మనస్సు - నిజమేకాబోలు అనుకొని 'అంతే అయివుంటుందే కాత్యా !' అంటుంది - అప్పుడు నీవే మంటావ్ — నీవా బయటపడింది, ఆ అమ్మాయా..."

ఇంట్లో జనమంతా హాల్లో పోగయి రణగొణ ధ్వనిగా మాట్లాడుకోసాగారు.

కాత్యాయినికి మతి తప్పింది ఎప్పుడో. ఎగశ్వాసతో జానకినే చూస్తూ రొప్పు తోంది. జానకికీ కాత్యాయినిని చూస్తుంటే దుఃఖం ఆగడంలేదు... రొప్పుతున్న మిత్రురాలి గుండెలమీద చేత్తో రాయసాగింది - ఇంకేమీ చేతకానట్లుగా.

కాత్యాయినికి తనమీద తనకే అసహ్యమూ, దుఃఖమూ, సిగ్గూ, భయమూ కలుగుతుండగా గిలగిలా కొట్టుకుంటోంది. ఇంట్లో కంఠాలలో వేడి తగ్గింది. గుసగుసలు ఎక్కువయినయి - సూదులు గుచ్చి నెత్తురులాగేస్తున్నట్లుగా వినబడుతున్నయి.

కాత్యాయినే మొట్టమొదట నోరు తెరిచింది, "నేను ఈ అవమానాన్ని భరించ లేనే - వెళ్ళిపోతాను !"

జానకి పేలవంగా నవ్వింది. "అంటే ఓడిపోతావన్నమాట - నీ యిష్టం !" కాత్యాయిని మాట్లాడలేకపోయింది.

"లేకపోతే మొగుడు చచ్చిన ముండను ఆదుకోమని ఏ బోడి వెధవ సలహా యిచ్చాడే నీకు ? నోరు మూసుకొని వచ్చినదానివి ఓ మూల ఏడుస్తూ పడివుండక - తగదునమ్మా అని ప్రతిదాంట్లో వేలు పెడితే ఏమౌతోంది - కాలుతుంది - మళ్ళీ మాట్లాడావంటే చితికిపోతుంది - ఎవర్నీ ఎదుర్కోవాలను కుంటున్నది నీవు - సింహాల్నీ, పెద్దపులుల్నీ ఎదుర్కొంటారుటే పిచ్చిదానా!... వాళ్ళలాంటి వాళ్ళో కాచివడపోయాటానికి మూడేళ్ళ కాలం నాకు చాలలేదే - పోయిరా అమ్మా ! పోయిరా - నీవైనా సుఖంగా బ్రతుకు - నేనెలాగూ సర్వ నాశనమయ్యాను - ఇక ఎవరిమధ్య వున్నా నాకొచ్చే నష్టమేమి ? - నా బోడి బ్రతుకుకోసం నీ వెందుకు చెడ్డపేరు తెచ్చుకుంటావు గాని నీవు పోయిరా !" అన్నది ఆవేశంతో గూడిన ఏడుపుతో.

"నా గుండెలు కణకణలాడే నిప్పుల్లా మండుతున్నాయి - దేవుడనేవాడు వుంటే వాళ్ళు సర్వనాశనమవ్వాలి !"

"మన చేతకానితనాన్ని శపించటంతోటే సర్దిచెప్పుకోవాలి !"

"ఇంతకీ నీవు గూడా నన్ను అనుమానిస్తున్నావా ?"

"ఛస్ ! నోర్మూసుకో - నేనేం బుద్ధిలేనిదాన్నికాదు !" అన్నది కసురు కుంటున్నట్లుగా.

కాటికాపరి దూరంగా వస్తున్న శవాన్ని చూచి లేచినట్లుగా లేచి జానకి గది లోకి వచ్చాడు ముసలాయిన. "అమ్మా జానకీ! ఆయన వచ్చాడు - ఇవాళ పదోరోజు గదా - "ఊరి బయట చెరువు గట్టున వుంచిన అస్థికలను తీసుకు వెళ్ళి కృష్ణలో కలిపించాలి - బెజవాడ పంపుదాం - ఓ యిరవై యివ్వ మంటున్నాడు!"

జానకి బిగుసుకుపోయి కూర్చున్నది.

"ఒక్క పైసా గూడా నా దగ్గర లేదండి - యిరవైరూపాయిలు ఖర్చుపెట్టి బెజవాడవెళ్లి కృష్ణలో కలిపినా, ఈ ఊళ్లో నల్లచెరువులో కలిపినా నాకు ఒరిగే దేమీ లేదు!" అన్నది కటువుగా. కాత్యాయినికి చేసిన అవమానాన్ని తన అవమానంగా తీసుకొని భగభగా మండిపోతోంది.

ముసలాయిన అప్రతిభుడయ్యాడు ఆమె కంఠానికి - జానకి అలా మాట్లా డటం ఆయన యింతవరకూ ఎన్నడూ చూడలేదు.

"అదిగాదమ్మా! శాస్త్రాలు అలా చెబుతున్నాయి - పోయినవాడికే గాకుండా మనకూ మన వంశానికీ గూడా అలా చేస్తే మంచిదమ్మా - ఈ పది రోజుల్లో ఎన్నో వందలు ఖర్చుఅవుతయి - అందులో ఈ యిరవై ఎంత?"

"నేను ఎలాగూ నాశనమయ్యాను - ఇక బాగుపడేందుకేమున్నది - కనుక మరెవరి బాగుతో నేను చేయగలిగిందేమీలేదు - నా గొంతుకోసినా పైసాలేదు!" అన్నది కర్కశంగా.

ముసలాయిన ఈ పరిస్థితి ఏమిటి, ఎందుకు ఇలా సంభవించిందో అర్థం కానట్లుగా తలగోక్కున్నాడు. "సరేనమ్మా! సరే - పెద్దవాడిని నట్టింటవుండి చూస్తూ వూరుకోలేను - ఆ నిర్మల తల్లినే అడుగుతాను - చిన్నన్నయ్య కోసరం ఆమాత్రం ఖర్చుపెట్టలేకపోతుందా?"

ఇక బయటకు వెళ్లేటందుకన్నట్లుగా వెనక్కు తిరగబోయినవాడల్లా ఆగి, "ఏమ్మా కాత్యాయినీ! నాకూ బాధగానే వున్నది - జరిగిందేదో జరిగి పోయింది - ఇంత జరిగింతరువాత నీకు చిన్నతనంగానే వుంటుందని నాకు తెలుసు - ఏం చేస్తాం చెప్పు — అనాడు కృష్ణుడంతటివాడు నీలాపనిందలు భరించాడు - ఇంటికి వెళ్లిపోతావేమిటి - చెప్పమ్మా - ఈ ముసలివాడిదగ్గర ముఖమాటపడవద్దు - బస్స్టాండు దాకావచ్చి ఎక్కిస్తాను -!" అన్నాడు.

కాత్యాయిని ఆయన ముఖంలోకి పిచ్చిచూపులు చూడసాగింది ఏంచేయాలో తెలియనట్లుగా.

జానకే ఖంగున అన్నది : "అది ఇప్పుడు ఎక్కడికీ వెళ్లదు - వెళ్లటానికి వీల్లేదుగూడా - నా ఈ ఇంట్లో దానికి జరిగిన ఈ అవమానం దానిదిగాదు - చచ్చిన అయన్ది - బ్రతికున్న నాదీను !"

ముసలాయిన ఇక ఒక్క క్షణం అక్కడ నిల్చోలేదు !

* * *

ఆ రాత్రి పదిగంటలకు కామాక్షమ్మకు ఆయాసం ఉధృతంగా వచ్చింది. ఎగశ్వాస దిగశ్వాస - ఊపిరి సలుపుకోలేని స్థితిలోవున్న ఆ భారీ శరీరాన్ని మొసలాయినే ఓ రిక్షాలో వేసుకొని డాక్టరు దగ్గరకు తీసుకువెళ్లి ఓ యింజక్షన్ చేయించుకువచ్చాడు.

ఆమె మత్తుగా మంచంమీదపడి కళ్లుమూసుకున్నది ఒక అరగంటలోనే. కానీ అటు నిర్మలగానీ, ఇటు ముసలాయినగానీ రాత్రి పన్నెండు గంటలయినా నిద్ర పోలేదు.

అంతేగాకుండా చుట్టూ బంధువులను కొలువుగా తీర్చుకొని ఇప్పుడు కామాక్షమ్మకు వచ్చిన ఆయాసానికి కారణం జానకి, కాత్యాయిని కలసి చేసే అప్రాచ్యపు పనులేనని తీర్మానాలుచేశారు !

* * *

## 7

ఉదయం పదిగంటలకు కాత్యాయిని బయటకు వెళ్ళేటందుకుగాను తయారయింది.

అప్పటికే ఆ యింటికి ఎవ్వరెవ్వరో వచ్చారు. హడావిడి ఎక్కువయింది. కర్మ ఆ రోజే మొదలుపెడుతున్నారు.

తెల్లవారిన అరగంటలోనే ముసలాయిన జానకి గదిలోకి వచ్చి గోడకు జారి గిలబడి కూర్చున్నాడు "చూడమ్మా జానకీ ! ఇవాళ తొమ్మిద - చూశావు గదా మనకు కావాల్సినవాళ్లు నలుగురూ వచ్చారు - ఇంకా వస్తున్నారు - ఇంట్లో ఏమీలేవమ్మా. ఏం చేద్దామంటావు - ఏమైనా ఆలోచించావా మరి - నాకూ బాధగానే వున్నదమ్మా - కాత్యాయిని తిరుగుతోంటే నాకు వందమంది మనుష్యుల పెట్టులా వుండేది - ఎవళ్లో చిన్నపిల్లలుచేసిన పనికి ఆ అమ్మాయిని మనస్సు పాడుచేసుకోవద్దనమ్మా - నిర్మలతో అదే అంటే - పాపం పిచ్చిది 'అదీ నిజమే అయివుంటుంది మామయ్యా అన్నది', అని ఒక్క క్షణం గుక్క తిప్పుకుంటున్నట్లుగా ఆగి. "ఏమ్మా డబ్బు సంగతి ఏం చేద్దామంటావ్... ?" అన్నాడు.



జానకి దృఢంగా అన్నది : "భయం ఏం లేదులెండి - నేనే ఎక్కడో అక్కడ తెప్పిస్తాను !" అని

మొన్న జరిగిన ఆ అవమానకరమైన సంఘటన తరువాత కాత్యాయిని జానకి గదిలోనుంచి అసలు బయటకే రావటంలేదు. ఎవ్వరో జానకితోపాటు కాస్త అన్నం తీసుకువచ్చి పడేస్తే వత్సపుకూడులా మెతుకులు కెలుకుతూ తింటున్నది. జానకితోపాటే చీరచెంగుపరుచుకు పండుకుంటున్నది.

తనను ఇంట్లోనుంచి వెళ్ళగొట్టటానికే ఇంత పనిచేశారు - రేపు జానకిని ఇంత విషమిచ్చి చంపరనేమిటి ? - కాత్యాయినికి భయంతో మేను కంపించింది.

బెదుపతోన్న కళ్లతో జానకిని - అస్థికలు ఏరుకున్న తరువాత స్మశానంలో అన్నం వండి ఇస్తర్లో పెట్టిపెట్టగా - దానిచుట్టూ తిరిగే గద్దల్లాంటి లోపలి మనుష్యులని చూస్తూకూర్చునేది రోజులో చాలా భాగం...

"నేను వెళ్ళిరానా ?" పదోసారి అడిగింది జానకిని "నీవేమైపోతావోనని భయంగా వున్నదే జానీ !"

"చచ్చిపోవటానికి మించినది మరేం జరగదు గదా !"

"నీవు చచ్చిపోతే బాబేమౌతాడే !"

"పిచ్చిదానా - నేను చస్తే వాడు బతుకుతాడటే - హాయిగా ఏంపీ తెలియని స్థితిలో పోతేనే వాడికి సుఖం !"

కాత్యాయిని కళ్లముందు — తను వచ్చిన రోజురాత్రి - వంటినవున్న చొక్కాకు గుండీలు గూడా లేకుండా ఆరుబయట చల్లగాలిలో ముక్కులమ్మట కారిన చీమిడి ఎండిపోయి అట్టకట్టి కళ్ళు జ్వరంతో పేలిపోతోండగా - బిక్కుబిక్కు మంటూ పడివున్న బాబు మెదిలాడు.

కళ్ళు చెమ్మగిల్లినయి.

"నేను వెళ్లనే - ఈ రాక్షసులని ఎదిరిస్తాను - వీళ్ల అంతు తేలుస్తాను - వీళ్ల ప్రాణాలుతీస్తాను !" అన్నది ఆవేశంగా.

"నీవు చస్తావ్ !" ఎగతాళిగా నవ్వింది జానకి.

దూరంగా కుక్కల అరుపులు - రిక్షాలు ఆగిన శబ్దం - కొత్త శవాలు స్మశానంలో దిగుతున్నయి - మంటలు - పొగలు - పగులుతోన్న కొండలు - బ్రతుకుతున్న మనుష్యుల నడుమ చచ్చిన మనుష్యుల కపాలమోక్షాలు —

నలభై గంటల తెచ్చిపెట్టుకున్న ఒంటరి బ్రతుక్కు - వెలుగు సిద్ధామన్నట్లుగా - కొత్త ఊపిరిపోసుకొని, మనస్సును మరింత గట్టిపరుచుకొని - బయటకు బయల్దేరింది.

జానకి అన్నది : "ఇక పాతవన్నీ మర్చిపో - నేను చెక్కిస్తాను - బ్యాంకుకు వెళ్లి డబ్బు పట్టుకురా !"

"అలాగే !"

జానక్కి అంత దుఃఖంలోనూ డీలాపడిపోయిన కాత్యాయిని ముఖంచూస్తే జాలీ నవ్వూ ఒక్కసారే వచ్చినయి, "పిచ్చిదానా ! నా మూలకంగా నీ వెంత అవమానాన్ని మోస్తున్నావే !" అన్నది చిన్నగా ఆప్యాయంగా, ఆత్మీయంగా మిత్రురాలి ముఖంలోకి చూస్తూ.

"అటు ఆఫీసుకు గూడా వెళ్లి - ఒక్కసారి ఆయనకు నీవు ఉద్యోగంలో జేరటావని చెప్పివస్తాను !"

"ఆలోచిద్దాం అని అన్నాను గదా !"

"అదిగాదు - మనం ఊఁ అనగానే వాళ్ళేం ఆర్డర్లు ఇవ్వరు - ఆరునెలలు పట్టవచ్చు - సంవత్సరం పట్టవచ్చు - ఇప్పుడే కాస్త ఈ వేడిమీద వాళ్లను ప్రయత్నించమంటే ఫలితం బాగుండవచ్చు - వాళ్ళు ఓ నిర్ణయం తీసుకున్నదాకా నీవు ఆలోచించు - ఆపైన యిష్టమయితే జేరు — కష్టమయితే మానేయ్ !"

"సరే - నీ యిష్టం !" భయం భయంగా అన్నది జానకి.

కాత్యాయిని బయటకువచ్చి గేటుతీస్తుండగా రామ్మూర్తి ఆఫీసులో పనిచేసే మనిషి - లోపలికి వస్తూ కనిపించాడు.

కాత్యాయిని వెనక్కు వచ్చింది.

ముసలాయిన ఇంకా గోడవార కూర్చునే వున్నాడు.

"ఈ రోజున హైద్రాబాద్‌నుంచి మా డైరెక్టర్ వస్తున్నాడు - వారు ఉద్యోగంలో చేరుతాననే పక్షంలో ఆయనతో మాట్లాడతానన్నారు మా మేనేజర్ ?"

ఆ విషయం ఆ యింట్లో అందునా పాములాంటి ముసలాయిన ముందు ప్రస్తావించటం కాత్యాయినికి యిష్టంలేదు

"నేనే అక్కడికి వద్దామనుకుంటున్నాను - పదండి !" అన్నది ఇక అంతటితో ఆ విషయాన్ని త్రుంచేస్తున్నట్లుగా.

కానీ ముసలాయిన నదలలేదు వచ్చినతన్ని, తీగెంతా కదిలించాడు. నిర్మల వచ్చి తలుపుదగ్గర నిలుచున్నది కాసేపు దీర్ఘాలు తీసింది కళ్లు మిటకరించి కాత్యాయిని వంక చూస్తూ.

ముసలాయిన చివరకు లేచి నిల్చుంటూ, "చాలా బాగుంది నాయినా ! తప్పకుండా జేరుతుందని చెప్పు - జీవితంలో ఇక అంతకుమించిన ఆధారం ఇంకేమున్నది - దేవుడే ఇప్పుడు నీ రూపంలో వచ్చినట్లుగా వున్నది నాకు - నీవు నూరేళ్లు బ్రతుకు !" అన్నాడు.

ఆయనతోపాటే కాత్యాయినీ బయ. పోయింది.

* * *

నిర్మల ముసలాయన్ను మేడమీదకు ఆయన వయస్సును గూడా గమనించకుండా చేయిపట్టుకు బరబరా లాక్కుపెళ్లింది.

మామయ్యతో చాలా నిర్మొహమాటంగా మాట్లాడింది. "మామయ్యా, నీకు మీ ఊళ్లో మనుష్యుల తలకాయల్నే చిటికెల్లో తీసేయించగలవనే పేరున్నదని నాకు తెలుసు - నీవు తలుచుకుంటే లక్షాధికార్లు భిక్షాధికార్లు అవుతారని, అడుక్కుతినేవాళ్ళు అందలమెక్కుతారనీ నాకు తెలుసు - అలాంటి నీవే ఇంత చిన్న విషయాల్లో గూడా పప్పులో కాలేస్తావని నేననుకోలేదు - జానికిని ఉద్యోగంలో జేరనిస్తే ఆవిడగారు మన గుప్పిటలో వుంటుందంటావా ?"

ఆయన నవ్వాడు, ముద్దొచ్చే చిన్న పాము నోరుతెరిచి నాలుక బయటపెట్టి

నవ్వినంత అందంగా నవ్వాను "అమ్మా నిర్మల తల్లీ! ఎప్పుడూ నాలిక్కి తేనె అరంగా అరంగా రాస్తునే వుండాలమ్మా - జానకి జేరుతోందీ అన్నాను - అందరి దృష్టిలో ఇప్పుడు మనం ఆమె మేలుగోరే వాళ్లమే అయ్యామా? - రేపు ఆఫీసులచుట్టూ తిరగవలసినవాణ్ని నేనేనా? - తిరగవలసినంత తిరిగి హారాయించుకోవాల్సినంత హరాయించుకొని - అక్కడ చెప్పాల్సిందేదో చెప్పేసి చప్పరిస్తే సరిపోలే!"

"ఊఁహూఁ" - నిర్మల కఠినంగా అన్నది. "మీ తరం ఆలోచనలకు బూజు పట్టింది మామయ్యా! కాత్యాయిని వున్నంతకాలం నీవేమీ చేయలేవు - నీ ఎత్తులు ఏమీ సాగవు!" అన్నది - కళ్లలోనుంచి ప్రాణంపోయిన శవం చూపుల్లా ఒక్కసారి తలెత్తి మ డిపోతోన్న తూర్పువైపుకు చూచి. "దీనికి ఒక్కటే మందు మామయ్యా! - రేపే గదూ పదోరోజు - చీకటితో తీసుకు వెళ్లి గుండు కొట్టించేస్తే సరి! - జీవితాంతం దాన్ని వంటయింట్లోనుంచి బయటకురాకుండా సమాధి చేసినట్లే - ఇక ఉద్యోగమూ లేదు - సద్యోగమూ లేదు!" విషం చిమ్ముతూ అన్నది

- ముసలాయిన ఆ ఆడదాని తెలివిముందు అఖండుడననిపించుకున్న తన తెలివి ఎంత అన్నట్లుగా కుంచించుకుపోయి నోటమాటలేక అలాగే చూస్తూ వుండిపోయాడు.

"మరో కంటికి తెలియగూడదు మామయ్యా! - అన్ని ఏర్పాట్లూ జరిగి పోవాలి - తిరిగి ఇంటికి వచ్చేటప్పటికి మనిషి ఆకారమే మారిపోవాలి!"

* * *

మధ్యాహ్నం ఒంటిగంటల్లా ఇంట్లోకి కావల్సిన సరుకులన్నీ వచ్చినయి. ముసలాయిన మళ్ళీ వచ్చి జానకి గదిలో కూర్చున్నాడు గోపాలరావు. "అమ్మా! జానకీ - నీ జీవితం ఇలా అస్తవ్యస్తం అయిపోయిందే అని దిగులుపడి చస్తు న్నాను - దేవుడు ఓ సన్నని బాటంటూ చూపించాడు - దానివెంటే నడవా లమ్మా నీవు - ఉద్యోగంలో చేరిపో తల్లీ!"

జానకి మాట్లాడలేదు. కాత్యాయిని ఒక పక్కన ఒదిగి పడుకున్నది.

"ఈ మనస్తాపం మర్చిపోవాలంటే కొన్ని పరిసరాల మార్పు కావాలమ్మా! మీ యింటికి వెళ్లి రెండు మూడు నెలలు వుండి వస్తావేమిటి? - ఈ యింటి విషయంతో దిగులుపడబోకు - నేనున్నాను - నిర్మలున్నది - పెద్దది అత్త గారు కామాక్షి వున్నది - కష్టమో, నష్టమో పడివుంటాం మరి!"

కాత్యాయిని ఇక తప్పదన్నట్లుగా కల్పించుకున్నది. "అక్కడ ఏమున్నదని, ఎవరున్నారని వెళుతుంది - ప్రస్తుతం చస్తూ వాళ్ల నాన్న యిచ్చిన మట్టికొంప దాని బ్రతుకులాగానే కూలేందుకు సిద్ధంగా వున్నది !"

"శాస్త్రం వున్నది గదమ్మా ! ఇలాంటి పరిస్థితుల్లో పుట్టింటికి వెళ్లి కొన్ని రోజులపాటు వుండిరావటం రివాజు !"

"పోనీయ్ మీ యింటికి తీసుకువెళితే సరిపోతుంది బాబాయిగారూ - దానికి తండ్రిలాంటివారు మీరు !"

ఆయన హాయిగా నవ్వాడు. "నిజమేనమ్మా! జానకి తల్లి 'ఊఁ' అనాలేగాని అంతకుమించిన ఆనందం నా కేమున్నది ! — దగ్గరుండి తీసుకవెళ్లనూ - కానీ మా యింటికి వచ్చినా - నిర్మల యింటికి వెళ్లినా - ఇక్కడవున్నా - పుట్టింటికి వెళ్లినట్లు మాత్రం కాదు గదమ్మా ! అందుకుగానీ—"

కాత్యాయినికి ఇంకా ఆయనతో మాట్లాడటం శుద్ధదండగ అనిపించింది.

జానకే అన్నది ! "నేను ఎక్కడికీ వెళ్లనండీ - ఇదే నా యిల్లు - పుట్టినిల్లయినా -మెట్టినిల్లయినా !"

"అవునమ్మా ! అవును - కాదని ఎవరనగలరు - నీకు ప్రస్తుతం ఆ త్తగారే తల్లీ తండ్రీనూ - సరేనమ్మా ! సంతోషం—"

"అంతగా అలా వెళ్లటం శాస్త్రరీత్యా తప్పదూ అనుకుంటే మా యింటికి వస్తుంది లెండి !" అన్నది ఇక అక్కడితో ఆ విషయాన్ని త్రుంచేద్దాం అన్నట్లుగా

"నాకు తెలుసమ్మా ! మనమంతా వుండగా జానకి తల్లికి లోటేమిటి ? అది సరేగానీయమ్మా - రేపు దానాలు ఏమేవి ఇవ్వాలో ఆలోచించావా ?"

కాత్యాయిని లేచి కూర్చుంటూ అన్నది : "బాబాయిగారూ ! నేనొక్కటి చెబుతాను వింటారా - దేవుడనేవాడుంటే దానికి ఈ వయస్సులో ఈ అన్యాయం జరిగేదేగాదు - అలాంటి సర్వనాశనమయిన అది ఇంకొకరికి దానాలు ఇవ్వటమేమిటండీ !"

"అలా అనవద్దమ్మా - అలా అనవద్దు ! - చచ్చినా బ్రతికినా వాడు మనవాడే - వాడికి మనస్తాపం కలిగించవద్దు !"

"మీరేమైనా అనండి ! బాబుకు మిగల్చకుండా ఒక్కపైసా అనవసరంగా ఖర్చుపెట్టినా అది దుర్వినియోగంచేసినట్లే - దానివలన చచ్చిన ఆయన సంతోషిస్తాడని నేను అనుకోను !" కాస్త కరుకుగా అన్నది

నిర్మల గాలిదుమారంలా దూసుకువచ్చింది. "ఇలా పోగుచేసి అట్టిపెట్టి దొంగల సూట్కేసులు నింపితే వాడు సంతోషిస్తాడు గదూ - అవునా - అదేనా మీరూ కోరుకునేది — !" అన్నది ఎగతాళిగా.

"నిర్మలా !" జానకి కోపాన్ని ఎంత నిగ్రహించుకుందామన్నా నిగ్రహించుకోలేకపోయింది. ఊగిపోతూ, పెద్దగా అరవసాగింది మతి స్థిమితం తప్పిన దానిలా. "ఇంకొకసారి నోరుజారి ఎవరైనా సరే కాత్యాయినిని దొంగ అంటే నేను సహించను - అంతేగాదు అలాంటి వుద్దేశ్యం వున్నవాళ్లెవ్వరూ ఈ గడపలో ఉండనవసరంలేదు - ఉండనక్ఖర్లేదు - వాళ్లు, చచ్చిన ఆయనకుగానీ-నాకుగానీ - ఎంత దగ్గర వారయినాసరే, ఆత్మీయులైనాసరే - మరోసారి ఇలా నాచేత చెప్పించుకోవాల్సిన అవసరం కలగగూడదు — గుర్తుంచుకోండి !" రొప్పుతూ పడిపోయింది.

* * *

సాయంత్రం ఆరగంటలవేళ కాత్యాయిని పేరున ఓ టెలిగ్రాం వచ్చింది

దాన్ని విప్పి చదువుతూనే తత్తరపడింది కాత్యాయిని. కాళ్లూ చేతులూ వణకటం మొదలుపెట్టినయి. ఉబుకుతున్న నీళ్లతో కళ్ళు నిండిపోతున్నాయి - ముఖమంతా కళాహీనమైపోయింది

"ఏమైందే ?" అన్నది జానకి ఆదుర్దాగా.

"ఆయనకు స్కూటర్ యాక్సిడెంట్ అయిందట - హాస్పిటల్లో జేర్చారట - సీరియస్‌గా వున్నది - నన్ను వెంటనే రమ్మంటూ టెలిగ్రాం యిచ్చారు ?" అన్నది పెద్ద పెట్టున ఏడుస్తూ.

"అయ్యో ! ఎంత ఘోరం జరిగింది తల్లీ ! — మంచివాళ్లకే ఎప్పుడూ కష్టాలు వస్తయ్యమ్మా - అమ్మా ! నిర్మల తల్లీ - వంటయిందేమో కనుక్కో-తల్లీ - భోజనంచేసి వెళుతుంది !" అన్నాడు గోడవారగా కూర్చున్న ముసలా ... లేచి నిల్చుంటూ

"రేపు వెళ్తానే !" అన్నది ఏడుస్తూనే.

చెడిపోయేవాళ్లను ఎందరుండి ఏం బాగుచేయగలరు - ఎవరిఖర్మ వాళ్లది - ఎవరి బాగోగులు వాళ్లవి - మరోసారి ఆయన ఆసుపత్రిలో ఎలా వున్నారో అన్న భయం - జానకిమీద, ఆమె నిస్సహాయ పరిస్థితులమీద నల్లటి దుప్పటిని కప్పివేసి ఆమెను మరుగుపరిచింది

సూట్కేసు సర్దుకొని బయటకువస్తున్నదల్లా ముసలాయన్ను చూస్తూనే,

"బాబాయిగారూ ! ఇందులో మీ సొమ్ములేమైనా తీసుకువెళ్లుతున్నానమో ఒక్కసారి చూచుకోండి - తరువాత నాకు అభాండాలు మోయవలసిన అవసరం వుండదు !" అంటూనే సూట్కేసును ఆయన ముందర పడవేసింది.

ఆయన అవాక్కయ్యాడు ఈ అనుకోని ఉపద్రవానికి.

'నేను అప్పుడే చెప్పాను గదమ్మా ! ఎవ్వరో పిల్లలు తెలియకచేసిన పిచ్చి పనికి లేచిన తుఫాను అది అని - మర్చిపో అమ్మా - అంతా మర్చిపోయి సుఖంగా వెళ్ళిరా అమ్మా - నీకు అన్నివిధాలా మేలే జరగాలని పెద్దవాడిగా ఆశీర్వదిస్తున్నాను - నీవు నా కన్నబిడ్డలాంటిదానివి !"

జానకి లోపల కుళ్ళి కుళ్ళి ఏడుస్తోంది

"వెళ్లొస్తానే జానకీ !" అంటూ ఇక అక్కడ మాట్లాడటం కష్టం అన్నట్లుగా సూట్కేసును చేతిలోకి తీసుకొని బయటకు వచ్చేసింది.

గేటుదాటుతుండగా రాములమ్మే వచ్చి, నేను పట్టుకువస్తాను ఈయండమ్మా!" చేతిలోది తీసుకున్నది.

ఇల్లుదాటి బరువెక్కిన గుండెలతో నాలుగడుగులు వేసింతరువాత రాములమ్మే అన్నది తాలుతున్న కాత్యాయిని మనస్సుమీద రాయివేస్తున్నట్లుగా "మీరూ వెళ్ళిపోతున్నారు - జానకమ్మ పని మరీ అన్యాయమయిపోతుందేమో నమ్మా !" అని

"ఏం చేయమంటావ్ మరి !" అన్నది.

"అదేనమ్మా ! - మీరు వచ్చిందాకా నన్ను ఇక్కడే వుండమంటారా అమ్మా - మా వాడ్నిగూడా ఓ చుక్కేసుకొని ఇక్కడే పడివుండమంటాను !"

"వద్దే రాములూ ! అన్నది సాలోచనగా ఒక్కక్షణం ఆగి" ఆ రాక్షసులకు ఎవ్వరు అడ్డువస్తే వాళ్ళను ఈడ్చి పక్కకు లాగేయటమే పని - రేపు మీమీద కేసేదైనా బనాయించి జైలుకు పంపిస్తే ఏంచేస్తారే !" అన్నది అసహాయంగా నిట్టూర్పు విడుస్తూ.

రాములమ్మ భయపడ్డట్లుగా మాట్లాడలేదు.

"ఏమైనా - జాగ్రత్త - నేను రెండురోజుల్లో ఆయనకు తగ్గితే వస్తాను - లేదా దాని ఖర్మ దానిది - నా ఖర్మ నాదీనూ !''

ఖాళీ రిక్షా ఎదురుపడింది

సూట్కేసు దాంట్లోపడేసి ఎక్కి కూర్చున్నది కాత్యాయిని బరువైన గుండెతో.

ఎలా వున్నదో, ఎలాంటి ఆకారంలో మనిషిని చూడవలసి వస్తుందో అన్న ఆదుర్దాలో వున్న కాత్యాయినికి ఆ బస్సు ప్రయాణం చాలా ఘోరంగా వున్నట్లనిపించింది గంటలు - రోజులు - సంవత్సరాలు - యుగాలు గడుస్తున్నట్లున్నది బస్సు బయల్దేది - ఇంకా గమ్యం చేరదేం ?

ఇంతకంటే తొందరగా వెళ్లలేదా ?

తల పగిలిపోతోంది.

"ఏయ్ డ్రైవరూ ! నీ గొంతుపిసికేస్తాను - ఎందుకు ఇక్కడ బస్సు ఆపావ్ ?'

పిచ్చిగా నలువైపులా చూచింది. ఇదేవిటి - ఇవన్నీ తను ఎప్పుడో చూచినట్లున్నాయి - అరే ! తన ఊరు వచ్చేసిందే - సూట్కేసు తీసుకొని లోయలోకి దిగిపోతున్నట్లుగా ఊగిపోతూ బస్సుదిగింది.

ఎక్కడికి వెళ్ళాలి తను ? హాస్పిటలా - ఇల్లా-

ఆయన బ్రతికే వున్నాడా ?

—అబ్బ ఈ సూట్కేసు ఇంత బరువుగా వున్నదేం ? - విసిరి అవతల పారేస్తే...

"ఏయ్ రిక్షా !"

యింటికి - యింటికి - యింటికి

భగవంతుడా ఆయన్ను రక్షించు - నన్ను రక్షించు - ఆయన్ను బ్రతికించు - నన్ను బ్రతికించు...

'రక్షించండి... రక్షించండి... మీరంతా... రక్షించండి... నేను ఈ దుఃఖాన్ని భరించలేను !'

యింటి ముందు రిక్షా ఆగింది.

ఇంట్లో ఎవ్వరూ లేరా ?

తలుపుకు తాళం లేదే !

ఇక ఆలశ్యం భరించలేనట్లుగా దడదడా బాదుతోన్నది తలుపును, పిచ్చిగా బాదుతోంది. ఊపిరి బిగపట్టుక, బాదుతోంది...

ఎవ్వరో వస్తున్నారు - అడుగుల సవ్వడి.

తలుపు బార్ల తెరుచుకున్నది - తలుపు తెరిచిన వ్యక్తి రెండు చేతులనూ అలాగే తలుపుమీద వుంచి నిల్చున్నాడు.



కాత్యాయినికి ఏమీ అర్థంకాలేదు - నమ్మలేకపోతుంది - కళ్ళు రెపరెప లాడించింది

అంతా అయోమయం...

"మీరు !"

"అవును నేనే - లోపలికి రా !'

చేతిలోని సూట్కేసును అక్కడే వదిలేసి, అయనమీద పడిపోయి ఘొల్లు ఘొల్లున ఏడ్వసాగింది. "మీకు స్కూటర్ యాక్సిడెంట్ అవ్వలేదా ?"

అతడు బిత్తరపోయాడు, "నాకు స్కూటర్ యాక్సిడెంటా ? -''

* * *

## 8

తెల్లవారుఝామున నాలుగు గంటలకే ఆ యింట్లో హడావుడి మొదల యింది పెద్దవాళ్ళు నలుగురూ లేచారు. జానకిని లేపారు తలంటిపోసారు. బట్టలు కట్టినట్లున్న పొడువాటి జుట్టును చిక్కు తీసి జడవేశారు. ఒకామె వచ్చి కాళ్ళకు పారాణీ పెట్టింది. మొఖానికి చక్కగా గుండ్రగా రూపాయంత బొట్టు పెట్టారు.

తెల్లని మల్లెదండ తలలో పెడుతుండగా జానకి దుఃఖాన్ని ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడుస్తూ, "వద్దండీ!" అన్నది.

"తప్పమ్మా! వద్దనగూడదు - జీవితంలో ఇదే ఆఖరిసారి నీవు పెట్టుకోవటం - పెట్టుకోవాలమ్మా!"

"నాకు ఆఖరిసారి ఎన్నడో అయిపోయింది - ఇంకోసారి రాదు - వద్దండీ! వద్దు!"

"ఎంత చక్కని తలకట్టు - అదృష్టం లేనప్పుడు ఎంత వుండీ ఏం లాభం?" ఒక ముసలామె దీర్ఘం తీసింది

ఎవరెవరో ఆడవాళ్ళు వస్తున్నారు. కూర్చొని ఏడుస్తున్న జానకిని తొంగి చూచి వెళుతున్నారు

ఒకామె అన్నది "నిర్మలా! మళ్ళీ వచ్చేటప్పటికి బాబును ఎక్కడికైనా తీసుకు వెళ్ళమ్మా!... దడుసుకుంటాడేమో!"

జానకి తలెత్తి బాబువంక చూచింది వాళ్ళ మాటలు ఏమిటో వింతగా విన బడుతున్నయి తన జుట్టును గురించి జాలిపడటం — తనకు పూలు పెట్టడం - తన బాబు దడుసుకుంటాడనటం - ఇదంతా చూస్తుంటే—

లీలగా మెదులుతున్న భయానికి భాషం చెబుతున్నట్లుగా ఇంటిముందు కుక్క ఏడుపు వినబడింది. అంటే వీళ్ళ ఉద్దేశ్యం? - వింతగా పిచ్చిగా నలువైపులా చూడసాగింది - ఏంచేస్తారు తనని? - తన జుట్టు తీయించి నెత్తిన ముసుగు వేస్తారా? నిజమా? - నిజమా? ..

భయంగా వణుకుతు చుట్టూ చూసింది - అంతా రాక్షసుల్లా - దయ్యాల్లా - భూతాల్లా - వికటాట్టహాసాలు చేస్తూ కనబడుతున్నారు

"రిక్షాలు వచ్చినయి!"

ముసలాయిన లేచి చొక్కా తొడుక్కొని కండువా వేసుకున్నాడు.

వీళ్ళంతా కలిసి బ్రతికున్న తననీ, తన బాబునీ సజీవ సమాధి చేస్తున్నట్లే అనిపిస్తున్నది - వీళ్ళందరినీ ఎగత్రోంచి, మొఖాలు పగలగొట్టేసి - ఈ ఆచారాల శృంఖలాలను తెంచేసుకొని ఎక్కడికైనా పారిపోతేనో?—

ఎక్కడికి పారిపోగలుగుతుంది ఈ కటకటాల బ్రతుకునుండి?

ఉఁహూఁ..

అసలు ఆయన పోయిన తరువాత ఇవన్నీ తనకు ఎందుకు? ఇంత పొడు వాటి జడ లేకపోతేనేం. ఈ రంగు రంగుల చీరెలు లేకపోతేనేం? ఈ చేతు

లకు గాజు లెందుకు ? మెళ్ళో ఈ మంగళసూత్రా లెందుకు ? - అసలు ఈ బ్రతుకు దేనికి ?

వద్దు - వద్దు - వద్దు - కావాలి - వద్దు - కావాలి ..

బాబు పెద్దవాడవ్వాలి ... బట్టకట్టాలి ... చదువుకోవాలి .. ఉద్యోగం చేయాలి - డబ్బు సంపాదించాలి - వృద్ధిలోకి రావాలి - పెండ్లిచేసుకోవాలి - పిల్లలు కలగాలి -

ఏది కావాలి ? - ఏది వద్దు ? -

కళ్ళు గిర్రున తిరుగుతున్నయి - మీది మీదికి ఏదో భూతం నాలుకలు చాచుకొని పొగలు క్రక్కుతూ - తనని, తన బాబును మింగేందుకు అన్నట్లుగా వస్తోంది - చీకటి - చీకటి - పొగలు

దూరంగా వున్న బాబుని లాక్కోపోయి ముందుకు వంగుతూ భయంతో కెవ్వున అరిచి పడిపోయింది జానకి.

నలుగురూ మూగారు. గోల- హడావుడి- ఏంవైంది? ఏంవైంది ?.. ఏంవైంది?

ఒకామె ముందుకువంగి కాసిని నీళ్ళు జానకి మొఖంమీద చిలకరించింది భయపడుతున్న మనిషిని పట్టుకు సేదదీరుస్తున్నట్లుగా తన ఒళ్ళోకి జేర్చుకొని వెన్ను రాస్తోంది. అందరూ ముందుకు వంగి జానకి ఎప్పుడు కళ్ళు తెరుస్తుందా అన్నట్లుగా ఆశగా చూస్తున్నారు.

ముందు గదిలోవున్న టేబుల్‌మీద గడియారం స్టెతస్కోప్‌లో డాక్టరుకు వినబడుతున్న గుండె శబ్దంలా ఆ యింట్లో అందరికీ వినబడుతోంది.

నిర్మలే అన్నది : "ఇహ లేపండి ఆవిడగారిని - మళ్ళా తెల్లవారుతోంది !"

అప్పటికే జానకి కొద్దిగా కళ్ళు తెరిచింది. తలంతా నాజుగా వున్నది. బరువుగా వున్నది పళ్ళ చక్రాల మధ్యపెట్టి బిగించినట్లుగా వున్నది. జానకిని ఒళ్ళోపడుకోబెట్టుకున్న ఆమె ముందుకు వంగి, "లేమ్మా !" అన్నది. జానకి పిచ్చిపిచ్చి చూపులు చూస్తుంటే ఆమెకు భయమేసింది.

"ఏమ్మా ! కళ్ళు తిరిగినయ్యా !"

జానకి తేరుకొని సిగ్గుపడుతున్నట్లుగా లేచి కూర్చున్నది. తనవంకే చూస్తున్న చుట్టూ మనుష్యుల్ని చూచింది. గుడ్లగూబలా తనవంకే మిణుకు మిణుకు మంటూ చూస్తున్న ముసలాయన్ను చూచింది. శిఖండిలావున్న ఆడ బిడ్డ నిర్మలను చూచింది ప్రాణ హీనుల్లా పోగయిన జనాన్ని చూచింది

బిగుసుకుపోయి, సర్వనాశనానికే సిద్ధపడ్డట్లుగా, లేచి నిల్చుంటూ "పదండి !" అన్నది దృఢంగా

అందరూ ఆడబిడ్డలు. భయపడ్డారు జానకికి మతి భ్రమణం కాలేదుగదా అన్నట్లుగా వెనక వెనకే నడవసాగారు.

ముందుకు నడుస్తున్న గుంపులోనుంచి నిర్మల ముసలాయన్ను వెనక్కు పిలిచింది. "మామయ్యా! అన్ని ఏర్పాట్లు చేశావా?... నల్లత్రాచులాంటి దాని ఆ బారెడు జడ చూస్తుంటే నాకు ఒళ్ళు మంట!" అన్నది అసహ్యంగా.

"నిర్మల తల్లీ! మామయ్య మాటంటే మాటే - చూస్తావుగా - మేం వచ్చేటప్పటికి కాస్త ఈ గదులు ఇంత నూనెపోసి దీపం వెలిగించి పెట్టమ్మా మర్చిపోకుండా!" ముసలాయన వాళ్ళలో కలిశాడు.

తలుపులు ఛళ్ళున తెరుచుకున్నాయి.

ముసలాయిన ఎత్తిన కాలు ఎత్తినట్టే బిగుసుకుపోయింది. నెత్తిన పిడుగు పడ్డట్లుగా గిలగిలలాడిపోయాడు.

ఎదురుగ్గా టాక్సీ ఆగివున్నది. ఆ టాక్సీ వెనక తలుపు తెరుచుకొని కాత్యాయిని దిగుతున్నది!

*　　　　*　　　　*

"కాత్యాయిని తల్లీ! చిన్నదానివి ఇక్కడకు రాగూడదూ అంటే వినకుండా వచ్చావు గదమ్మా - ఇక్కడ జరిగే తంతంతా నీవు చూడటం అంత మంచిది గాదమ్మా! - పద - మనం వెళ్ళి అక్కడ కోనేటి పక్కన కూర్చుందాం - అంతా అయింతరువాత వాళ్ళు అటే వస్తారు - ఇంటికి కలిసి వెళ్ళవచ్చు!"

చెరువు గట్టునంతా అక్రమించినట్లున్న మర్రిచెట్టు అమావాస్యనాటి రాత్రి జుట్టు విరబోసుకొని నృత్యం చేస్తున్న దయ్యంలావున్నది. నీళ్ళమీదనుంచి వస్తున్న గాలి వంటరి ప్రయాణీకుల్ని చుట్టివేస్తున్న దయ్యాల కౌగిలింతల్లా వున్నది. చెట్లమీద గుంపులు గుంపులుగా వున్న పక్షులు శవాలకు కాపలావున్న మనుష్యులను వెళ్ళకొట్టేందుకు అన్నట్లుగా ఈకులను 'దబదబ' లాడిస్తున్నాయి.

కాత్యాయిని జానకిని చూస్తూ నిల్చున్నది.

ఎవరో స్త్రీ ఎదురుగ్గా కూర్చుని చేతుల గాజులు పగలగొట్టింది మెట్టెలు తీసివేసింది బొట్టు చెరిపేసింది - మంగళసూత్రాలు తెంపివేసింది ..

జానకి మౌనంగా శిలలా కూర్చున్నది.

కాత్యాయనికి దుఃఖం ఆగటంలేదు. కంటివెంట నీరు కారుతోంది - దాని బ్రతుకు కళ్ళ ఎదుటనే మోడయిపోతున్నది.

మళ్ళా ముసలాయిన పక్కగా వచ్చాడు: "భయపడతావేమోనమ్మా అవతలకు వెళ్దాం పద!"

"ఫరవాలేదండీ బాబాయిగారూ - నన్ను ఇక్కడ వుండనివ్వండి!"

ఎవరో మొగమనిషి జా. . ఎదురుగ్గా కూర్చున్నాడు. చిన్న గిన్నెతో నీళ్ళు తీసుకొని తలమీద చల్లాడు.

జానకి మాట్లాడలేదు. తనలో జీవంలేనట్లుగా బలహీనంగా కూర్చున్నది. కాత్యాయిని అక్కడ జరుగుతున్నదేమిటో అర్థంకానట్లుగా ఒక్క క్షణం కళ్ళు చికిలించి చూచింది. ఆపైన ఓ మెరుపులా అతడి చేతిలో మెరిసిన కత్తిని చూస్తునే ఓ పులిలా ముందుకు దూకింది. "ఏమిటది? ఏం చేస్తున్నావ్?" అన్నది పిడుగులు కురిపిస్తున్నట్లుగా.

అతడు ఉలిక్కిపడి తలెత్తాడు

చెట్టును ఆనుకు నుంచున్న ముసలాయన ముందుకు పరుగెత్తుకు వచ్చాడు! "నేను చెప్పాను గదమ్మా - నీవు భయపడతావని - వెళ్దాం పదమ్మా! అవతలకు వెళ్దాం పద - ఇక్కడ ప్రత్యేకంగా జరుగుతున్నదేమీలేదు - ఇది మామూలే - వంశపారంపర్యంగా వస్తున్న ఆచారమే - ఈనాడు పుట్టింది గాదిది - ఈ గడ్డమీద అనాదిగా జరుగుతున్నదే!"

"బాబాయిగారూ!" కర్కశంగా సింహం గర్జిస్తున్నట్లుగా అరిచింది.

"అవునమ్మా! కాత్యాయిని తల్లీ - అది నిజం. జానకి అత్తగారిని చూచావు గదా - ఆ కుటుంబంలో అలా జరిగి తీరాలి - కాకపోతే ఆ వంశం సర్వనాశనమయిపోతుందమ్మా!"

"ఛస్! పెద్దవారు మాట్లాడవల్సిన మాటలేనా ఇవి - ఇరవైమూడు ఏళ్ళు గూడా నిండని దానికి మొగుడు చచ్చాడని జుట్టు తీయించి సమాధిచేస్తారా? - ఇదేనా మీ పెద్దరికం? ఇదేనా మీ నిర్వాకం? ఇదేనా మీరు చేయాల్సిన పని?" కళ్ళమ్మట ఆ చీకట్లోనే నిప్పులు కురిపిస్తూ వగరుస్తున్నది.

ఆ చెరువు గట్టున అంతటి చల్లటి వాతావరణమూ ఒక్కసారి వేడెక్కినట్లే అనిపించగా చెట్లు గుబుర్లను అల్లల్లాడిస్తూ పక్షులన్నీ ఒక్కసారి పైకి ఎగిరిపోయినయి.

"తప్పమ్మా కాత్యాయినీ! అడ్డు చెప్పకు - జానకి నా కూతురులాంటిది - ఆ అమ్మాయిని మరొకరు వేలెత్తి చూపటం నేను సహించలేను - ఇవతలకు రాతల్లీ! లేకపోతే నలుగురూ నవ్విపోతారు!"

"నలుగురూ నవ్వేపి - ఏడ్వనీ - మరెవ్వరికోసరమో జానకి బ్రతకదు - ఇలా జరగటానికి మాత్రం పీల్లేదు - మీ శాస్త్రులు తగలెయ్యండి - మీ వంశాల్ని కట్టకట్టి గంగలో దింపండి. అంతేగాని నా గొంతులో ప్రాణం వుండగా ఇలా జరగనివ్వను—— నాకు తెలుసు బాబాయిగారూ! ఇలాంటి ఘోరమేదో జరుగుతుందనే అర్ధరాత్రివూట పడివచ్చింది!"

అందరూ చెక్కిన బొమ్మల్లాగానే నిలబడిపోయివున్నారు.

ముసలాయన ఇంక మంచిగా పోతే లాభంలేదన్నట్లుగా ముందుకు వచ్చి కాస్త కంఠం హెచ్చింది, "కాత్యాయినీ! ఇది మా కుటుంబ వ్యవహారం—— ఇందులో ఇతరుల జోక్యాన్ని నేను సహించలేను - సహించను - నేనసలే మంచి వాడినికాదు - తరువాత ఏమనుకొని, పశ్చాత్తాపడి ఏమి లాభంలేదు - దీనికి అడ్డు వచ్చావా నీవు వలితం అనుభవిస్తావ్ - అడ్డులే - ఇది జరిగి తీరవల్సిందే ఏయ్! నీ పని నీవు కానిచ్చేసేయ్!"

కాత్యాయిని త్రాచులా బుసలుకొడుతూ మరో అడుగు ముందుకు వేసింది "ఒసేయ్ జానకీ! లేవే - లే అక్కడనుంచి - చేయించుకున్న భాగోతం చాలు గాని లే - చచ్చిన పీనుగలా అలా పడివుండకపోతే కాస్త కంఠం పెద్దదిచేసి కేకలన్నా వేసి నలుగుర్నీ పోగుచేయలేవుటే - ఎవడ్రా అక్కడ - దాని వంటిమీద చేయి వేశావా పళ్ళురాలగొడతాను - పోలీసుల్ని పిలిపించి బేడీలు వేయిస్తాను జాగ్రత్త -ఎవ్వరయినా సరే నోరెత్తారో మర్యాద దక్కదు- లేవే నిద్రమొఖమా లే!" కాత్యాయిని ముడుచుకు కూచున్న జానకిని ఒక్క లాగు లాగి పైకి బరబరా ఓభూతంలాంటి ఆ భయంకరమైన చెట్టు క్రిందనుంచి బయటకు లాక్కొచ్చింది. చెరువుకట్ట మీదనుంచి కోనేటి పక్క పల్లంలోకి యీడ్చుకొచ్చింది.

అపర కాళికలా నృత్యంచేస్తున్నట్లున్న కాత్యాయినిని చూస్తూనే భయంతో చలనరహితంగా బిగుసుకుపోయారు ఎవరికివారు. ముసలాయిన మాత్రం కల్లు త్రాగిన కోతిలా గంతులేస్తూనే వున్నాడు.

గట్టు దిగిన కాత్యాయినికి ఎదురుగ్గా ఓ రిక్షా వచ్చి ఆగింది.

అందులోనుంచి పైనుంచి దిగిన దేవతలా రాఘవులమ్మ దిగింది!

* * *

మధ్యాహ్నం పన్నెండు గంటలయ్యేటప్పటికల్లా ఫెళఫెళ మంటూ కాత్యాయినికి జర్వమొచ్చింది. ఉరుములూ మెరుపులూ లేని వానలా వచ్చి కలవర పెట్టేసింది. నూటయిదు దాటిపోయింది.

అటు జానకిని చూసేటందుకు వస్తున్న జనం వస్తూనే వున్నారు. లోపల కర్మ కాలూకు తతంగం – ఇంటిలోని వ్యక్తులనందరినీ ముంచెత్తుతోన్నట్లుగా పొగలు కక్కుతూ జరుగుతోంది.

ముసలాయినే కాత్యాయిని భర్తదగ్గరజేరి, "నేను చెప్పాను నాయినా – కాత్యాయిని తల్లీ ఇది నీకు తగదమ్మా అని – పెద్దవాళ్ళు, వయస్సు మళ్ళిన వాళ్ళు చేయవలసిన పనులమ్మా – అటు పక్కకు అసలు రాగూడదూ అంటే విన్నదా. ఊఁహూఁ – పిల్ల చేష్టలు అంటే అవే – అంతకు మించి చెబితే అర్థం చేసుకునే రకం గాదు – ఏం చేద్దామో చెప్పు నాయినా – నీవేం గాభరా పడబోకు – ఇదీ ఊరే – ఇక్కడా మనుష్యులున్నారు – ఆసుపత్రికి తీసుకు వెళ్దామా మరి!" అన్నాడు.

కాత్యాయినిని బలవంతాన రిక్షాలో ఎక్కించుకొని ఆసుపత్రికి తీసుకు వెళ్తుంటే జానకి ఏడ్చింది "నేనెంత పాపిష్టిదాన్నే – నిన్ను ఎంతగా ఇబ్బంది పెడుతున్నానే!" అంటూ.

పిండాలు ఎప్పుడు వేస్తారా, ఎప్పుడు తిందామా అన్నట్లుగా కాకులు ఇంటి మీద కావు కావు మంటున్నాయి. గదిలోకి జానకిని తొంగిచూచేందుకు వంగిన మనుష్యులకు – ముడుచుకొని చాకలి తీసుకు వెళ్ళేటందుకు కట్టకట్టి పడేసి నట్లున్న మూటలావున్న జానకి – పక్కన పెట్టిన నూనె దీపం వెలుగులో – పాచిపట్టిన సమాధిగోడలా వున్నది. ఆమె ఏడుస్తున్న ఏడుపు చావబోతున్న జంతువు మూలుగులా వున్నది

కాత్యాయినిని ఆమె అపస్మారక స్థితిలో వుండగానే క్యాజుయాలిటీకి తీసుకు వెళ్ళి, డాక్టర్లు పరీక్షించినమీదట ఓ స్పెషల్ రూంలో జేర్చారు. ఆమె మూసిన కళ్ళు తెరవటమేలేదు. అందునా వుండి వుండి ఏవేవోమాటలు– కలవరింతలూ–

"పిచ్చిది... దడుసుకునది!" ముసలాయిన నసిగాడు.

ఆమె భర్తకూ కష్టంగానేవున్నది. అనవసరంగా మరొకరి విషయాన్ని నెత్తిన వేసుకొని గుండెలమీదకు నిప్పులు తెచ్చుకున్న భార్య అంటే జాలికంటే కోపమూ, విసుగే ఎక్కువగా కలుగుతున్నాయి

"ఏవి ఎలా జరగాలో అవి జరిగితేనే అందరికీ బాగుంటుంది... కాలానికీ, ఆచారాలకీ ఎదురు తిరుగుతే ఇలాగే జరుగుతుంటయి... వస్తాను నాయినా... అక్కడ పనులన్నీ ఒక్క నిముషం నేను లేకపోతే ఎవరో ఆపేసినట్లే ఆగి పోతయి..! మళ్ళీ సాయంత్రం వస్తాను... మరి నీ భోజనమో!"

"మీరు వెళ్ళిరండి...పరవాలేదు!"

ముసలావిడ వెళ్ళిపోయిన తరువాత బెడ్ పక్కనే స్టూలు లాక్కొని కాత్యాయినినే జాలిగా చూస్తూ కూర్చున్నాడు. పిచ్చిది! టాక్సీ తీసుకువచ్చి అర్థరాత్రి బయలుదేరేటంతవరకూ నిలవనీయలేదు మొఖంమీద చిందర వందరగా పడుతున్న జుట్టును సర్దాడు. ముఖానికి చెమటలు పడుతున్నట్లనిపించగా-జ్వరం తగ్గముఖం పడుతున్నదేమోనన్నంత ఆశగా జేబురుమాలాతో అద్దాడు... కనురెప్పలు కదిలిస్తున్నట్లుంటే కళ్ళు తెరుస్తుందేమోనని కళ్ళల్లో వత్తులు వేసుకు చూస్తూ కూర్చున్నాడు.

రాత్రి రోజును మార్చి రెండు గంటలు దాటింది

కాత్యాయిని కళ్ళు తెరిచి భర్త మొఖంలోకి చూచింది అప్పటికి శరీరంలో వేడి తగ్గనారంభించింది. అంతకు గంట క్రితం రెండు మూడుసార్లు పసరు వెళ్ళిపోయింది ఆమెకు తెలియని స్థితిలోనే.

ఒకటి రెండుసార్లు నలువైపులా చూచి, ఆనందంగా తననే చూస్తున్న భర్తతో, "ఎప్పుడు తీసుకువచ్చారు నన్ను ఇక్కడకు?" నీరసంగా అడిగింది.

"కాఫీ త్రాగుతావా?"

"వున్నయ్యా?"

పక్క రూం వాళ్ళ దగ్గర తీసుకున్న ఫ్లాస్క్‌లో కాఫీ గ్లాసులో పోసి తనూ బెడ్‌మీద కూర్చొని కాత్యాయినిని కాస్తలేసి పట్టుకొని చిన్నగా త్రాగించసాగాడు.

గదంతా నిశ్శబ్దంగా వున్నది.

"నేనేమైనా హడావుడి చేశానా?" రెండు గుటకలు మింగింతరువాత అడిగింది.

"ఉఁహూఁ... జ్వరమే ఎక్కువయింది... అందునా అక్కడ చూసేందుకు ఎవరున్నారు - ఎవరి హడావుడి వాళ్ళది!"

"నిద్ర లేక వచ్చి వుంటుంది - అంతే!"

"అలా అందరూ అనుకోవటంలేదే!" అన్నాడు కాస్త నవ్వి.

"జానక్కి గుండు చేయించనందుకు వచ్చిందంటున్నారా!" అన్నది హేళగా. "మీరూ నమ్ముతున్నారా ఆ మాటలు!"

అతడు మాట్లాడలేదు గాని కాస్త ఇబ్బందిగా భార్య ముఖంలోకి చూచాడు. తన చేతిని భర్తచేతిమీద వేసింది. . చిన్నగా నొక్కుతూ, "మీకు న్యాయంగా వున్నదంటారా అది?" అన్నది

అతడు మాట్లాడలేదు.

"చెప్పరేం ?" అన్నది – తలవంచుకు కూర్చున్న అతడిని – గడ్డంపట్టుకొని తనవైపుకు తిప్పుకుంటూ.

"తెల్లవారుతూనే మన వూరు వెళ్ళిపోదాం !"

నా ప్రశ్నకు ఇది సమాధానం కాదు !"

తెచ్చిపెట్టుకున్న నవ్వొకటి నవ్వాడు "వాళ్ళ స్వవిషయాల్లో మనం కల్పించుకొని మన నెత్తిమీదకు వాటిని తెచ్చుకోవటం ఎంతవరకు సమంజసమంటావు ?"

మనస్సు కష్టపెట్టుకున్నట్లుగా మూలిగింది. భర్త ఆసరా నుండి క్రిందకు జారుతూ దిండుమీద తలపెట్టి అటు తిరిగి పడుకున్నది.

"కోపమొచ్చిందా ?"

ముఖం భర్తవైపుకు చటుక్కున తిప్పి, "జానకి ఎవరు ? – జానకి ఎవరో తెలుసుగదా మీకు – నా స్నేహితురాలు – నా ఆత్మీయురాలు – నా మరో ప్రాణం !' అన్నది ఆవేశంగా.

భర్త ఎగిరెగిరిపడుతోన్న కాత్యాయిని గుండెలమీద చేయివేశాడు.

"ఆవేశపడబోకు !"

"ఆ గృహంలో జరిగే ప్రతిసంఘటనా దాని రక్తాన్నే పీల్చేసేవి అయినప్పుడు – చూసిన ఎవరికైనా ఆవేశం కలుగుతుంది – అలా కలగలేదూ అంటే వాళ్ళల్లో చీమూ నెత్తురు లేవన్నమాట !" మళ్ళీ ముఖం పక్కకు విసురుగా తిప్పుకున్నది.

అతడు చిన్నగా నవ్వాడు. అతడికి తెలుసు – జానకీ, కాత్యాయినీ ఎలాంటి స్నేహితులో – జానకి విషయంలో కాత్యాయిని తీసుకునే నిర్ణయాలను తనకు మార్చేశక్తి లేదనీ తెలుసు –

అతడు ప్రేమగా, జాలిగా కాత్యాయినినే చూస్తూ కూర్చున్నాడు.

కాత్యాయినికి ఇంకా కోపం తగ్గలేదు.

ఎప్పటికి తగ్గుతుందో గూడా ఊహించలేని అశక్తుడయ్యాడు !

* * *

## 9

పదమూడోరోజున ఉదయాన పదకొండుగంటలప్పుడు మొదటి పోస్టులో ఓ ఉత్తరం వచ్చింది. అది రాసింది ఆమె బావగారు, ఢిల్లీనుంచి.

"జానకి,

పదోరోజుకైనా వద్దామని నేను ప్రయత్నించిన ప్రయత్నాలన్నీ విఫలమయినయి. నేను ఎక్కడున్నా, ఏ పనిచేస్తున్నా, ఎవరితో మాట్లాడుతున్నా - నా మనస్సు నీ చుట్టూనే తిరుగుతోంది. ఆ రోజు కొన్ని గంటలుమాత్రమే చూచిన నీ విచారవదనాన్ని నేను ఎన్నడూ మరువలేను.

నీ మీద జాలి, నీ జీవితంమీద దిగులు - నీ బాబులో రాబోతున్న అంధకారపు భవిష్యత్తు - నన్ను నన్నుగా నిలవనీయటంలేదు.

ఆలోచించాను. అక్కడనుంచి వచ్చిన ప్రతిక్షణం ఆలోచిస్తూనే వున్నాను - ఆఫీసులో ఇంత హడావుడిగావున్నా నా మనస్సులో ఒక భాగం నీ చుట్టూ, నీ సమస్యలచుట్టూ పరిభ్రమిస్తూనే వున్నది. నా ఆలోచన నీకు ఆనందదాయకంగా వుంటుందనే ఆశతో ఓ నిర్ణయం గూడా తీసుకున్నాను.

నీవూ బాబూ ఇక్కడకు వచ్చేసేయండి - భయంకరమైన ఆ వంటరి బ్రతుకును, ఆ దిగుళ్ళ జీవితాన్ని అక్కడే పరిత్యజించి - కొత్త ఊపిరితో కొత్త బ్రతుకుకోసరం, ఉత్తమ భవిష్యత్తుకోసరం ఢిల్లీ వచ్చేసేయండి - నీకూ, బాబుకూ బంగారు బాటవేసుకో - అందుకు నేను బాధ్యత వహిస్తాను.

నా పిల్లల్ని, నీ పిల్లవాడిని - మన పిల్లల్లాచేసి - నా ఈ స్వంత చీకటి బంగళాలో దీపం వెలిగించు.

అదే ఆశతో - ఇప్పటికి తీరిక చిక్కగా ఈ జాబు రాస్తున్నాను.

లోకోపవాదు వస్తుందనే భయంలేదు - సుశీల ఇంకా రెండు నెలలకు పోతోందనగా నేను ఆపరేషన్ చేయించుకున్నాను.

- నీ బావగారు

చలపతి ."

ఆ కాగితాన్ని ఉండలా నలిపివేస్తూ ముఖంమీదకు చీరె చెంగను లాక్కొని వెక్కివెక్కి ఏడ్వసాగింది జానకి.

దూరంగా నీరసంగా పడుకున్న కాత్యాయిని తలెత్తి జానకి వంక చూచింది

ఆమె అంతకు గంటక్రితమే ఆసుపత్రినుండి తిరిగి యింటికి వచ్చింది. ఆమె భర్త ఆమెను సరాసరి తమ వూరికే తీసుకువెళ్దామనుకున్నాడు కాని కాత్యాయిని పడనివ్వలేదు. ఒక్కరోజువుండి పరిస్థితుల చూసి వెళ్లిపోదామని భర్తను ప్రాధేయపడింది నచ్చచెప్పింది.

కాత్యాయిని తత్వం తెలిసినవాడు గనుక కాదని మొండిపట్టుపట్టలేదు.



అందునా క్రితంరోజే నార్మల్‌కి వచ్చిందేమో - మళ్ళీ ఎక్కడ మనస్సు పాడు చేసుకొని నెత్తిమీదకు తెచ్చుకుంటుందోనని అయిష్టంగానే అంగీకరించాడు.

జానకి ఏడుపు నుచూస్తూ ఆ నీరసంలోనే మరోసారి రెట్టించింది కాత్యాయిని, "ఏమైందే ? ఎవరైనా చచ్చిపోయారా ?" అన్నది విసుగ్గా.

చేతిలోని కాగితపు ఉండను కాత్యాయిని వైపుకు విరిసింది జానకి.

కాత్యాయిని ఆ కాగితాన్ని విడదీసి, ముడతలు సరిచేసి - క్రిందా పైనా ఒక్కసారి - ఆ ఉత్తరాన్ని చదువుదామా వద్దా అన్నట్లుగా చూచింది.

అయితే కుళ్ళికుళ్ళి ఏడుస్తున్న జానకివైపుకు ఒక్క క్షణం చూచి ఇక తప్పదన్నట్లుగా ఉత్తరాన్ని చదివింది.

అది చదవటం పూర్తయ్యేటప్పటికి ఆమె ముఖం కందగడ్డలా ఎర్రబడింది. కోపంతోనూ, సిగ్గుతోనూ, అసహ్యంతోనూ కుతకుతలాడిపోతూ నలుదిక్కులా అగ్నిని విరజిమ్ముతున్నట్లుగా చూచింది

తిరిగి ఆమె శరీరం నూటయిదు జ్వరంవచ్చినట్లుగా సలసలా కాగిపోతున్నది - ఈ యింటికి సంబంధించిన అందరినీ ఒక్కగదిలో కూర్చోబెట్టి,

తబ్బాడు కిరసనాయిలుపోసి అగ్గిపుల్లగీసి వేయాలా అన్నంత ఆవేశమొచ్చింది కాత్యాయినికి

ఆ కాగితాన్ని అలాగే అసహ్యంగా చూస్తూ, ఆ ఉత్తరంమీద కసినంతా మిత్రురాలి దౌర్భాగ్యంమీద చూపిస్తున్నట్లుగా, "పోనీయ్ వెళ్ళరాదుటే - సుఖపడతావేమో !'' అన్నది.

జానకి ఏడుపు మరింత పెద్దదయింది

కాత్యాయిని లేచి కూర్చుంటూ, దూరంగావున్న అగ్గిపెట్టెను కాలితో దగ్గరకు లాక్కొని, చేతిలోకి తీసుకొని, అగ్గిపుల్లతీసి - ఉత్తరాన్ని పొడుగ్గా చుట్టచుట్టి - అగ్గిపుల్ల వెలిగించి, ఆ ఉత్తరానికి ముట్టించింది.

'రాక్షసుడా ! నీకూ త్వరలోనే ఇలాగే అగ్ని సంస్కారం జరగాలి అని శపిస్తున్నట్లుగా వున్నది కాలుతున్న ఆ కాగితాన్ని చూస్తూన్న కాత్యాయిని చూపు

* * *

సాయింత్రం అయిదుగంటలకే ఇంట్లో అందరి భోజనాలు అయినయి. ఆ రాత్రి చచ్చిన మనిషి ప్రాణంపోతుండగా లేనివాళ్ళంతా ఆ గృహంలో నిద్రించటానికి వీల్లేదు శాస్త్రరీత్యా.

వచ్చిన బంధువులంతా ఎలాగూ వెళ్ళిపోయారు. నిర్మలా, నిర్మల పిల్లలూ, కామాక్షమ్మా, ముసలాయినా నాలుగు జంపకానాలు, దుప్పట్లూ రిక్షాలోవేసుకొని దీపాలు వెలిగించకముందే ఇక అక్కడవుంటే వాళ్ళ ప్రాణాలే పోతయ్యేమో నన్నంత హడావుడిగా వెళ్ళిపోయారు రైలుపేటలో ఓ సత్రానికి.

కాత్యాయిని మటుకు తను ఎక్కడికీ రానన్నది. ఆమె భర్త నచ్చచెప్ప ప్రయత్నించినా మొండిగా ఎదురుతిరిగింది.

కాని జానకి ఊరుకోలేదు, "ఆ రాత్రి గనుక ఆ యింట్లో అందరినీ ఎగ్గొట్టించి వున్నట్లయితే నేను చచ్చినంత ఒట్టే !" అని ఏడుస్తూ ఒట్టుపెట్టుకున్నది.

"ఒంటరిగా ఈ యింట్లో, ఆ పసివాడిని యేసుకొని ఎలా వుంటావే - నీ కేమన్నా బుద్ధివున్నదా ! - దడుసుకు చస్తావే ! - గుండె పగుల్తుందే !''

'చస్తే నేను చస్తాను - నీవెందుకు బాధపడాలి - నాతో మరోమాట మాట్లాడకుండా లైటు వెలిగించేలోగా బయటకు వెళ్ళిపో !''

నిన్న సాయంత్రం ఆశీర్వచన సమయంలో జరిగిన విషయాలన్నీ మధ్యాహ్నమే పూసగుచ్చినట్లు చెప్పింది కాత్యాయినికి జానకి.

- నలుగురూ ధైర్యవచనాలు చెప్పారు - కొత్త గుడ్డల్లోవున్న పసివాడిని చూపిస్తూ వాడిని సాకి, వాడి భవిష్యత్తునూ, తన భవిష్యత్తునూ గూడా వాడి కళ్ళల్లోనే చూసుకుంటూ బ్రతకమన్నారు. వాళ్ళిద్దరి బాధ్యతా తనే పూర్తిగా తీసుకుంటానని నలుగురిలో నిర్మల ముందుగా ముందుకొచ్చింది. ఆ వెనుక గోడకు జారగిలబడివున్న ముసలాయినా తనదే నన్నాడు. తను కాదని దూరంగా పారిపోలేనన్నాడు...కా మాత్రమ్మ, మాటా పలుకూలేకుండా శిలలా కూర్చున్నది ఆయాసపడుతూ.

కాత్యాయిని హేలగా నవ్వుతూ అన్నది : "దాని బావగారే ఈ బాధ్యతను ఆయనమీద ఆనందంగా వేసుకుంటున్నప్పుడు - ఎదురుగ్గా వున్న వీళ్ళు తక్కువేమిటి ?"

జానకి ముఖాన్ని - బావగారు రాసిన ఉత్తరం అవమానపు మబ్బులా క్రమ్మివేసింది.

కాత్యాయినికి తప్పలేదు. భర్తతో రిషాఎక్కి హోటల్‌కు బయల్దేరింది.

తలుపులు ఘడియవేసుకొని లోపలికి వెళ్ళిపోతున్న జానకి - ఆ రాత్రి ఇక నిద్రపోదని - కుమిలి కుమిలి - పసివాడిని వళ్ళో జేర్చుకొని ఏడుస్తూ కూర్చుంటుందని కాత్యాయినికి తెలుసు.

రిషా ఆ చిరుచీకటివేళ పద్నాలుగో అడ్డరోడ్డులోవున్న నిర్జీవమైన రైలు బ్రిడ్జిని దాటుతుండగా అంతవరకూ మౌనంగా కూర్చున్న కాత్యాయిని - తన నీరసపు చేతుల్ని భర్తమెడచుట్టూవేసి, "దేవుడూ ! నన్ను మన్నించవూ !" అన్నది.

* * *

తెల్లవారుఝామున ఇంకా కాకులు లేవటానికే బద్ధకిస్తున్నవేళ కాత్యాయిని భర్తను తీసుకొని తిరిగి ఆ యింటికి వచ్చి తలుపు దబదబా బాదింది.

నిద్రలేని జానకి గుండెలమీదే కొడుతున్నట్టున్న చప్పుడుకు - ఎవరా అన్నట్లుగా లేచివచ్చి తలుపుతీసింది.

కాత్యాయిని లోపలికి వస్తూనే, "లే - గుడ్డలు సర్దుకో - టాక్సీ రడీగా వున్నది !" అన్నది.

"ఎక్కడికి ?"

"నోరుమూసుకొని నేను చెప్పినట్లు చేయి.. నీవు బ్రతకాలనుకుంటే ఇంతకు మించినది మరొకటి లేదు !"

గుడ్డలు తనే హడావుడిగా సర్దేసింది.

పదినిముషాలలోనే ఆ యింటికి ముప్ఫయిరూపాయిలుపెట్టి ప్రత్యేకంగా రాత్రి కొన్న తాళాన్ని కాత్యాయినే వేసేస్తూ, "ఇక ఎవరి చావు వాళ్ళను చావనీ – రెండు తాళంచెవులూ నా దగ్గరే వున్నాయి – నేను తప్ప ఎవరైనా ఈ తలుపు తెరిచారో వాళ్ళను కటకటాల వెనక్కు పంపుతాను !'' అన్నది దృఢంగా.

వెనక్కు తిరిగి ఆ తలుపువంకా, వ్రేలాడుతోన్న ఆ తాళంవంకా నిర్విణ్ణురాలై చూస్తున్న జానకిని తీసుకొని ఆ టాక్సీ ముందుకు దూకింది.

* * *

## 10

తూర్పున ఆకాశపు పరుగుళ్లనుంచి నెత్తురు విరజిమ్మబడుతున్నప్పుడు –

ఆ తలుపులను ఇప్పుడిప్పుడే ఎవ్వరూ తీయరూ అని పైన వ్రేలాడుతున్న బరువైన కొత్తతాళం వాళ్లకు ధైర్యం చెబుతుండగా –

ఊహ తెలిసీ తెలియని చిన్నపిల్లలు రోడ్డుపక్కనవున్న ఇసుక కుప్పంలో నుంచి, దోసిళ్లతో ఇసుకను తెచ్చుకొని, కాళ్ళుపెట్టి గూళ్లకట్టుకుంటున్నారు ఆ గచ్చుగడపలమీద –

గడ్డిమొక్కలు పీక్కువచ్చి ఆ గూళ్లచుట్టూ నందనోద్యానవనాలు నిర్మించుకుంటున్నారు –

అంతేగాదు –

అక్కడ వాళ్ళు పెళ్లిళ్ల చేయబోతున్నారు !






# మూడో పిచ్చివాడి కథ

మర్నాడు రాత్రి మంత్రి కుమార్తె తిరిగి ఇలా చెప్పసాగింది.

సుల్తాను తన అనుచరులతో మారి స్తాన్‌కు తిరిగి వచ్చి, మూడో యువకుడికి ఎదురుగా అందరితోపాటు కూర్చున్నాడు. వెంటనే మూడో పిచ్చివాడు తన కథను ఇలా ఆరంభించాడు :

"సుల్తాన్‌గారూ, వజీర్ గారూ, ఇంత దాకా నా అనుచరులుగా ఉన్న ప్రతిహారులారా, నా కథకూ, ముందు మీరు విన్న రెండు కథలకూ ఎలాటి పోలికా లేదు మిగిలిన ఇద్దరిలాగా నన్ను స్త్రీలు ఆకర్షించలేదు. నా కథలో ఉండే నీతి ఏమిటో మీరే నిర్ణయిస్తారు గాక !

నేను చాలా చిన్నవాణ్ణిగా ఉండగానే నా తల్లిదండ్రులు అల్లా సాయుజ్యం పొందారు. మా పొరుగున ఉండే పేదవాళ్లు నన్ను దయతో చేరదీశారు. అయితే వారికి డబ్బులేక నన్ను చదవనెయ్యలేకపోయారు అందుచేత నేను దాలీదాలని నీలం కొక్కా తొడుక్కుని వీధుల్లో పెరిగాను నేను చూడటానికి

...ంగా కనపడవాణ్ణి కానమా మరి ఎండకు కమిలిపోయే నా శరీరాన్ని చూసి కొంతరు, "అయ్యో, పాపం! ఈ కుర్రాడికి దిష్టితగలకుండా అల్లా కాపాడాలి! చంద్రబింబంలాంటి బిడ్డ!" అనేవారు. ఎప్పుడన్నా ఎవరన్నా హల్వాగాని, పీచు మిఠాయిగాని తింటూ అటుగా వస్తే దాన్ని నా చేతిలో పెట్టి, బుగ్గమీద తట్టటమో, తలమీద రుద్దటమో, నడినెత్తిమీది నా పిలక ఆడించటమో చేసేవారు అప్పుడు నానోరంతా తెరిచి మిఠాయి నోట్లో కుక్కేసుకుని, ఇచ్చినవాడికి ఆనందమూ, తోటిపిల్లలకు అసూయా కలిగేట్టు చేసేవాణ్ణి. పన్నెండేళ్లదాకా నా జీవితం అలా గడిచింది.

ఒకనాడు, నేనొక పాడుపడిన ఇంటి కప్పుమీద గుడ్లకోసం పిచ్చికగూళ్లూ కాకిగూళ్లూ వెతుకుతూండగా, ఆ ఇంటి ఆవరణలో కప్పు సరిగా లేని ఒకపాకలో ఒక మనిషి నిశ్చలంగా పడుకుని ఉండటం అస్పష్టంగా కనిపించింది. అది ఆ యింటిని ఆశ్రయించిన భూతమో, ప్రేతమో అయి ఉంటుందనుకుని, ఇంటి కప్పుమీదినుంచి కిందికి జారి, నేను పారిపోతూండగా, ఒక మధురమైన కంఠం పాకనుంచి నన్ను ఇలా పలకరించింది:

"నన్ను చూసి పారిపోతావా, బాబూ? రా, నీకు జ్ఞానం ఉపదేశిస్తాను. నేను పిశాచాన్ని కాను, మనిషినే! ఒంటరిగా ధ్యానంలో కాలం పుచ్చుకుటమంటే నాకిష్టం. రా, నాయనా! నీకు వివేకంగా బతికే మార్గం చెబుతాను."

ఆ గొంతులో ఉన్న ఏదో శక్తి నన్ను పారిపోకుండా ఆపింది. నేను గుడిసెను చేరుకుని, లోపలికి వెళ్లి ఒక మనిషిని చూశాను ఆయన వయసు ఇంత అని చెప్పటం సాధ్యంకాదు. కాని ఆయన ముఖం సూర్యుడిలా ప్రకాశిస్తున్నది

"నానుంచి జ్ఞానం పొందనున్న అనాథకు స్వాగతం. నేనే నీకు తల్లీ, తండ్రీ అవుతాను" అంటూ ఆయన నా చెయ్యి తీసుకుని, "నువ్వు నా శిష్యుడివి ఒకనాటికి నీకూ శిష్యులుంటారు." అన్నాడు

ఆయన నన్ను దీవించి, తన పక్కన కూర్చోబెట్టుకుని, అప్పటి కప్పుడే బోధన ఆరంభించాడు ఆయన బోధలు నా చపల చిత్తాన్ని అదుపులోకి తెచ్చాయి. నేను నా తోటివాళ్లతో ఆటలు మానేశాను. వృద్ధుడు నిజంగానే నాకు తల్లీ, తండ్రీ అయాడు. నేను ఆయన పట్ల అంతులేని వినయ విధేయతలు చూపేవాణ్ణి అలా అయిదేళ్లు గడిచాయి. ఆయన బోధలతో నా బుద్ధి చక్కగా వికసించింది

కాని సుక్షేత్రంలో నాటితేనేగాని

జ్ఞాన బీజం ఫలించదు అవివేకం పైపైన ఏ మాత్రం గీరినా అడుగున ఉన్న అసలు చవుడు బయటపడిపోతుంది

ఒకరోజు నా గురువుగారు నన్ను మసీదు ఆవరణలో ఆహారం ముష్టి ఎత్తుకు రమ్మని పంపాడు నేను మాకు సరిపడా ఆహారం తీసుకుని, పాడు పడిన కొంపకు తిరిగి వస్తున్నాను దారిలో కొందరు కొజ్జాలు తమ కర్ర లతో మనుషులను పక్కకుతోసి, హంస లాగా నడిచి వస్తున్న ఒక పిల్లకు దారి చేస్తున్నారు ఆమె మేలిముసుగు ధరించి ఉన్నది ఆ ముసుగులోనుంచి అస్ప ష్టంగా కనిపించే ఆమె కళ్లలో నాకు వినీలాకాశం కనపడింది "సుల్తాను కుమార్తె! సుల్తాను కుమార్తె!" అని జనం అరుస్తూ ఉండటం నాకు వినిపిం చింది

నేను నా గురువుగారిని చేరుకునే సమయానికి, అయిదేళ్లపాటు నేను విన్న బోధ-న్నీ ఇగిరిపోయి, నా మెదడులో ఒక వింత జ్వరం ప్రారంభమయింది

నా గురువుగారు నాకేసి విచారంగా చూశాడు. నేను కంట తడపెట్టు కున్నాను ఆ రాత్రి మేమిద్దరమూ ఏమీ మాట్లాడుకోలేదు. మర్నాడు ఉదయం నేను ఆయన చేతిని కళ్లకద్దుకుని, "మీ అపాత్ర శిష్యుణ్ణి క్షమించండి. నేను ఆ సుల్తాను కుమార్తెను మరొకసారి చూడాలి!" అన్నాను

"నాయనా, నువు అంతగా కోరి నట్లయితే ఆమెను మళ్లీ చూడు కాని పరిపూర్ణ జ్ఞానానికీ, ఆడంబరమైన రాజసానికీ ఎంత దూరమో నువు కాస్త ఆలోచించాలి పిచ్చి తండ్రీ, సుల్తానుల కూతుళ్ల చెంత మనశ్శాంతి సాధ్యమా? నవు శాశ్వతంగా ఆత్మశాంతిని పోగొట్టు కుంటావా? నా జ్ఞానమంతా నాతో నశించిపోవలసిందేనా? ప్రపంచంలో కల్లా మహద్భాగ్యం ఏమిటంటే పరి త్యాగం! దౌర్భాగ్యం ఏమిటంటే ప్రపంచాన్ని పొందగోరటం!" అన్నాడు నా గురువు

"రాజకుమార్తెను మరొక్కసారి చూడకపోతే నా ప్రాణాలు నిలవవు!" అన్నాను

"ఒక్క చూపుతో తృప్తిపడ తావా, నాయనా?"

"తప్పకుండా"

ఆయనకు నేనంటే అమిత వాత్సల్యం. ఆయన నా దగ్గిరికి వచ్చి, నా కళ్లకు ఏదో లేపనం రుద్దాడు వెంటనే నా శరీరంలో పైభాగం అదృశ్యమయింది, నడుమూ, కాళ్లూ తప్ప నాకింకేమీ లేనట్టున్నాయి

"త్వరగా నగరంలోకి వెళ్లి నీ కోరిక తీర్చుకో," అన్నాడాయన

నేను పెద్ద కూడలికి పరిగెత్తుకుంటూ వెళ్లాను అక్కడ జనం తోసుకులాడు తున్నారు నన్ను చూసి వాళ్లు ఆయో

మయింలా పడ్డారు ఈ వింత ఆ చెవినా, ఆ చెవినా పడి, చివరకు రాజ భవనం చేరుకున్నది రాజభవనంలో సుల్తాను కుమార్తె, ఆమె తల్లీ ఉంటు న్నారు వాళ్లు, నన్ను చూడాలని తహ తహలాడిపోతూ, కొజ్జాలను పంపి నన్ను పిలిపించారు వాళ్లు వింత చూస్తూండే నేను సౌందర్యాన్ని తనివి దీరా చూశాను కాని వాళ్లు నన్ను ప-వేసి, నేను నా గురువుగారిని చేరుకునే సమయా నికి నా మనోవేదన మరింత అయింది

నా గురువు చాపమీద శయనించి ఉన్నాడు ఆయని చెక్కిళ్లు పచ్చ బారాయి ముఖంలో బాధా లక్షణాలు కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నాయి కాని నేను వాటిని పట్టించుకునే స్థితిలోలేను

"చూశావా, నాయనా?" అని ఆయన హీనస్వరంతో అడిగాడు

"చూశాను చూడకపోతేనే బాగుం డేదేమో ననిపిస్తున్నది ఇప్పుడు ఆమె సరసన కూర్చుని ఆమెను అలాగే చూస్తూ ఉండిపోతేతప్ప నాకు మనశ్శాంతి లేదు," అన్నాను

"నా ప్రియశిష్యా, నీ ఆత్మ శాంతి గురించి నాకు భయంగా ఉన్నది, ఏకాంత వాసులకూ రాచరికానికీ పొత్తు ఎలా సాధ్యం నాయనా?" అని ఆయన నిట్టూర్చాడు

"గురుదేవా! - కం ఆమె తలను చేర్చాలి! ఆమె కంఠాన్ని నా వేళ్ళతో నిమరాలి! నేను నిశ్చయంగా చచ్చి పోతాను!" అన్నాను

"బిడ్డా! నీలో జీవచైతన్యం ఎక్కువై స్ఫురణ నశించింది నీ కోరిక తీర్చు తాను. కాని నా ఆఖరి కోరిక నెరవేర్చు ఇక్కడే నాకు గొయ్యి తవ్వి, అందులో నన్ను పూడ్చిపెట్టు దానిమీద శిలగాని మరే చిహ్నంగాని పెట్టకు!"

నన్ను తనమీదికి వంగమని, ఆయన నా కళ్ళకు మెత్తని లాటుక ఏదో పెట్టాడు "మృతశిష్యుడా నీవు ఇప్పుడు ఎవరికీ కనిపించవు ఎవరూ చూడ కుండా నీ దారిన నువ్వు పోవచ్చు నిన్ను ఆపదనుంచి కాపాడమని అల్లా ను ప్రార్థిస్తున్నాను!''

ఇలా అంటూనే ఆయనలో ప్రాణం లేకుండా పోయింది ఆ పాకలోనే ఆయనకోసం గొయ్యితవ్వి. అందులో ఆయనను పూడ్చి, వేగంగా రాజభవనం వేపు బయలుదేరాను

అదృశ్యంగా ఉండటంచేత నేను సులువుగా రాజభవనంలోకి జొరబడి, అంతఃపురంచేరి, రాజకుమార్తె మందిరం లోకి కూడా వెళ్ళగలిగాను ఆమె మోసులీ వలిపెపు కబ్బాయమాత్రం ధరించి పక్కమీద పడుకుని నిద్రపోతున్నది -దదాని నగ్నశరీరాన్ని అప్పటిదాకా చూసి ఎరగను అందుచేత గొంతెత్తి "అల్లా! -లా" అని కేక పెట్టాను



ఆమె నిద్రకళ్ళు సగం తెరిచి, గాలి కొంచెం గట్టిగా పీల్చి పక్కకు ఒత్తిగిలి, మళ్ళీ నిద్రపోయింది అదృష్టవశాన, అంతకు మించి ఏమీ జరగలేదు అంత సుకుమారమైన పిల్లకు అంత పెద్ద జఘనం ఉండటంచూసి నేను ఆశ్చర్యపోయాను నేను అదృశ్యంగా ఉన్నానన్న ధైర్యంతో మరికొంచెం దగ్గరికి వెళ్ళి వేలితో ఆమె పిరుదును నిమిరి చూశాను పట్టుపరుపులాగా నున్నగా ఉన్నది ఇంతలో నన్ను సైతాను ఆవేశించినట్లు అయిపోయి ఆమెను వేళ్ళతో గట్టిగా గిల్లాను

అంతదితో ఆమె ఆదరిపడిలేచి, నిద్ర సాంతం వదిలిపోయి, వాళ్ళ అమ్మను గొంతెత్తి కేక పెట్టి పిలిచింది ఈ కేక విని వాళ్ళమ్మ పడుతూ లేస్తూ, అనేక మంది కొజ్జాలతో సహా మరీ వచ్చింది ముసలి దాదికూడా వాళ్ళవెంట ఉన్నది. రాజకుమార్తె గిల్లినచోటు చూపిస్తూ, అల్లా తనను రక్షించాలని పదేపదే కోర సాగింది ఆమె తల్లి, దాదీ ఒకేకంఠంతో "ఏమిటది? ఏంజరిగింది?" అని అడిగారు దాది కొజ్జాలకేసి కోపంగాచూసి వాళ్ళను అవతలికి పొమ్మన్నది వాళ్ళు ఆమెను తిట్టుకుంటూ వెళ్ళిపోయారు.

ఇదంతా నేను ఎవరికీ కనబడకుండా చూస్తూనే ఉన్నాను స్త్రీలిద్దరూ మెడలు చాచి చూడటానికి ప్రయత్నిస్తుండే

ఆ పిల్ల. "నన్నిక్కడ ఎవరో గిచ్చారు!" అంటూ చూపించింది. ఆమె చెప్పినట్లు గానే ఆ ప్రదేశం ఎర్రగా కందిఉన్నది

వాళ్ళు కంగారుపడి వెనక్కు తుళ్ళి "ఈ పని చేసిందెవరే తుంటరిదానా?" అని ఆత్రంగా అడిగారు

ఆమె కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ, "నాకు తెలీదు నేను పెద్దపుచ్చకాయ తింటున్నట్టు కలకంటుండగా ఇది జరిగింది," అన్నది

అందులో ఉన్న గూడార్థానికి హడలిపోయి ముసలివాళ్లు గబగబా తెరల చాటున, పరదాల వెనుకా వెతకవెతికారు. ఎవరూ కనిపించకపోయేసరికి వాళ్ళు ఆ పిల్లను, నిన్ను నీవే గిచ్చుకోలేదు కదా?" అని అడిగారు

"చచ్చినా అలాటిపని చెయ్యను!" అన్నదామె

అప్పుడు దాది తన అభిప్రాయం ఇలా చెప్పింది

"అల్లాకు లేని శక్తులంటూలేవు! మన పిల్లను గిచ్చింది గాలిలో తిరిగే చెప్పరానివాళ్ళే ఎవడోగాని అలా కిటికీకుండా తేలుతూవచ్చి పిల్ల అందం చూచాడు మరి వాడికి గిచ్చబుద్ధి అయింది శనగపులుసూ, సీరూ కలిపి పిల్లకు పట్టీ వేసేముందు గాలిని పారదోలాలి పిశాచాలను ఒంటెలపెడ పొగ గిట్టదు"

ఆమె జాగ్రత్తగా కిటికీమూసి, "ఒక బుట్టెడు ఒంటెల పేడ పట్టుకు రండి," అని తలుపు అవతల వున్న కొజ్జాలకు కేక పెట్టింది

దాది పేడకోసం ఎదురుచూసే సమయంలో తల్లి కుమార్తెతో రహస్యంగా "ఆ చెప్పరానివాడు నిన్ను ఇంకేమీ చెయ్యలేదుకదా?" అని అడిగింది

"నాకు తెలీదు", అన్నది కూతురు సిగ్గుపడుతూ

తల్లీ, దాదీ కూడా కలిసి పిల్లను పరీక్షించారు ఉండవలిసినదంతా ఉండవలిసిన విధంగానే ఉన్నది దురాక్రమణ చిహ్నాలేవీ లేవు అయితే ముసిలి దాది ముక్కు మహా చెడ్డది, "అమ్మాయి వంటిమీద మగ పిశాచం వాసన ఉన్నది! ఆ కొజ్జా వెధవలు ఎక్కడ చచ్చారు? ఒంటెల పెంట ఎక్కడ?" అని అట్టహాసం చేసింది

మాటలోనే కొజ్జాలు తట్టలో పెట్టుకుని ఒంటెల పెంట తెచ్చారు ముసిలిది పాలగచ్చుమీద తివాసీ తొలగించి, గది మధ్యన పెంట కుమ్మరించి, దానికి నిప్పుపెట్టి, ఏవో మంత్రాలు గొణుగుతూ, గాలిలో వేలితో ఏవో గీతలు గీసింది

దిక్కుమాలిన పొగకు నా కళ్ళు మంటలెత్తి, నీళ్ళు కారసాగాయి వాటిని నా బట్టతో మాటిమాటికీ తుడుచుకోవలిసి వచ్చింది నేను దద్దమ్మను కాకపోతే నా గురువుగారి కాటుక మరి కొంత తెచ్చుకుని ఉండనా? దద్దమ్మను గనకనే నా కళ్లకాటుక తుడిచేసుకుంటు

న్నాననీ, అదృశ్యశక్తి కోల్పోతున్నా ననీ తెలుసుకోలేకపోయాను

ఉన్నట్టుండి ముగ్గురు స్త్రీలూ, "అదుగో పిశాచి ! అదుగో పిశాచి !" అని కేకలుపెడుతూ నాకేసి చూపారు వాళ్ళు కంగారుగా పిలిచేసరికి కొజ్జాలు లోపలికొచ్చి నా మీద పడిపోయారు. వాళ్ళు నా ప్రాణం తీసి ఉండేవాళ్ళే, కాని నేను పెద్ద పెట్టున, "నన్నేమైనా చేశారో నా సోదరులను పిలిచి, ఈ భవనం పీకేయించి, మీ తలలమీద కూలేటట్టు చేస్తాను !" అని అరిచాను

ఆ మాటకు వాళ్ళు భయపడి నన్నేమీ చెయ్యకుండా, పట్టుకున్నారు.

"నీ కన్ను పొడవా !" అన్నది దాది నన్ను

"నోరుమూసుకోవే, ముసలితొత్తూ ! మా వాళ్ళు నిన్ను పచ్చడి చెయ్య గల్రు !" అన్నాను

అంతటితో ఆమె ఒక్కక్షణం ఊరు కుని, "ఇది పిశాచమైతే దీన్ని చంపటం మన వశం కాదు దీన్ని శాశ్వతంగా ఖైదు చెయ్యొచ్చు !" అన్నది

ఆమె కొజ్జాలకేసి తిరిగి, "దీన్ని తీసుకుపోయి మారిస్తాన్‌లో బంధించండి ఇది తప్పించుకుపోయిందో అక్కడివాళ్ళ ప్రాణాలు దక్కవని చెప్పండి", అన్నది

మహారాజా, కొజ్జాలు నన్ను ఇక్కడికి తెచ్చి బంధించారు. ఇక్కడే నాకు తమ ప్రతీహారుల పరిచయభాగ్యం లభించింది తమరు నాకు బంధవిముక్తి కలిగిస్తారన్న ఆశతో నా కథ అంతా మనవిచేశాను

సుల్తాన్ మహమ్మద్ ఈ కథ విని, తన వజీరుకేసి తిరిగి, "నా ప్రజలకు ఎలాటి పాట్లు సంప్రాప్తమయాయో చూడండి ! ఇతను గిచ్చిన పిల్ల పాత సుల్తానుగారి కడగొట్టు కూతురు. ఇప్పుడు మనం ఈ పరిస్థితిని సరిదిద్ద వలసి ఉన్నది", అన్నాడు

ఆయన ఆ యువకుడి గొలుసులు ఊడగొట్టి, "నీ కథ చాలా వింతగా ఉన్నది, నాయనా అది విని ఆనందించినందుకు నేను ఆ పిల్లను నీ కిచ్చి వివాహం చేస్తాను నువు ఆమెను అది వరకే చూసేశావు ఆమెను పెళ్ళాడాలని నీకు కోరిక ఉంటుందను కుంటాను నిన్ను నా మూడో ప్రతీహారిగా నియమించబోతున్నానుకూడా", అన్నాడు

అయిదుగురూ మారిస్తాన్‌నుంచి రాజభవనానికి వచ్చారు. మొదటి ఇద్దరి కాపరాలూ చక్కబడినందుకూ, మూడో వాడి పెళ్ళి నిమిత్తంగానూ పెద్ద విందు ఏర్పాటయింది నలభై రాత్రులూ, నలభై పగళ్లూ ఎడతెగని ఉత్సవాలు జరిగాయి

జారజుడి వింతగాథ అలా పరిసమాప్తి అయింది

---



# ప్రతిమలు

## వి. రతన్ ప్రసాద్

స్వర్గాన్ని మరపించే డార్జిలింగ్ పట్నం చేరుకున్నాడు చలం.. ఆ పట్నం సంతరించుకున్న అందచందాల్ని కరువు తీరా చూస్తూ చిన్ననాటి మిత్రుడు కాంత మూర్తి బంగళాకు వెళ్ళాడు చలం...

దాదాపు పన్నెండేళ్ళ క్రితం, కాంత మూర్తీ చలం విజయవాడలోని ఒక పత్రికాఫీసులో ఒకరికొకరు పరిచయం అయ్యారు అప్పట్నించీ విచిత్రంగానే వారి స్నేహం అల్లుకుపోయింది వాళ్ళ



ద్దరూ ప్రాణమిత్రులే అయిపోయారు శాంతమూర్తి రచయిత...చలం ఆర్టిస్టు. శాంతమూర్తి రచనలకు చలం బొమ్మలు గీసే సందర్భాలు మరీ తరుచుగా వస్తూం డేవి ...

వాళ్ల స్నేహం వయస్సూ ఎనిమిదేళ్ల వుతున్న సమయంలో హఠాత్తుగా శాంత మూర్తి విజయవాడనుండి మాయ మయ్యాడు అతని గురించిన వివరాలూ-అతని ఉనికి తెలియని చలం ఎంతగానో వ్యాకులపడ్డాడు...ఓ రెండు నెల తరువాత శాంతమూర్తి దగ్గర్నుంచి, చలం ఉత్తరాన్ని అందుకున్నాడు.

"అనుకోని కారణాలవల్ల నీతో చెప్ప కుండా ఇలా వచ్చేశాను. కారణాలు తర్వాత వివరంగా వ్రాస్తాను నీతో చెప్పకుండా ఇలా వచ్చేసినందుకు ఏమీ అనుకోవద్దు."-

అంతే!

ఆ మూడే వాక్యాలున్నాయి వుత్త రంలో...అయితే అందులో శాంత మూర్తి తన 'అడ్రస్' ఇవ్వలేదు ఆ తర్వాత ఈ నాలుగేళ్ళలోనూ, అప్పుడూ అప్పుడూ ఉత్తరాలు ఎక్కడెక్కడి నుండో వస్తూనే వుండేవి అయితే ఆ వుత్తరాల్లో విషయాలు చాలా క్లుప్తంగా వుండేవి ఏ ఒక్క ఉత్తరంలోనూ శాంతమూర్తి తన అడ్రసు రాయక పోవటం-చలానికి కొంత చిరాకుకూడా కలిగించింది.

సరిగ్గా వారంరోజుల క్రితం శాంత మూర్తి రాసిన ఎక్స్‌ప్రెస్ ఉత్తరాన్ని

చూసుకొని, అనుకోకుండా డార్జిలింగ్‌కు బయల్దేరి రావలసివచ్చింది ఇహ ఇక్క డ్నుంచీ కథ మీకు చలం చెప్తాడు...

* * *

నన్ను చూస్తూనే శాంతమూర్తి సంతోషంతో పొంగిపోయాడు. మనసారా నన్ను కౌగలించుకున్నాడు. అతనిమీద అంతకుముందు నాకున్న కోపమంతా ఆ కౌగిలిలో కరిగిపోయింది. ఆ మధ్యాహ్నం-భోజనం కాగానే, నా కోసం ప్రత్యేకంగా కేటాయించిన గదిలో నడుం వాల్చాను

నిద్ర పట్టటంలేదు. శాంతమూర్తిని గురించిన ఆలోచనలు నన్ను చుట్టుముడుతున్నాయి స్నేహం విషయంలో శాంతమూర్తిలో అప్పటికీ ఇప్పటికీ మార్పులేదు కానీ అతని అంతరంగం మాత్రం పూర్వంలా-చలాకీగా లేదన్న అనుమానం కలుగుతోంది...

అప్పటి శాంతమూర్తి హుషారైన వాడు ఇప్పటి శాంతమూర్తి గంభీరుడు అతని పచ్చని శరీరం కొద్దిగా రంగు తగ్గి మొరటదేలింది బహుశా నేను వచ్చీ రాగానే గమనిస్తే 'షాక్' తింటానని కాబోలు తన విచిత్ర అనుభూతుల్ని కళ్ళ వెనకనే దాచుకుంటున్నాడు. ...

ఆ సాయంత్రం — 'వైట్‌హౌస్' ముందున్న గులాబీ తోటలో కుర్చీలు వేయించాడు ... అందులో కూర్చుని సిగరెట్లు వెలిగించుకుంటుండగా ... పనిమనిషి-'టీ' తీసుకొచ్చాడు...

"నీకు పెళ్లయిందా?"—టీ తాగుతూ-అడిగాడు శాంతమూర్తి...

"లే"దన్నాను

"చేసుకుందే మాత్రం ఒక్క విషయాన్ని జాగ్రత్తగా పరిశీలించు... స్త్రీ తను ప్రేమించిన వ్యక్తికోసం, అతని ప్రేమకోసం సమస్త సంపదలనూ ఎలా విడిచివేయగలదో అలాగే తను కోరుకున్న సంపదకోసం తన ప్రేమనూ, ప్రేమికుడ్నీ కూడా వదిలేయగలుగుతుంది నువ్ ఎంచుకునే అమ్మాయిలో ఈ రెండు లక్షణాల్లో ఏ లక్షణం ఎక్కువ కనిపిస్తుందో పరిశీలించు నా జీవితంలో నీకు నేను ఇవ్వగలిగిన అమూల్యమైన సలహా ఇదొక్కటే!"—అని ముగించాడు శాంతమూర్తి.

అతని మాటలకు తెల్లబోయాను నాకేమీ అర్థంకాలేదు ఇద్దరం లేచాం...

ఇల్లంతా చూపించిన తరువాత-మేడ మీద ఓ గదిలోకి తీసికెళ్ళాడు శాంతమూర్తి అది ఎప్పటినుంచో, తాళం పెట్టినట్టుంది గదినిండా దుమ్ము... చుట్టూ సాలెగూళ్ళు...గదిలోకి వచ్చిన వెలుతుర్నీ మమ్మల్నీ చూసి అంతవరకూ అందులో కాపురముంటున్న ఒకటి రెండు గబ్బిలాలు-బయటకు పారిపోయాయి.

అది చాలా విశాలమైన గది... అందులో గాలి ఎన్నాళ్ళనుంచీ ఖైదీగా

పుందోకానీ, ఓ విధమైన వాసనితో మా కెదురుగా దూసుకొచ్చింది గదిమధ్య నున్న టేబిల్ మీద-విస్కీ, బ్రాందీ, సీసాలు ఖాళీవీ, పగిలినవీ, మంచివీ, మరో మూడు గాజు గ్లాసులూ వున్నాయి. గది గోడలు మాసిపోయున్నాయి ... గోడ వారగావున్న గాజు బీరువాలలో చాలా చిత్రపటాలూ, చిన్నవీ, పెద్దవీ శిల్పాలూ, చెక్క బొమ్మలూ-పాలరాతి తాజ్ మహల్ వున్నాయి శాంతమూర్తి కళాపిపాసని నాకెప్పుడో తెలుసు

"ఇవన్నీ నువ్వే సేకరించావా శాంత మూర్తీ"-అడిగాను—వాటి నన్నింటినీ పరిశీలనగా చూస్తూ

"కాదు!"-నిర్లిప్తంగా ఎటో చూస్తూ అన్నాడు శాంతమూర్తి

"మరెవరు?"-నాలో జిజ్ఞాస

అతను జవాబు చెప్పలేదు! ..

నన్ను మరో బీరువా దగ్గరకు తీసుకుని వెళ్ళి వాటి తలుపుతీసి చూపించాడు

"ఇందులోవి మాత్రమే నేను కలెక్ట్ చేశాను"— అన్నాడు

గాజు అద్దాల వెనుక-నేనెప్పుడో అతనికి వేసిచ్చిన బొమ్మలు పొందికగా అమర్చబడ్డాయి మసకగా వున్న అద్దాన్ని చేత్తో తుడిచి చూశాను రెండవ అర చివరిభాగంలో అంటించిన ఒక కాగితం నన్ను చాలా ఆశ్చర్యపరచింది తేరిపార చూశాను. అందులో యిలా రాసివుంది...

"కళాఖండంలో జీవకళను పొదిగి ప్రాణంపోసిన మరుక్షణం అది భావ పూర్ణమైపోతుంది అలాగే కోరింది దొరికిన మరుక్షణం అదికూడా కేవలం భావపూర్ణమౌతుంది."—

ఆ దస్తూరీ మాత్రం శాంతమూర్తిది కాదని నాకు తెలుసు-ఎవరో స్త్రీ మూర్తి చేతి దస్తూరీలా వుంది ఆతృతను చంపుకోలేక-

"ఇది ఎవరు రాశారు శాంతమూర్తీ?" అని అడిగాను...

"ముందు ముందు నీకే తెలుస్తుంది" అంటూ ముందుకు నడిచాడు

శాంతమూర్తి జీవితంలో ఏదో విచిత్రమైన సంఘటన జరిగిందన్న సూచన అతని జవాబులో వినిపించింది నా కుతూహలం ఎక్కువైంది

ప్రతి వస్తువునూ పరీక్షగా చూస్తున్న నా కళ్ళకి ఏడడుగుల గాజు బీరువా-అందులో వెనక్కి తిరిగివున్న ఒక పురుషుని శిల్పం-పాలరాయిది-వుంది ఆ శిల్పం నడుం దగ్గర అడ్డంగా విరిగిన అనవాలు స్పష్టంగా కనిపిస్తోంది ...

నిశ్శబ్దంగా వచ్చి, నా వెనక నిలబడిన శాంతమూర్తి-

"ఆ మూర్తి నడుం విరిగిపోయి దాదాపు సంవత్సర మయింది చలం..."-అన్నాడు బాధగా

"మరి అది అలా వెనక్కి తిప్పి పెట్టబడిందెందుకూ? అదెందుకు అలా

విరిగిపోయింది ...అదసలు ఎవరిది?"- నా ప్రశ్నలకు సమాధానం ఇవ్వకుండా గది మూలకు తీసుకెళ్లాడు.

బిగిసిపోయిన కిటికీ రెక్కల్ని బల వంతాన తెరవగానే అందులోనుంచి దూసుకొచ్చిన వెలుతురులో—ఆ కిటికీ క్రింద ఒక చెక్కపెట్టె కనిపించింది. దానిపై నున్న దుమ్మును దులిపి, దాని తలుపు పైకి ఎత్తాడు.

అందులోకి చూడగానే నా తల తిరిగి పోయినంత పనయింది. అందులో జరీ పువ్వులున్న తెల్లనిచీర, తెల్లని పట్టు జాకెట్టూ వున్నాయి. ఎండిపోయిన ఎప్పటివో రక్తపు మరకలు వాటినిండా కనిపిస్తున్నాయి. నా కళ్ళు బైర్లు కమ్మాయి.

"శాంతమూర్తీ! నువ్ ... నువ్వు హత్యచేశావా?''-భయంతో నా మాటలు తడబడ్డాయి.. అతను నవ్వేసి నా భుజం మీద చేయి వేశాడు. "నువ్ అలా అను కుంటావని నాకు తెలుసు- కానీ నేను ఎవర్నీ హత్యచేయలేదు. ఆమె—ఆమె చచ్చిపోయింది-" అని మొహానికి చేతులు అడ్డు పెట్టుకుని వెక్కి వెక్కి ఏడవటం ప్రారంభించాడు. ఏంచేయాలో తోచలేదు నాకు. కాస్సేపటికి తనను తానే సంబాళించుకుని-

"ఆ పాలరాతి మూర్తికీ- ఈమెకూ ఆ మూర్తి నడుందగ్గర విచ్చిన్నానికీ" ఈమె మరణానికీ సంబంధం వుంది"- అంటూ వేలితో చూపిస్తూ అన్నాడు శాంతమూర్తి.

"నీ మాటలు ఒకదానికీ-మరోదానికీ సంబంధంలేదు...నా కర్థం కావటంలేదు. ఈ సస్పెన్సు భరించలేను. ఏం అఘా యిత్యం జరిగిందో చెప్పు మూర్తీ...ఇంతకీ ఆ శిల్పం ఎవరిదీ?''—ఆగలేక అడిగే శాను

"నీ కుతూహలాన్ని అర్థంచేసుకో గలను చలం!...వీటన్నింటి వెనుకా పెద్ద కథ వుంది! భోజనాలయిన తరు వాత చెప్తాను. అయినా చీకటి కథలు చీకట్లోనే చెప్పుకోవాలి! పద-" అంటూ ఆ గదిలోంచి బయటకి నడిచాడు శాంత మూర్తి. చేసేదిలేక మౌనంగా అతన్ని అనుసరించాను.

ఆ రాత్రి ...

భోజనాలయిన తర్వాత నన్ను తన 'బెడ్‌రూం'లోకి తీసుకెళ్లాడు. ఆ గదిని మాత్రం సాయంత్రం ఇల్లంతా చూపించి నప్పుడు, నాకు చూపించలేదు.

అక్కడ ఒక వైపున గోడకి వెల్వెట్ డ్రాప్-కొమ్మిరదకుగులవి వ్రేలాడుతోంది దానిముందు ఒక చిన్న వేదిక ఆ వేదిక మీద ఆరడుగుల పేటిక ఒకటి నిలు వుగా, అమర్చబడివుంది. ఆ పేటిక తెల్లని పాలనురుగులాంటి వెల్వెట్ బట్టతో కప్పబడివుంది. దానిపైన ఉదయం ఉంచబడినవి కాబోలు-గులా బీలు—వాడిపోతూవున్నాయి.

ఇద్దరం ఆ పేటిక దగ్గరకు నడిచాం.

దానిమీదనున్న పువ్వుల్నీ—ఆ తెల్లని బట్టనీ తొలగించాడు ఆశ్చర్య పోయాను చక్కగా పాలిష్ చేయబడిన నున్నని చెక్క పెట్టె అది. మరీ ఆశ్చర్య కరమైన విషయమేమిటంటే అది అన్ని ప్రక్కలా పూర్తిగా చెక్కతో మూసి వేయబడివుంది కానీ ముందువైపున మాత్రం, పై భాగంలో ఆరంగుళాల పొడుగూ మూడంగుళాల వెడల్పు గల దీర్ఘచతురస్రాకారపు ఖాళీప్రదేశం వదిలివేయబడివుంది

అందులోకి చూసిన నేను నా కళ్ళని త్రిప్పుకోలేకపోయాను గదిలో వెలుగు తున్న బల్బు తాలూకు ఉజ్వలమైన కాంతి ఆ కంతలో పడుతోంది

ఆ కంత వెనుకగా, చాలా అంద మైన, ఆకర్షణీయమైన రెండుకళ్లు - నా కళ్లల్లోకి చూస్తున్నాయి నా శరీరం జలదరించింది ఆ సువిశాల మైన కళ్లు ఏ అప్సరసవో అనిపించింది అవి నిశ్చయంగా ఎవరో స్త్రీమూర్తివి-పాలరాతితో చెక్కబడిన స్త్రీమూర్తి యొక్క విశాలం వినీల సుందర నయనాలవి!

"శాంతమూర్తీ! ఈ పేటికకి తలుపు ఎటువైపుంది? ఈ శిల్పాన్ని చూడాలి!'' — ఆవేశంగా అడిగాను

"చూద్దువుగాని! కానీ అంతకు ముందు నేను చెప్పబోయే కథంతా వినాలి!" - అంటూ వెనుతిరిగాడు శాంతమూర్తి నిస్సహాయంగా అతన్ని అనుసరిస్తూ-

"పోనీ ఆ ప్రతిమ ఎవరో అదైనా చెప్పు"-అంటూ నీరసంగా అడిగాను...

దానికి జవాబుగా-

"ఆమె ప్రతిమే! ఆమె పేరు నిజంగానే ప్రతిమ! నువ్ చూసిన ప్రతిమ కథ వినాలని నువ్వెంతగా ఆరాటపడుతున్నావో, ప్రియమిత్రునితో అదంతా చెప్పుకొని, మనసులోని బరువును దించుకోవాలని నేనూ అంతగా ఆరాటపడుతున్నాను - రా! . అలా నది ఒడ్డుకు పోదాం" - అంటూ నన్నా యింటికి సమీపంగావున్న నది ఒడ్డుకు తీసుకెళ్లాడు శాంతమూర్తి.

* * *

అన్నివైపులా మసక వెన్నెల పరచుకుని వుంది!

దేవదారు పైన్ వృక్షాలతో నిండి వున్న ఆ నదిఒడ్డు, మసకవెన్నెలా - నిశినీడలతో కలిసి, నైరూప్య చిత్ర ఖండంలాగా కనిపిస్తోంది.

చెట్లన్నీ తమపైన చేరిన మంచుతో-తెల్లని మేలిముసుగుల్లో మెల్లగా కదలుతున్న పెళ్లికాని పిల్లల్లా వున్నాయి...

పైనంతా మంచు! ఎదురుగా జల జల సంగీతంతో ప్రవహిస్తున్న నది!

ఆ విచిత్ర భూలోక స్వర్గ సౌందర్యా లోకనంలో మునిగివున్న నన్ను -

"రా - ఈ చెట్టుక్రింద కూర్చుందాం"- అన్న శాంతమూర్తి మాటలు ఈ లోకంలోకి తెచ్చాయి అక్కడే ప్రవాహానికి దగ్గరలో వున్న ఒక ఆపిల్ చెట్టుక్రింద కూర్చున్నాం -

"నీ స్వగ్రామంలోకానీ - విజయవాడ పట్టణంలోకానీ - డార్జిలింగ్‌లో కానీ - అమెరికాలోకానీ - చీకట్లోకానీ - వెలుతురులోకానీ - ఎక్కడైనా సరే అనురాగానికి అంకురార్పణం, వికాసం, పరిణామం ఒకే విధంగా వుంటాయి-" అన్నాడు శాంతమూర్తి హఠాత్‌గా, దగ్గరలో పడిన ఆపిల్ పండును చేతిలోకి తీసుకుంటూ...

"అందుచేతనే నీ మాటలు అనందర్భంగా వున్నా దానిలో విశేషాన్ని వినడానికి నా మనసు తొందరపడుతోంది- బహుశా నీది ఓ ప్రేమ కథేమోనని పిస్తుంది"... ఆసక్తిగా అన్నాను

"ప్రతి వ్యక్తికీ ఒక ప్రేమకథ వుండి తీరుతుంది... అలాగే నాకూ వుంది... విను మరి"-

గంభీరంగా చెప్పటం ప్రారంభించాడు శాంతమూర్తి... కుతూహలంతో వినసాగాను

"సరిగ్గా ఇవాల్టికి రెండు సంవత్సరాల క్రితం నాకు ప్రతిమతో పరిచయం అయింది... ఎక్కడో తెలుసా?- తాజ్‌మహల్ ప్రాంగణంలో! ఎలా చూపులు కలసి మనసులు కలసి మాటలు కలిసాయో - అదంతా వర్ణించి నీకు బోర్ కొట్టించను... టూకీగా చెప్తాను-

"... మా పరిచయం ప్రేమగా మారింది ఎన్నో జన్మల సంబంధం మా ప్రేమబంధంలో కనిపించింది. తిరిగి ఆగ్రానుంచి ఢిల్లీకి ఇద్దరం కలసి చేసిన ప్రయాణంలో మా ప్రణయం మరింత బలపడి - పరిణయం చేసుకుందామన్న నిశ్చయానికి మమ్మల్ని తెచ్చింది. దారిలో ఆమె కథంతా చెప్పింది... ప్రతిమకు చిన్నతనంలోనే తల్లీ తండ్రీ పోయారు అందుకని తల్లిగారి తండ్రి వద్ద పెరిగింది... ఆమె తాతగారు ఢిల్లీలో పనిచేస్తూ 'రిటైర్' అయిన తర్వాత కూడా ఢిల్లీ వదల్లేదు ఆమె చదువంతా అక్కడే అయింది... 'మళ్లీ జీవితంలో కలుస్తామో లేదో' అని వాళ్ల క్లాస్‌మేట్స్ కొంతమంది కలసి ఆగ్రా ప్రయాణం పెట్టుకున్నారు

"...అక్కడ అనుకోనివిధంగా నాతో కలవటం, మర్నాడు ఆమె తాతగారితో మాట్లాడి శాస్త్రోక్తంగా పెళ్లి చేసుకోవటం జరిగిపోయింది మనుమరాలి అదృష్టానికి పొంగిపోయారు తాతగారు. ఆయనలో ఆనందం కట్టలు త్రెంచుకుంది పిడికెడు గుండె అంత ఆనందానికి తట్టుకోలేకపోయింది శాశ్వతంగా కళ్లుమూసాడు అన్ని క్రియలూ పూర్తి చేసుకుని నేను తప్ప మరెవ్వరూ లేని ప్రతిమను తీసుకుని కాశ్మీర్ చేరు



కున్నాను మూడు నెలలు భారత దేశంలోని సుందర ప్రదేశాలన్నింటిలో హాయిగా గడిపాం...

"...చివరకు ప్రతిమ కోరికమీద ఈ డార్జిలింగ్‌లో ఒక చిన్న భవంతి లాంటిది కట్టుకుని స్థిరపడ్డాం - అదిగో అదే ఆ భవంతి... దాని పేరు ప్రతిమా నిలయం"-

అతను వేలుతో చూపిన దిక్కుకు చూశాను - అవును! ఎదురుగా చిన్న కొండ, దానిమీద పాడుబడిన చిన్న భవనం - అంతకుముందు నేను గమనించలేదు దాన్ని చూస్తూంటే నా గుండెలు జలదరించాయి రక్తం గడ్డ కట్టినట్టయింది అది పాడుబడినా ఒక విచిత్రమైన అందాన్ని విరజిమ్ముతోంది. కానీ ఆ అందం భయోత్పాతాన్ని కలిగించేదిగా వుంది అందమైన పిశాచాన్ని చూస్తే కలిగే భయం లాంటిటిదది! భుజంమీద ఏదో బరువుగా పడేసరికి భయంతో వులిక్కి పడ్డాను అది శాంతమూర్తి చెయ్యి.

శాంతమూర్తి మళ్ళీ చెప్పటం కొనసాగించాడు.

"ఒకరి అంతరంగం కరుణతో నిండివుంటే మరొకరి అంతరంగం అగ్నితో నిండివుంటుంది. పరిస్థితికి కట్టుబడి జీవించేవాడిని 'సంస్కారి'

అంటుంది సమాజం ?. కానీ సంస్కా రికి తన ఇష్టానికి కట్టుబడి జీవించే హక్కులేదు కదూ ? - నన్నందరూ సంస్కారి అన్నారు ప్రతిమ కూడా నన్ను అలాగే అంది ఇష్టానుసారం స్వేచ్ఛగా జీవించనివ్వని సంస్కారాన్ని ఆమె ద్వేషించేది ,.

"...కానీ మా కాపురంలో మేమెప్పుడూ ఏ విషయంలోనూ ఘర్షణపడ లేదు. కొన్నాళ్లు అతి మధురంగా సాగింది మా కాపురం - జీవితాన్ని నిర్లక్ష్యం చేసినట్లయితే అది అన్ని సుఖాల్నీ ఇస్తుంది - కానీ మేమిద్దరం కూడా జీవితానికే ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చాం అందుకే అది మాకు ఏ ఆనందాన్నీ సరిగా దక్కనివ్వలేదు మాలో ఎన్నో అభిప్రాయ భేదాలున్నా - అవి మా మధ్య సంఘర్షణ నేనాడూ తీసుకరాలేదు ఆమెలో నాకేనాడూ, నా పట్ల అసంతృప్తి కనిపించలేదు

" వేదాంతులు సాధారణంగా 'రమణీ హృదయ వేదన, రస హృదయ వేదన- సృష్టిలో ఈ రెండూ మిధ్యా బింబాలు' అంటారు కానీ ప్రతిమలో నాకు ఎన్నడూ అటువంటి ఆడంబరం కనిపించలేదు అయితే ప్రతిమ ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూనే వుండేది ! ఆమె సహజంగా భరాకీగా - చైతన్యమే - ఆమె' అన్నట్టుగా వుండేది . కానీ రాత్రిళ్లు మాత్రం పడుకుని చాలాసేపు ఆలోచిస్తూండేది ఆమెయొక్క ఈ ప్రవృత్తులు నాకు అర్థమయ్యేవి కావు-

" సుఖదుఃఖాలు అన్యోన్యాశ్రితాలు - ఆలోచనా - అనుభూతులలో వాటి ఉనికి వుంటుంది. అందుచేత ఆమె ఆలోచనా భంగిమ నన్నెప్పుడూ ఆశ్చర్యపరచేది ఒకసారి ప్రతిమను ఆ సంగతే అడిగితే - నవ్వి వూరుకుంది - జవాబియ్యలేదు

" భగవంతుడు అన్నీ అందుబాటులో వున్నవాటినే కోరుతాడు.. కానీ మనిషి తనకు అందుబాటు లేనివి కోరతాడు. నేనూ, నా భావి జీవితాన్ని గురించి ఎన్నో ఆశించాను 'అనాసక్తిలోనూ- నిర్వాణంలోనూ నిజమైన శాంతి దాగివుంటుంది' ఆశలు మాత్రం దుఃఖానికి హేతువులు ఆ సంగతి నాకు అప్పట్లో తెలియదు నది పుట్టిన చోటునుంచి బయలుదేరుతున్న సమయంలో - ప్రవాహవేగంలో తాను ఏ దిశగా పోతోందో - ఏ సముద్రంలో పడుతుందో ముందుగా తెలియదు నా జన్మ అంతే అయింది - ఉన్నట్టుండి ఒకనాడు "

క్షణంసేపు చెప్పటం ఆపాడు శాంతమూర్తి"

నాలో ఆతృతా కుతూహలం మిన్నంటాయి

"ఏమయింది మూర్తీ తొందరగా చెప్పు తొందరచేశాను నేను శాంతమూర్తి కళ్ల

నుంచి అశ్రువులు నిశ్శబ్దంగా జారి పడ్డాయి. అతని కంఠం వణికి మంద్ర స్థాయిలో కథని కొనసాగించింది

ఆకాశంనుండి పడే ప్రతి వర్ష బిందువూ భూమిమీద పడ్డాక ధ్వని స్తుంది కానీ కానీ అది అశ్రు బిందువైతే కురిసే ముందుగానే హృద యంలో ధ్వనిస్తుంది కానీ ఇంతకు ముందు నా గుండెల్లో ఈ అశ్రువుల ధ్వని నీకు వినబడిందా ? – లేదుకదూ? నా హృదయ ఘోష కూడా అంతే। దానికీ కారణం వుంది, విను! .

' సహజమైన, చలనంగల, సజీవ మైన నా భార్య – ప్రతిమ జీవితంలో స్వాభావికమైన ప్రకృతి పిలిచిన పిలుపు ఆమెకు ఒక సమస్యయింది ఆ సమస్య గురించి ఆలోచించీ – ఆలోచించి, చివరికి ఒక పరిష్కారాన్ని నిర్ణయించు కుంది దాని ప్రకారం ఆమె – నా అంగీకారంతో నన్ను త్యజించి నాకంటే స్థితిపరుడూ – కోటీశ్వరుడూ అయిన సారథిని వివాహమాడి అమెరికా వెళ్లి పోయింది – పరిగ్రహణం, పరిత్యాగం – ఈ రెండూ సంతోషకరమైన మానసిక దశలు . అందుచేతనే ప్రతిమ నన్ను పరిత్యజించింది . "

శాంతమూర్తి చెబుతున్నది వింటూ విస్తుపోయాను

"ఏమిటి మూర్తీ ! సారథితో వివా హానికి – భర్తవైయుండీ నువ్ అంగీ కరించావా ?... ఆమె పరిత్యాగానికి బలి అయిపోయావా ?" – నాలోని కలవర పాటును గమనించి దీర్ఘంగా నిట్టూర్చాడు శాంతమూర్తి

"అవును చలం ?... ఏం చెయ్యను! ఆమెను గాఢంగా ప్రేమించాను అంత కంటే ఎక్కువగా ఆరాధించాను. ఎప్పుడూ – ప్రతిక్షణం. ఆమె సుఖాన్నే కోరేను నాతోకంటే సారథితోనే సుఖంగా వుండగలనంది అలా ఎందు కన్నదో అడక్కుండానే – ఆమె సుఖాన్ని మాత్రమే కోరుకున్న నేను – ఆమెకు ఎదురు చెప్పలేదు ! విడాకు లిచ్చాను ప్రేమ గుడ్డిది కదూ ? ' శాంతమూర్తి బాధగా తల ఒకవైపు వాల్చి, నెమ్మదిగా చెప్పాడు

"చలం ! నా ఉద్దేశ్యం చెప్పాలంటే నిజానికి కోరిక తీర్చుకోవటంలో సుఖం లేదు కోరికను చంపుకోవటంలోనే సుఖం వుంది । ఇది నాకు అనుభవ మైంది దీన్ని 'త్యాగం' అంటూ పొగిడి వెళ్లిపోయింది ప్రతిమ ఒక కోరిక తీరడమే, మరో కోరిక జనించటానికి కారణం ; అది ఆమెకు అనుభవమైంది.

"ఏమిటి మూర్తీ ఆమె అంత ధైర్యంగా – సుఖంగా పతనం చెందిందా ?" – నాకు నిజంగా ఒళ్ళు మండిపోతోంది.

"లేదు లేదు ! అలా అనకు ? నేను భరించలేను సర్వదేవతాశీర్వాదంతో

వజ్రమయముయిపోయిన అంతర్యం కూడా ఆరాధన కలిగితే క్షుద్ర జీవాన్ని కూడా శిరస్సున ధరియిస్తుంది! కానీ ఆమె క్షుద్ర జీవికాదు నాకు పవిత్ర మూర్తి!, ఆరాధ్య దేవత! "- అతని మాటల్లో ఏదో వెలుగులాంటి తృప్తి వినిపించింది .."

'ఏమిటి? పతనంలో కూడా పవిత్రత వుందా శాంతమూర్తీ?" నా ప్రశ్నకు అతను 'వుంద'ని సమాధాన మిచ్చాడు

"నిన్నింత దుఃఖపెట్టిన ప్రతిమను నువ్వింత ఆరాధిస్తున్నావా?... ఆమెకు ఇంత విలువనిస్తున్నావా?"- ఆశ్చర్యంతో అడిగాను

"అవును! దుఃఖం చాలా విలువైనది.. అందులోనే విషాద మాధురి ఇమిడి వుంది... సాధారణంగా ఏడవటం చేత నైన వాళ్లే ఏడిపించగలరు! కానీ ఎప్పుడూ నగుమోమే ఆభరణంగా గల ప్రతిమ నాకు ఆ విలువైన ఏడుపునే మిగిల్చింది... ఇద్దరు వ్యక్తుల్ని - రెండు మనసుల్ని _ దగ్గరగా కట్టి పడేసేది ఏడుపు! ఏడుపుకు నిర్వచనం ఏడుపే చలం! .."- అంటూ నిశ్శబ్దంగా రోదించాడు... ఓదార్పు కోసం - శాంతమూర్తి భుజంమీద చెయ్యేసాను గబగబా అతను కళ్లు తుడుచుకుని వణికే గొంతుతో-

"సారీ బ్రదర్! అంతర్యానికి విషాదం ఆవరించినప్పుడు జీవితం దుర్భరం అవుతుంది... సానుభూతి పరులు విషాదాంతరంగాన్ని స్పృశించి నప్పుడు దుఃఖాన్ని వాంఛిస్తుంది మనసు "- అంటూ చిన్నగా నవ్వేడు మూర్తి ఆ చిరునవ్వు చిందించిన విషాదాన్ని మౌనంగా దిగమింగాయి నా కళ్లు.

"చూడు చలం!- నిశ్శబ్దమే భాషగా నిశ్శబ్దగీతమే మహా సంగీతంగా ఇన్నాళ్లూ బ్రతికిన ఈ మనిషి ప్రియమిత్రుని సన్నిధిలో పంచగలిగేది విషాదాన్ని - ఇన్ని బాష్పాలనూ మాత్రమే! "- శాంత మూర్తి మాటలకు నా హృదయం ద్రవించింది ఎన్నడూ చూడని ప్రతిమ మీద పరోక్షంగా ఎంతో ఆగ్రహం కలిగింది అప్రయత్నంగా నా కళ్లు నీటితో నిండిపోయాయి అది కనపడ కుండా జాగ్రత్త పడుతూ-

"ప్రతిమ ఇప్పుడు అతనితో ఆమెరికాలోనే వుందా మూర్తీ?"- మెల్లగా అడిగాను

"లేదు? మళ్లీ వచ్చేసింది!''- అతని జవాబు

''అహా! వచ్చేసిందా? ఇప్పు డెక్కడుంది మరి?"-

"ఇప్పుడెక్కడుందో తర్వాత చెప్తాను! ఆమె నన్ను విడిచి వెళ్లి పోయాక — ఏడు నెలల తర్వాత ఒక నాడు హఠాత్తుగా ప్రతిమ బెంగుళూరు




నుంచి ఉత్తరం రాసింది. . ఆ చిన్న భవనాన్ని - అదే-ప్రతిమా నిలయాన్ని తన భర్త సారథికి అమ్మమంటూ - ప్రార్థిస్తూ రాసింది ఆమెకి ఇక్కడే- ఆ భవంతిలోనే స్థిరపడాలనుందని కూడా రాసింది!"- అంటూ ఎదురుగా కనిపిస్తున్న - ఆ చీకట్లో - ప్రతిమా నిలయాన్ని చూపించాడు మళ్లీ.

"అమ్మేశావా మూర్తీ?"- అప్రయత్నంగా - నా కంఠంలో కుతూహలం ధ్వనించింది

"లేదు! బహుమతిగా ఇచ్చేశాను అందుకామె ఎంతగానో సంతోషించిందని తెలిసింది వాళ్ళిద్దరూ వచ్చి అందులో స్థిరపడ్డారు. చిలకా గోరింకల్లా వున్నారు"- శాంతమూర్తి మాటలు వింటూంటేనే నా గుండెలు పిండినట్ల యింది అతను ఎలా భరించగలిగాడో గాని!

"ఘోరం! నీ కళ్ళముందే..."

"అవును!.. ఆ యిల్లు ఆమెకిచ్చేసి ఇప్పుడు నేనుంటున్న బంగళా కొనుక్కున్నాను"-

"శాంతమూర్తీ! నాకో అనుమానం!- ఆమె - అసలు సంపదకోసమే నిన్ను విడిచి వెళ్లిందా?"-

"అవును!... నో కాదు!"-

"అదేం సమాధానం! అయినా డబ్బుకి నీకేం లోటు? నీకన్నా ధనవంతుడా ఆ సారథి?"

"అవును చలం! నేను లక్షాధికారిని మాత్రమే!. అతను కోటీశ్వరులకు కోటీశ్వరుడు!"-

"అన్యాయం మూర్తీ! నువ్వో కష్ట

మూసుకపోయిన ప్రేమ బికారివి! పిరికి వాడివి! కాదు - పిచ్చివాడివి !"- అరిచాను

"కాదు! పిరికివాడ్ని కాదు నేను! తెలిసి ఏ తప్పు చెయ్యని నేను, నా గుండెలపై ధైర్యంగా ధరించినది రత్న మాణిక్యాల హారాన్ని కాదు నా చేతిని !"-

"మూర్తి! నీ ఆత్మవంచనను నేను ఆమోదించలేను నీ కళ్ళముందే నీ భార్య మరొకడితో-"

"చలం!"- ఆవేశంగా అరిచాడు మూర్తి

"ఆమె కేవలం - నా భార్య మాత్రమే కాదు నా దేవి !"- అతని కేకతో నదీ ప్రవాహం భయపడి ఆగి పోయిందేమో ననిపించింది! నా ఆవేశానికి పశ్చాత్తాపంతో- 'సారీ' అన్నాను

అతను కరుణతో చిరునవ్వు నవ్వి మామూలు గొంతుతో ఇలా అన్నాడు.

"ఫరవాలేదులే! అనురాగం, ఆవేశం - స్నేహమనే పావురానికి రెండు రెక్కలు ఆమెను నేనెందుకు దేవతగా ఆరాధిస్తున్నానో ముందు ముందు నీకు తెలుస్తుంది - విను! - అలా ప్రతిమా నిలయానికి వెనుకగా-కొంచెం దూరంగా వున్న పెద్ద కొండమీద శిథిలమైన పాత కోట నాకు నేస్తమైంది

" ప్రతిమ నన్నొదిలి వెళ్ళి పోయిం తర్వాత ప్రతి సాయంకాలం నేను ఆ కోటవైపు షికారు వెడుతూండే వాడిని! అందులోనే శిథిలాల మధ్య తిరుగుతూంటే - నా శిథిల హృదయానికి అవి తోడు దొరికినట్టు అనిపించేది. . ఎంతో ఓదార్పు కలిగేది అక్కడ్నించి- రోజూ ఆ చిన్న భవంతిని చూస్తున్నా - ఎన్నడూ ప్రతిమవున్న ఆ ఇంట్లోకి వెళ్ళలేదు అసలు ప్రతిమ నన్ను విడిచి వెళ్ళింతర్వాత అప్పటివరకూ ఆమెను మళ్లీ కలవలేదు - మాట్లాడలేదు !"- మూర్తి క్షణంసేపు బాధగా కళ్లు మూసుకున్నాడు

అప్రయత్నంగా ఆ భవంతివైపు చూశాను భయంవేసింది, చీకటి రాజ్యమేలుతున్న - ఆ యింటి కిటికీలకి- ద్వారాలకి - ఊడిపోగా మిగిలివున్న తలుపులు గాలికి ఊగుతూ రమ్మని పిలుస్తున్నట్లనిపించింది- మసక వెన్నెల్లో ఆ భవనం కదుల్తూ - అటూ ఇటూ వూగుతూ- నా వైపుకు రాబోతూ నన్ను బెదిరిస్తున్నట్లు కనిపించింది . అది నాకు కదులుతున్న ఒక అందమైన ప్రాణం లేని దిష్టిబొమ్మలాగా కనిపించింది... నా కళ్ళ మధ్య చలి చీకటితో కలసి ఖరేల్మంది .

"చలం.. పద అలా వెడదాం . నా ప్రేమ మహల్ దగ్గరకి! దాన్ని నీకు చూపించాలి !"- అంటూ అతను లేచే సరికి నా గుండె 'గుభేల్' మంది నా పరిస్థితిని గమనించాడు కాబోలు-

"ఫర్వాలెదు ! భయం లదుల రా అందులో ఇప్పుడెవ్వరూలేరు !"- అంటూ నాకు చెయ్యి అందించాడు.

అతనితోబాటే గుండెలు చిక్కబట్టుకుని నడవక తప్పలేదు శాంత మూర్తిలోమాత్రం లేశం కూడా భయం కనిపించటంలేదు నెమ్మదిగా ఆ గుట్ట లాంటి చిన్న కొండని ఎక్కటం ప్రారంభించాం ఆ మేడ దగ్గరవుతున్న కొద్దీ నన్ను మింగటానికి వస్తున్న భూతంలా కనిపిస్తున్నది అది ! - పావు గంట నడిచి దాని ముందుకు చేరుకున్నాము .

ముందువైపు ఓపెన్‌గా వున్న పొడుగుపాటి వరండా వుంది దానికి పైన రెండవ అంతస్థుమీద 'ప్రతిమా నిలయం' అన్న అక్షరాలు అవి కూడా ఎంతో అందంగా వున్నాయి దాని లోపలంతా చీకటిగా వుంది - ఆ భవనం అంత పెద్దదీ కాదు - మరీ అంత చిన్నదీకాదు గోడలన్నీ మట్టి కొట్టుకుని మసిబారి వున్నాయి

ఆ భవనం పై అంతస్థులో ముప్పాతిక భాగం - పైకప్పు కూలిపోయింది లోపల తప్పకుండా పిశాచాలు సభ చేస్తున్నాయేమో ననిపించింది - గాలికి తలుపులు చేస్తున్న చప్పుడు నా గుండెల మీద కొడుతున్నట్లుగా వుంది ఏవో కీటకాలు చేస్తున్న శబ్దాలు భయంకరంగా వినిపిస్తున్నాయి - దిగులుగా దగ్గుమిస ఎక్కడ అంగ చూశాను. శాంతమూర్తి కనిపించలేదు... గుండెలు ఝల్లుమన్నాయి "శాంతమూర్తీ !"... భయంతో గొంతుక చీరుకపోతూండే అరిచాను.

"చలం ! - ఇక్కడే వున్నాను !"- నా వెనుకనుంచి మూర్తి గొంతు వినిపించింది - వెనక్కి తిరిగి చూశాను - అక్కడకు పదడుగుల దూరంలో ఒక రాయిమీద కూర్చొని వున్నాడు నా గుండె కుదుటపడింది అతన్ని చూడగానే - వెళ్ళి అతని ప్రక్కనే మరో రాయిమీద కూర్చున్నాను

నేనలా కూర్చుంటూండగా అతనే అన్నాడు-

''ఈ ఇంట్లో ఇప్పుడెవరూలేరు ! - ఎందుకలా భయపడ్డావ్ ?" - అని

నా భయాన్ని కప్పిపుచ్చుకుంటూ- మాట మార్చాలని అడిగాను.

"ఆమె తిరిగొచ్చి ఈ భవనంలో ఉంటున్నప్పుడయినా నిన్ను ఎప్పుడూ వాళింటికి ఆహ్వానించలేదా ? - సారధిని పరిచయం చేయలేదా ? - అని."

''లేదు ! అలా ఎన్నడూ చేయలేదు- కానీ ఈ భవనంలోకి వచ్చాక తరచుగా- వారానికి రెండు మూడు ఉత్తరాలు మాత్రం నాపేర రాసేది ఒకనాడు తన జ్ఞాపకార్థం నాకు బహుమతిగా తన పాలరాతి ప్రతిమను పంపించింది. "-

అతని మాటలు నా కాశ్చర్యాన్ని కలిగించాయి–

"అదేమిటి మూర్తీ నిన్నింకా కోరు తోందా ఆమె ?–"–

"అవును చలం ! – ఆమె నన్నెప్పుడూ కోరుకుంటూనే వుండేది అదే స్త్రీ హృదయంలోని విచిత్రం – స్త్రీ అంతర్యం తాలూకు సమగ్ర స్వరూపం మాత్రం అంత తేలికగా బయటికి కనిపించదు–"–

"మరి ఆ విగ్రహానికి – కళ్లు మాత్రమే కనబడేలా ఖాళీవుంచి మిగిలినదంతా కాయ్యతో అలా మూసివేశావెందుకని ?" – నా సందేహం విని ఒక్క క్షణం తటపటాయించి నెమ్మదిగా చెప్పాడు మూర్తి

"ప్రతిమ పరకాంత అయిపోయింది– పరపురుషుని స్పర్శను పొందిన నా భార్య శరీరాన్ని చూడగలిగే ధైర్యం లేక, ఆ కళ్లు తప్ప తక్కిన భాగాన్ని కప్పేశాను–"

"మరి కళ్లు పవిత్రంగా వున్నాయా ? "– నా ప్రశ్న నాకే విచిత్రంగా, వ్యంగ్యంగా, కర్కశంగా ధ్వనించింది

"అవును ! అవి పవిత్రమైనవే ! ఆ భౌతిక చక్షువుల్ని చూడకుండా వుండలేను ! ఎందుకంటే – అవి ఆమె మనసు తాలూకు కిటికీలు – ఆమె చూపులు మాత్రం పవిత్రమైనవి – నన్ను అత్యంత అనురాగంతో చూస్తూంటాయి ఆ కళ్లు ! అవసలు కళ్ళు కాదు చలం !– వలపుల వాకిళ్ళు ! – ఏదైనా సంగీత వాద్యాన్ని చూడగానే దానితో ఏదో చెప్పుకోవాలనీ – దానిచేత రాగాలు పలికించాలనీ తపించిపోతాడు కళాకారుడు ! – అలాగే – నాకూ – నా క్కూడా ఆ కళ్ళతో ఏదో ఆవేదన చెప్పుకోవాలనే తపన కలుగుతుంది !– కానీ అవి బదులు చెప్పవు ! – అయితే– ఆ కళ్లలో నాపట్ల కనబడే అనురాగం– ఎప్పటికైనా అవి నాతో మాట్లాడుతాయన్న ఆశా– ఈ రెండూ నన్నింకా ఈ లోకంలో వుంచాయి"–

"ఎంత అమాయకుడివి మూర్తీ నువ్ !"– మనసులోనే అనుకున్నాను నేను

"నువ్వు వేసిన చిత్రాల ప్రక్కన అంటించిన 'నోట్' చూశావుగా ! – అది ప్రతిమే రాసింది – అందులో భావం నీకు అర్థమయిందా ?"– నా కళ్లల్లోకి చూస్తూ అడిగాడు మూర్తి.

విస్తుపోతూ – "కాలేదు" అన్నాను.

"నువ్ నీ బొమ్మల ద్వారా– నాకూ ప్రతిమకి కూడా దగ్గయ్యావ్ – ప్రతిమ భావుకురాలుకూడా !– అందుకే మా యిద్దరి సంసారం ఒక కళాఖండమని వర్ణించేది – ఆ కళాఖండంలో – మన ఇద్దరి స్నేహమనే జీవకళను పొదిగి ప్రాణం పోస్తే అది కళాకారుడివైన



నీకు భావపూర్ణమైపోతుందిట— నీ బొమ్మల్ని చూసి ప్రభావితురాలై ఆమె అలా అప్రయత్నంగా రాసి పెట్టిందక్కడ. .

" ఆమె రాసింది నిజమే అయింది చలం - నువ్ వచ్చావు - నీ రాక నాలో కొంత క్రొత్త ప్రాణాన్ని పోసి జీవకళను పొదిగింది. అది ఇక నీకు భావపూర్ణం కాబోతూంది - ప్రతిమ మాట ఎప్పుడూ పొల్లుపోదు.. "—

శాంతమూర్తి మాటలు నాకేం అర్థం కాలేదు. అందుకే వాటిని అర్థంచేసుకునే ప్రయత్నాన్ని అలా వదిలిపెట్టి అతన్ని తొందరచేశాను-

"నాకు కావలసింది నీ పొగడ్త కాదు మూర్తీ - నీ కథ - టూకీగా చెప్పు !— ఈ సస్పెన్సు భరించలేకుండా వున్నాను. నీకు ప్రతిమ వుత్తరాలు ఇంకా ఎందుకు రాసేది ?'' - అంటూ ఆత్రంగా అడిగాను.

తన కథ మళ్లీ చెప్పటం ప్రారంభిం చాడు

"ప్రతిమ సారధిని పెళ్లిచేసుకున్న తర్వాత కూడా నన్నే ప్రేమించేది ఆమె నాకు రాసే వుత్తరాలలో మేమిద్దరం గడిపిన మధురక్షణాలనూ ఆనందోత్సవాలు చేసుకున్న సాయం కాలాలనూ గుర్తుచేస్తూ రాసేది మా ఇరువురి మధ్యా శారీరక సంబంధం అంతగా ఎన్నడూలేదు... అనురాగం వుంది... ఆరాధన వుంది... అంతే!"–

'షాక్' తిన్నాను

"అదేమిటీ! మరి మీరిద్దరూ పెళ్ళి ఎందుకు చేసుకున్నట్టు?"– ఉండలేక అడిగేశాను

శాంతమూర్తి నవ్వేడు ఆ నవ్వు నా అమాయకత్వాన్ని చూసి నవ్విన నవ్వులా వుంది...

"అమాయకుడా! శారీరక వాంఛల కోసమా వివాహం?... కాదు...ఇద్దరు విభిన్న సహవాసులకు – వారి సాహ చర్యాన్ని మరింత దగ్గిరచేసేందుకు కల్పించే కట్టుబాటు!... 'పతితులు'– 'పతనం అనే బిరుదులు ఇవ్వకుండా సంఘంనుంచి కాపాడుకుందుకు చేసుకునే తతంగం... మా ఇద్దరికీ అలాంటి వాంఛలులేవు. ఆమెను నేను ఎంతో పవిత్రంగా – ప్రేమతో ఆరాధించే వాడిని అలాగే ప్రతిమ కూడా నన్నెంతో గౌరవంతో అనురాగంతో పూజించేది– మాది నిర్మలమయిన అనురాగం మాత్రమే!...

"... ఒకరి సన్నిధిలో ఒకళ్ళం– ఆనందాన్ని అనుభవించేవాళ్లం ఒకరి కళ్లల్లోకి ఒకళ్ళం– అనురాగంతో చూసుకుంటూ ఈ లోకాన్నే మరచి పోయేవాళ్ళం... కానీ...

"...కానీ ఆమెకు ఒకరోజున షాపింగ్‌లో తారసపడిన సారధితో ఏర్పడిన పరిచయం మా జీవితాల రంగుల్ని మార్చేసింది ప్రతిమను విడిచి బ్రతకటం ఎంత కష్టమని నేను అను కునేవాడినో, అంత సులువుగానూ – నన్ను వదలి వెళ్ళిపోయింది... ఆమె తిరిగి ఈ భవంతిలోకి వచ్చాక ఆమె నుండి నాకొచ్చే ప్రేమలేఖలు ఉద్వేగ పూరితంగా వుండేవి...

"...ఒకసారి 'నీ ప్రేమ ఎంత స్వార్ధరహితమో– ఎంత పవిత్రమైనదో– పరీక్షించాలని సారధిని చేసుకున్నాను'– అంటూ రాసింది... అది చదవగానే నా గుండెల్లో పిడుగులు వర్షించాయి... ప్రేమకి పరీక్షా?... అందులోనూ నా ప్రేమకు– నేనెంతగానో ప్రేమించే నా ప్రతిమ పరీక్ష పెట్టిందా?–

"... ఆ వుత్తరంతో నా మనసు దెబ్బతింది ఆమె నాకు ఇంకా ఇంకా అర్థంకాకుండా పోతున్నట్లే అని పించింది. అంతేకాదు మరోసారి . ఆమెకు సారధితో పెళ్లయినాక అతనితో

గడిపిన మొదటిరాత్రి అనుభవాలను రాస్తూ- 'నేను నీతోనే మొదటిరాత్రి గడిపినట్లు ఊహించుకుంటూ - మన పవిత్ర ప్రేమకు ప్రకృతి సహజమైన పరిపూర్ణతను చేకూర్చుకొనగలిగాను శాంతమూర్తీ'- అంటూ రాసింది

"... ఆ తర్వాత రాసిన ఉత్తరాల నిండా, సారధితో గడుపుతున్నా అతని స్థానంలో నన్నూహించుకుంటూ ఎలా శారీరక తృప్తిపొందుతోందో- అనూయకంగా - ఉత్తేజకరమైన భాషలో రాసేది... నిజానికి ఆ వుత్తరాలు నన్ను క్రుంగదీసేవి!... నా సహనాన్ని పరీక్షించేవి! అందుకే నేను ఏ వుత్తరానికీ జవాబియ్యలేదు... కానీ వాటిని మళ్ళీ మళ్ళీ చదివిన నా కళ్లు అలసిపోయి మసకబారేవి... కన్నీరు అడ్డుపడితే పూర్తిగా గ్రుడ్డివైపోయేవి"

మూర్తి కథలో ఒక్కొక్క ఘట్టం నన్ను ఒక్కొక్క అయోమయ అవస్థలోకి లాగేస్తూంటే అడిగాను-

"మూర్తీ! ఆమె శారీరక సుఖం కోసమా- నిన్ను వదలి సారధిని చేసుకున్నది?... అంతే కానీ..."-

నన్ను వారిస్తూ-

"కాదు కాదు! వాంఛలతో నన్ను మలినపరచే అనురాగంకాదు ప్రతిమది... అందుకే ఆమె నన్ను ఆ దృష్టితో కోరలేదు కానీ ఆమె స్త్రీ! నిజమైన స్త్రీ!... సారధి కూడా ఉత్తముడు. అతన్ని కూడా మనసారా ప్రేమించింది... ఆ ప్రేమ వేరు... ఈ ప్రేమ వేరు... అనుభవించినవాళ్లకే అది అర్థమవుతుంది... శారీరకంగా తాను నన్నొదిలి వెళ్ళిందేకానీ- మానసికంగా నాలోనే వుంది... నాతోనే వుంది! నా అణువణువులోనూ ఆమె నిలిచిపోయింది తన ప్రతి భావనలోనూ నన్ను నిలిపింది!... ఇప్పుడు చెప్పు చలం! .. ఆమె దేవత కాదూ?... ఈ సంఘం, ఈ సమాజం, ఈ ప్రపంచం, దీన్ని హర్షించకపోవచ్చు... కానీ నేను హర్షిస్తాను... అందరి దృష్టిలోనూ నేనూ, ప్రతిమా పిచ్చివాళ్ళం...

"... కానీ నాకామె దేవత... నాకు దేవత!..."— రహస్యం చెబుతున్నట్టుగా అన్నాడు శాంతమూర్తి

నా మనసు కరిగిపోయింది అతన్ని అమాయకునిగా భావించాలో - వెర్రివాడనుకోవాలో తెలియలేదు కానీ అతనిది చాలా సున్నితమైన హృదయమని గుర్తించాను మనసారా కౌగలించుకున్నాను...

"నేను నిన్ను పూర్తిగా అర్థం చేసుకున్నాను మూర్తీ!... ప్రతిమ నిజంగా అదృష్టవంతురాలు... నీవంటి ప్రేమమూర్తి అనురాగాన్ని ఎల్లవేళలా పొందింది .. ప్రపంచం మీ అనురాగాన్ని గుర్తించకపోవచ్చు... కానీ ఆ భగవంతుడు గుర్తించకపోడు"—

అని నేను అంటూండగానే- ఆకాశం ఫెళఫెళమని ఉరిమింది ఎప్పుడు మేఘాలు క్రమ్ముకున్నాయో గానీ— హఠాత్తుగా వర్షం ప్రారంభమైంది—— గాలి ఉద్ధృతంగా వీస్తూండటంవల్ల మేఘాలు పరుగులు తీస్తున్నాయి ఆ మేఘాల పరదాల మాటున చిక్కుకున్న చంద్రబింబం తప్పించుకోవటానికి ప్రయత్నిస్తూనే వుంది!——

వర్షం ప్రారంభమైనా - గాలి విపరీతంగా వీస్తున్నా అక్కడ్నించి లేవాలనిపించలేదు! . అతని విచిత్రమైన జీవితగాధని వినాలన్న కుతూహలమే నన్నక్కడి నుంచి కదలనివ్వలేదు! .

"తర్వాత ఏం జరిగింది శాంతమూర్తి!" అనునయంగా అడిగాను.

"అలా వుత్తరాలు రాస్తూనే వుండేది ప్రతిమ ఒకనాటి రాత్రి — ఇలాగే అనుకోకుండా తుఫాను వచ్చింది నేను నా మేడమీద గదిలో-కిటికీ దగ్గర కుర్చీవేసుకుని కూర్చున్నాను ఆ కిటికీలోంచి - అలా - ఈ భవనంవైపు చూస్తూ పాత జ్ఞాపకాలను నెమరువేసుకుంటున్నాను . ఆకాశం ఉండి ఉండి గర్జిస్తోంది మెరుపు తీగలు కళ్లను చురుక్కుమనిపిస్తున్నాయి చలిగాలి చెవుల్లోకి దూసుకుంటూ వస్తోంది-

"...అంతలోనే- ఆ క్షణంలోనే- నాకు ఎదురుగా కనిపిస్తున్న 'ప్రతిమా నిలయం' పై కప్పు ముందు భాగం కదలినట్టుగా నా కళ్లకు కనిపించింది- అప్రయత్నంగా 'ప్రతిమా' అంటూ అరిచాను , నా కేక ఉరుముల ధ్వనిలో కలిసిపోయింది నా గుండెల నెవరో ముక్కలు చేసినట్లయింది...

"... బరువెక్కిన హృదయంతో, చలినీ, తుఫాన్నీ, లెఖ్ఖచేయకుండా 'ప్రతిమా ప్రతిమా' అని కేకలు పెడుతూ- పరుగులాంటి నడకతో ఇటు వచ్చాను- నేననుకున్నదే నిజమైంది!...

"...నేనిక్కడికి చేరేసరికి ఈ భవతి ముందుకప్పు ఇలాగే కూలిపోయివుంది! గబగబా లోపలకు వెళ్లాను ముందు గదిలో పడిన 'పైకప్పు' తాలూకా శిధిలాలను తొలగించటానికి సారధి తన శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు. నన్ను అతను విచిత్రంగా చూశాడు ఓసారి...

"...అతనికి నేనెవరో తెలియదు. బహుశా నా గురించిన వివరాలు ప్రతిమ అతనితో ఎప్పుడయినా చెప్పేవుండాలి! అదిరే గుండెలతో ఆ శిధిలాలను తొలగించి, ప్రక్కనే పడివున్న 'బీరువాను' నిలబెట్టాం మరుక్షణం క్రిందికి చూసి కెవ్వుమన్నాను . నా కేకతో కలసి ధ్వనించింది సారధి చేసిన విషాదకరమైన ఆర్తనాదం

"...నేలమీద ప్రతిమ తల పగిలి పడివుంది నా ప్రతిమ మరణించింది..







ఆమె ప్రక్కనే— విరిగిన విగ్రహం. . తెల్లని జరీ పూవుల చీరలో, తెల్లని పట్టు జాకెట్టులో ఎర్రని రక్తపు వెల్లువలో నిర్జీవంగా పడివుంది నా ప్రతిమ— అన్నట్టు ఆమె ప్రక్కన విరిగి పడి వున్న విగ్రహం ఎవరిదో తెలుసా ?... అప్పుడే నేనూ చూశాను అది నాదే చలం ! నాదే !

"...అంతలో సారథి నా భుజం మీద చేయివేసి, కన్నీళ్లతో చెప్పాడు- ఆమె ఎప్పుడూ తనను ఆ గదిలోకి- అంటే తన గదిలోకి రానివ్వలేదనీ- అసలు ఆ విగ్రహం ఎప్పుడు తెప్పించిందీ తనకు తెలియదనీచాలా రాత్రులు పొద్దుపోయేవరకూ ఆ గదిలోనే గడిపేదనీ చెప్పాడు

"... ప్రతిమను తలచుకుంటూ వెక్కి వెక్కి ఏడ్వటం ప్రారంభించాడు

అతన్ని ఓదార్చే శక్తి నాకు మాత్రం ఎక్కడిదీ ? నా ప్రేమదేవత- శాశ్వతంగా అనంతవాయువుల్లో కలసిపోతే నా మనసుకు మాత్రం ఓదార్పు కావద్దూ ?...

"... ఆ తరువాత, ప్రతిమ జ్ఞాపకార్థం- ఆమె ఆఖరి రోజున ధరించిన ఆ ధవళవస్త్రాన్నీ పగిలిన నా హృదయానికి ప్రతిబింబంగా అక్కడే పడి వున్న నా ప్రతిమనూ తెచ్చుకున్నాను ఎందుకూ, ఏమిటీ అని సారథి అడగలేదు "- అని ముగించి, ఇంకేమీ చెప్పవలసింది లేదన్నట్లు తన చేతుల్లో మొహం దాచుకుని రోదించసాగాడు .

"అయితే ఇంతకు ముందు నీ పాత గదిలోని అద్దాల బీరువాలో వెనక్కి తిరిగి వున్న శిల్పం నీదేనన్నమాట !" అస్పష్టంగా అడిగాను..

'ఔ'నన్నట్లు తల ఊపాడు శాంత మూర్తి.

ఇక మాట్లాడటానికి మరేమీ మాటలు అందలేదు నాకు. అప్పటికే వర్షంలో చాలావరకూ తడిసిపోయాం మసక వెన్నెల పడుతున్నా దూరాన దట్టంగా అల్లుకున్న నల్లమబ్బుల్లోంచి అప్పు డప్పుడు మెరుపులు మెరుస్తున్నాయి

ఏడ్చి ఏడ్చి కన్నీళ్ల ఇంకిపోగా నిశ్శబ్దంగా, నిర్వికారంగా కూర్చుండి పోయాడు శాంతమూర్తి

ఆ భయంకర నిశ్శబ్దాన్ని భగ్నం చెయ్యకపోతే అతని గుండెలు మరీ బరువెక్కి పోతాయేమో ననిపించింది అందుకే అతని భుజాలమీద చేతులేసి –

"మరయితే ఇప్పుడు సారధి ఎక్కడున్నాడు ? ఏమయ్యారు ?" అని అడిగాను

వెంటనే సమాధానం చెప్పలేదు మూర్తి తల వంకుచుని కళ్లు మూసు కున్నాడు కొన్ని క్షణాల తరువాత తెరచిన అతని కళ్లల్లో పేరుకున్న రక్తాన్ని ఆ మసక వెలుతురులో కూడా స్పష్టంగా చూడగలిగాను నా చూపుల నుంచి తప్పించుకుంటూ అన్నాడు శాంతమూర్తి–

"...ఆ భవనంలోంచి, నేనిలా అడుగు ఇవతల పెట్టాను అంతే ! . మరుక్షణం మరో బీభత్సం. ! అప్పుడే పడిన మరో పిడుగుపాటుకు ఈ భవంతి ఈ 'ప్రతిమా నిలయం' నాశనమయిపోయింది సారధి అదృష్ట వంతుడ అతను కూడా ప్రతిమను ఆరాధించే వుంటాడు బహుశా నా కంటే ఎక్కువగా ! అందుకే ఆమెను చేరుకునే అదృష్టం అతనికి కలిగితే ఆమె జ్ఞాపకాల్ని అనుక్షణం గుర్తుచేసు కునే దురదృష్టం 'మో అదీ అదృష్ట మేనేమో నాకు మిగిలింది " శాంత మూర్తి మాటలు ఆవేశంగా వున్నాయి.

అంతలోనే కళ్లుపొడుస్తూ ఆకాశం తళుక్కున మెరిసింది

ఆ వెలుగులో ప్రతిమానిలయం తాలూకు శిధిలావశేషాలు నా చుట్టూ కనిపించాయి.

ఆ శిధిలాలలోంచి ఏవో పిలుపులు దీనంగా వినిపించినట్టనిపించింది.. నా గుండె ఝల్లుమంది.

కెవ్వుమన్న నా కేక ఉరిమిన భయం కరమైన ఉరుము ధ్వనిలో కలసి పోయింది .



## విజయావారి సినిమాకథ

(గత సంచిక తరువాయి)

### 7. ని. మేథ్యూ సంకటం

ఇంతకీ నర్సింహం ఏమయిపోయినట్టు ?

నా గుడ్డలు పట్టుకొస్తానని వెళ్ళి మూడురోజులయింది ఐపూ మచ్చా లేడు- ఈ అమ్మాయీ, ముసలావిడ నన్ను యిక్కట్టించి కదలనిచ్చేటట్టు లేరు ఎలాగిప్పుడు ?

అసలా అమ్మాయి నన్ను వాళ్ళ గెస్ట్‌హౌసుకు తీసుకుపోయిన రోజునే నేనొక నిర్ణయానికి వచ్చేశాను శేషాద్రి గారి దగ్గర సెలవు తీసుకొని బొంబాయి పోతాను అక్కడ ఉద్యోగం దొరికే టట్టుంది ఆయన అన్నివిధాల నాకు సహాయం చేసినప్పుడు, చెప్పకుండా పారిపోడం న్యాయంకాదు ఆ రోజుని గెస్ట్‌హౌసులో మహా ఇబ్బందిలో పడి పోయాను. ఆ తోట, బంగళా నాకు అతి ఉత్సాహంగా చూపిస్తూ, అది వాళ్ళ నాన్నగారు ప్రత్యేకంగా కట్టించుకున్నా రని చెప్పింది ఎప్పుడయినా అక్కడి కొచ్చి రెస్టు తీసుకొంటుంటారట. అప్పు డప్పుడు ఆయన ఫ్రెండ్సు కూడా వస్తుంటారట మర్యాదకోసం అన్నాను, 'చాలా బాగుందండీ'- అని వెంటనే అంది-

"మీకూ నచ్చిందా ? అయితే నాన్నతో చెప్పేస్తాను, మనకిదే కావాలని."

నాకు మతిపోయింది మనకు ? అనుకున్నాను నాలో నేనే- ఆ అమ్మాయి సిగ్గుపడుతూ అంది-

"నానమ్మ అడుగుతానంది"

"ఏ విషయం ?" అన్నాను

తలవంచుకుని "మన పెళ్ళి సంగతి" అంది

నాకు మతిపోయింది-

"పెళ్ళా ! అసలు నేనెవరో, నా పుట్టు పూర్వోత్తరాలు ఏమిటో మీకే మన్నా తెలుసా ?"

"చెప్పండి వింటాను," అంది కొంటెగా.

"నేను..." క్రిష్టియన్ని అని చెప్ప బోయి చటుక్కున ధోరణి మార్చి "నిరుపేదను," అన్నాను

"ఆ సంగతి మీ పాటలోనే ఉందిగా! ఏ నాటికో ఈ గరీబు కాకపోడు నవాబు అని- ఈ పాట మిమ్మల్ని గురించి మీరు రాసుకున్నదేగా "

"అవును- కాని ఆ పాటలోనే వుంది, నేనొక నిరంతర సంచారిని అని, అదృ ష్టాన్ని వెతుక్కుంటూ ఎక్కడెక్కడికి పోతానో నాకే తెలియదు ఈవేళ ఇక్క డున్నాను, రేపెక్కడుంటానో "

"ఆ నవాబు అయ్యే అవకాశం ఇప్పుడే దొరికితే మీరింక ఎక్కడికీ వెళ్ళక్కర లేదుగా "

ఈ అమ్మాయికి యింక కచ్చితంగా చెప్పేయ్యకపోతే లాభంలేదు పాపం! అన్యాయంగా లేనిపోని ఆశలేవో పెంచు కుని తరువాత బాధపడేకంటే, ఇది ఎన్నటికీ జరగదని ముందే ఆమెకు తెలియడం మంచిది

"ఇల్లరికపు నవాబుగిరీ కోసం పెళ్ళి చేసుకునే తత్వం కాదు నాది ఇంద్ర ధనసు పల్లకీ యెక్కి అసలు నవాబుని కావాలి," అన్నాను

ఆమె దీర్ఘంగా నిట్టూర్చింది- నా కెంతో బాధనిపించింది, అన్యాయంగా ఆ అమ్మాయికి లేనిపోని ఆశలు కల్పించి, ఆఖరికి గాలిలో వొదిలేస్తున్నానా అని.

ఆ అమ్మాయి అంది, ఎంతో బరువుగ నిట్టూర్చుతూ—

"మీరలా నవాబు కావటం జరుగ తుందేమో కాని నాకు మాత్రం పెళ్ళి కాదు " అంటూ లేచివెళ్ళిపోయింది నాక జాలేసింది ఎలాగా వెళ్ళిపోదలచుకున్న వాణ్ణి ఆ అమ్మాయిని బాధపెట్టి ఎందుక వెళ్ళాలి? ఎలాగయినా ఆ అమ్మాయి దిగులు పోగొట్టాలని—

"మీకు పెళ్ళెందుకు కాదండి-అందం, ఐశ్వర్యం, చదువు, సంస్కారం అన్నీ వున్నాయి మీకు అన్నివిధాలా మీకు తగిన పెళ్ళికొడుకు మిమ్మల్ని వెతు క్కుంటూ వస్తాడు," అన్నాను

"అలా వెతుక్కుంటూ వచ్చింది మీరేనని నానమ్మ చెప్పింది "

ఈ పిచ్చినమ్మకం ఆ అమ్మాయి మనసులోంచి పదలగొట్టాలి

"అది ఆవిడ నమ్మకం కావచ్చు- ఈ లోకంలో మిమ్మల్ని పెళ్లాడ్డానికి అర్హతవున్న అదృష్టవంతులు ఎందరో ఉండొచ్చు", అన్నాను

ఆ అమ్మాయి అతి దీనంగా అంది-

"అదృష్టవంతులు ఎందరయినా వుండొచ్చు—నాకు మాత్రం ఆ అదృష్టం లేదు "

ఎలాగీ అమ్మాయితోటి ?

"ఎందుకలా నిరాశపడతారు ? కుర్రాడు నచ్చకపోతే మీరు చేసు కోరుగా !"

"చేసుకోను."

"ఇంకేం! మీకు నచ్చినవాడితోటే మీకు పెళ్లవుతుంది, నాది పూచీ", అన్నాను ధైర్యం చెప్పటానికి-

వెంటనే నా వైపు తిరిగి అంది-

"నాకు నచ్చింది మీరే."

నా గొంతులో వెలక్కాయ పడ్డట్టయింది. దేనినుంచి ఆమె మనసు తిప్పాలనుకున్నానో దానికి విరుద్ధంగా జరిగింది. సరే నేనెలాగా వెళ్లిపో దలచుకున్నాను ఇప్పుడా అమ్మాయి మనసు కష్టపెట్టటమెందుకు? నేను దూరమైపోయిన తర్వాత క్రమంగా యీ పిచ్చినించి ఆ అమ్మాయే తేరుకుంటుంది.

"సరే రాసిపెట్టివుంటే తప్పుతుందా", అన్నాను యేటూ కాకుండా.

అదే నే చేసిన పొరపాటు. ఆ అమ్మాయి ఇక ఆమెకూ నాకూ పెళ్లయి తీరుతుందన్న నమ్మకంలో పడిపోయింది. తనకేదైనా పాట నేర్పమంది నేనేదో ప్రేమగీతం నేర్పుతానుకుంది కాబోలు, ఆ అమ్మాయికి ఆ అవకాశం ఇవ్వకూడదని భక్తి పాటొకటి మొదలెట్టాను-

''ఏమని పిలువనురా-నినునే
నే విధి కొలువనురా ॥ఏమని॥
అండపిండ బ్రహ్మాండమంతటా
నిండియున్న ఓ స్వామీ-నినునే
నెక్కడ వెదకుదురా
ఏ విధి కొలువనురా''-



ఆ అమ్మాయిలో ఎంత చురుకు చొరవ వున్నాయో నాకు అప్పుడుగాని అర్థంకాలేదు. నేను వట్టి టీచరుగా ఉన్నంతకాలం, ఎంతో అణకువగా, మర్యాదగా వొదిగి ఉండేది. నన్నిప్పుడు కాబోయే భర్తగా జమకట్టేసింది కాబోలు, నన్ను లోకువచేసేసి తన యిష్టంవచ్చినట్టు భక్తిని రక్తిగా మార్చేసి పాడ్డం మొదలెట్టింది

ఏమని పిలువనురా-నిను నే
నే విధి కొలువనురా
అంగ అంగ సర్వాంగమంతటా
నిండియున్న ఓ స్వామీ-నిను నే
నెక్కడ వెదకుదురా-

అని నన్నుద్దేశించి తన్మయత్వంతో పాడ్డం మొదలెట్టింది. నాకు కోపం వచ్చింది. చర్రున లేచి బయలుదేరాను

వెళ్లిపోదామని - గబగబా వచ్చి నా చెయ్యిపట్టుకుని ఆపింది-

'ఎక్కడికి మాష్టారూ ?" అంది

''ఇంటికి ' అన్నాను కోపంగా

'ఏం ?" అంది అమాయకంగా ముఖంపెట్టి పాపం తనేమీ యెరగనట్టు.

''నేను చెప్పిందొకటి, మీరు పాడిం దొకటి "

నేనేం మార్చానండి ? మీరు అండ పిండ బ్రహ్మాండమంతటా దేవుడున్నా డన్నారు - నేనేమో అంగ అంగ సర్వాంగ మంతటా దేవుడున్నా డన్నాను",

''మీ దేవుడున్నాడేమో-మా దేవుడు లేడు", అని చటుక్కున అనేశాను ఆ కోపంలో - ఆ అమ్మాయి కొంటెగా నా వంక చూసి,

"మీ దేవుడొకటీ - మా దేవుడొక టీనా ?" అంది.

అరరె ! దొరికిపోయానన్నట్టు నాలుక కరచుకున్నాను కాస్త సర్దుకుని,

"అబ్బే అదేంలేదండి, రండి వెడదాం," అని మళ్ళీ కదిలాను ఆ అమ్మాయి అతి ఖచ్చితంగా అనేసింది-

"నేను రాను "

ఆ తర్వాత గట్టిగా డ్రైవర్ని పిలిచింది-

"వెంకటస్వామీ ! మాస్టారిని దింపేసిరా "

నేనిబ్బందిలో పడిపోయాను, ఆ అమ్మాయిని ఒక్కర్తెనూ వొదిలేసి ఎలా వెళ్ళిపోతాను ? అందులో చీకటిపడు తోంది, ఆ మాటే అన్నాను-

"మీరు పాట నేర్పితే వస్తాను," అంది బొత్తిగా చిలిపిగా

"ఆడాళ్ళకింత పట్టుదల పనికి రాదు "

"మొగాళ్ళ కుండొచ్చు," అని తిప్పి కొట్టింది

అవును మరి నేనిప్పుడు వట్టి మాస్టార్నికాదు, కాబోయే మొగుణ్ణి అనుకుంటోంది ఏదో మాటవరస కన్నానని తప్పించుకోలేనుగా యిప్పుడు

"మాటకు మాట బాగా నేర్చారు," అన్నాను

''మీతో దెబ్బలాడలేనుగా," అంది అతి తియ్యగా నవ్వుతూ-

"మీతో వాదించలేను రండి వెడదాం "

"మీరు పాట నేర్పుతానంటేనే వస్తాను" అని భీష్మించుకు కూర్చుంది. ఇంకేం జేస్తాను-

"సరే పదండి," అన్నాను చిరాగ్గా. ఇద్దరం కార్లో ఇంటికి బయలుదేరాం- ఇంటికిపోతే వాళ్ళ నాన్నగారుంటారు. ఈ పాటా గీటా తప్పుతుందనుకున్నాను, కాని ఆయన ఊరెళ్ళారట ! తిన్నగా నన్ను పైడాబామీదికి తీసుకుపోయింది. నేను పాట నేర్పక తప్పిందికాదు- అదే ధోరణి ! నేను చెప్పిన పాట తన

కిష్టం వచ్చినట్టు మార్చేసి పాడేసింది-
నేను- రంగు రంగులా పూవులలో
నీ రమ్య రూపమే చూసేరు
ఆమె- రంగు రంగులా పూవులలో
నీ రమ్య రూపమే చూసేను
నేను- గలగలపారే సెలయేరుల
నీ గానమునే వినగలిగేరు
ఆమె- గలగల పారే సెలయేరుల
నీ గానమునే వినగలిగేను.
నేను- కొమ్మ కొమ్మలో రెమ్మరెమ్మలో
ఆమె- కొలువై వున్నావట స్వామీ-
నినునే నెక్కడ వెదకుదురా
ఏమిని పిలువనురా
నేను- అంతేలేనీ ఆకసమేనీ
ఆలయమని పూజించేరు
ఆమె- అంతేలేనీ ఆకసమేనీ
ఆలయమని పూజించేను
నేను- అందాలొలికే అరవిందాలే
నీ చిరు నవ్వని యెంచేరు
ఆమె- అందాలొలికే అరవిందాలే
నీ చిరునవ్వని యెంచేను
నేను- నీవేలేనీ తావేలేదని
నిమిష నిమిషమూ తలచేరు
ఆమె- నాలో నిన్నే చూసిన నేను
ఎక్కడ వెదకుదురా
ఏ విధి కొలువనురా— నినునే
ఏమని పిలువనురా-

ఆ అమ్మాయి తన్మయత్వంలో బాబా అంతా గంతులేస్తూ, పాడుతుంటే ఎంతో చూడ ముచ్చట్టగా ఉందిగాని, నేనున్న స్థితిలో పూర్తిగా ఆనందించ లేకపోయాను. ఇది యిప్పటికే చాలా దూరం పోయిందని నా భయం శేషాద్రిగారు త్వరగా తిరిగి రావాలని మనసులో కోరుకుంటూ నేను లాడ్జికి వెళ్ళిపోయాను

మర్నాడు కూడా ఆయన జాడలేదు. నేను మామూలుగా మేడమీదకి వెళ్ళే సరికి, ఆమ్మాయి గదిలో పడుకుని వుంది నన్ను చూసి బద్ధకంగా లేచి వచ్చింది నేనసలు వచ్చింది శేషాద్రి గారు వచ్చారేమో చూద్దామని అంచేత ఆమెకు వంట్లో బాగాలేదన్న సాకుమీద వెళ్ళిపోదామని వెనక్కి తిరిగాను

"ఫరవాలేదు - ఎలాగా వచ్చారుగా, కూర్చోండి" అంటూ యిపతల కొచ్చి నా పక్కని కుర్చీలో కూర్చుంది

''నాకు వొంట్లో బాగాలేదని నానమ్మతో అంటే, నీకేమే దుక్కలా ఉన్నావు అంటుంది నా మాట ఎవ్వరూ నమ్మరండి, నేను అబద్ధాలాడతానా చెప్పండి" అని గారంగా అడిగింది

''అబ్బే ! మీరెందుకు అబద్ధాలాడ తారు ?'' అన్నాను నా గొంతులో అపనమ్మకం కాస్త ధ్వనించిందేమో-

"మీరూ నమ్మడంలేదు - కావాలంటే చూడండి," అంటూ చెయ్యి జాపింది. నా కర్థమైపోయింది ఆమె ఎత్తు

''నాకు నాడీ అదీ ఏమీ తెలీదండి,'' అన్నాను

"పోనీ ఒళ్ళు వెచ్చగా ఉందేమో చూడండి "

ఏం చేస్తాను? చచ్చినట్టు కొస వేళ్ళతో ఆ అమ్మాయి చెయ్యి పట్టుకున్నాను నాకు ఒకటే వొణుకు, ఆ అమ్మాయి నావంక కొంటెగా చూస్తోంది. నాకు వొళ్ళంతా చెమటలు పోసేశాయి వలలో చిక్కుకున్న చేపలా గిలగిల్లాడిపోయాను తొందరగా యిక్కడినుంచి బయటపడాలని నా ఆత్రం లేచి నిలబడ్డాను వొళ్ళు తూలింది ఇంకేముంది నన్ను గట్టిగా పట్టుకుందా అమ్మాయి నిజంగా నాకేదో వచ్చిందని కంగారుపడిపోయింది. నేనెన్ని చెప్పినా వినలేదు నర్సింహాన్ని, డాక్టర్ని పిలుచుకురమ్మని నౌకర్ని పంపించింది ఆ తరవాత నానమ్మగార్ని పిలిచింది - ఇద్దరూ కలిసి నన్ను మంచంమీద పడుకోబెట్టారు, బలవంతంగా నర్సింహం డాక్టర్ని తీసుకొచ్చాడు గేలంలో తగులుకున్న చేప గిలగిల కొట్టుకున్నకొద్దీ మరింత చిక్కుపడిపోయినట్టు అయిపోయింది నా పరిస్థితి పైగా నర్సింహంగాడు నన్నేదో విడిపించి అవతల పారేస్తాడనుకుంటే వాడుకూడా వాళ్ళకి తోడయ్యాడు వాడి గొడవవాడిది- ఆ గేబ్రియేల్ జలగలా తగులుకున్నాడట, పీడిచేత కాళ్ళు పట్టించుకున్నాడట—

"నీ వంకపెట్టి ఇక్కడికి పారిపోయొస్తే నన్ను అక్కడికి రమ్మంటావేమిటి?" అంటాడు వాడు.

నాకు వొళ్ళు మండిపోయింది నా కాళ్ళు పట్టమన్నాను, కాళ్ళుకాదు గొంతుక పడతానన్నాడు పైగా ఆ అమ్మాయి అంత యిష్టపడుతుంటే, నిక్షేపంలా పెళ్ళాడెయ్ అంటాడు వాడికేమన్నా బుద్ధుందా? మర్నాడు నాకు గుడ్డలు లేవనీ, వెళ్ళి తెచ్చుకుంటాననీ, లాడ్జికి బయలుదేరబోయాను నేను తెచ్చిపెడతానని వాడు బయలుదేరాడు నేను గనక లాడ్జికి పోతే తను కూడా రావాలి మళ్ళీ తిరిగి రానని వాడి భయం నిజమేకూడా - వాడు వెళ్ళాడు, ఆవేళారాలేదు శేషాద్రిగారు. నా గుండెల్లో రైళ్ళు పరుగెడుతున్నాయ్ ఎన్నాళ్ళునాకీ చెర?

గుడ్డలకోసం వెళ్ళిన నర్సింహంగాడు ఏమైపోయినట్టు? ఇప్పుడు నేనేం జేయాలి? రాత్రీ పగలూ ఆ అమ్మాయి నా పక్కనే కాపలా రెండు మూడు సార్లు ప్రయత్నంచేశాను, మెల్లగా జారిపోదామని - ఆ అమ్మాయి బొత్తిగా కోడికునుకు, చటుక్కున లేచేది అవకాశం దొరికితే నేను పానిపోతానని కనిపెట్టేసింది. నేను కళ్ళుతెరిచి చూస్తే, చాలు, వెంటనే తనూ కళ్ళుతెరిచేది. కొంటెగా నవ్వుతూ ముక్కుమీద వేలేసుకుని, 'తప్పు అల్లరి చెయ్యొద్దు. పడుకుని నిద్దరపో' అన్నట్టు సంజ్ఞ

చేసేది ఆ అమ్మాయికి యిదంతా యేదో ఆటలాగుంది. కాని పిల్లికి చెల గాటం, ఎలక్కి ప్రాణ పోకట

ఒకరాత్రి నాకు కలతనిద్ర పట్టింది, నిద్రలో కల

నల్లని ఆకాశం, అక్కడక్కడ మెరుస్తూ నక్షత్రాలు - ఆ ఆకాశంలో ఎక్కడో పైె యెత్తుని నేను, నా పక్కని రాజేశ్వరి చటుక్కున డోలు సన్నాయి వినిపించాయి చిత్రమైన ద్వారాలు వాటి మధ్యనించి పెళ్ళి కూతుర్ని తీసుకొస్తున్నారు ఆ ద్వారాలు శేషాద్రిగారి డాబాగా మారిపోయాయి డాబామీద మంటపంలో పెళ్ళికొడుకు, ఎవరోనని పరీక్షగా చూశాను

ఇంకెవరు ? నేనే ! !

నా పక్కని రాజేశ్వరి పాడ్డం మొదలుపెట్టింది-

"ఆకాశ పందిరిలో నీకు నాకు
పెళ్ళంట
అప్సరలే పేరంటాళ్ళు
దేవతలే పురోహితులంట
దీవనలు యిస్తారంట ॥ఆకాశ॥

పాటలోలాగే అప్సరసలు హారతి పళ్ళాలు పట్టుకుని మేఘాల్లోంచి దిగి వచ్చారు స్వర్గద్వారాలు తెరచుకున్నాయి. అందులోంచి దేవతలు వచ్చారు మేం ఇద్దరం పెళ్ళిపీటలమీద- దేవతలు దీవించారు రాజేశ్వరి పాడుతోంది—

తళుకుబెళుకు నక్షత్రాలు
తలంబ్రాలు తెస్తారంట
మెరుపు తీగ తోరణాలు
మెరిసి మురిసి పోయేనంట
మరపురాని వేడుకలంట ॥ఆకాశ॥
పిల్లగాలి మేళగాళ్ళు
పెళ్ళిపాట పాడేరంట
రాజహంస జంటలు చేరి
రత్నహారతిచ్చేరంట
రాసకేళి సలిపేరంట ॥ఆకాశ॥

అక్కడ పెళ్ళిపీటల మీదనించి మేం యిద్దరం లేచాం - ఇక్కడ ఆకాశంలో నన్ను పట్టుకుని, గిరగిరా తిప్పుతూ పాడుతోంది రాజేశ్వరి ఆ తర్వాత దృశ్యాలు నాకు నిజంగా మతి పోగొట్టేశాయి-

వన్నెచిన్నెలా ఇంద్రధనసుపై
వెన్నెల పానుపు వేసేనంట
మబ్బులు తలుపులు మూసేనంట
మగువలు తొంగి చూసేరంట
మనలను గేలి చేసేరంట-

ఆకాశంలో మబ్బుల మధ్య పడక గది, అందులో నేనూ, రాజేశ్వరి. మబ్బుల తలుపులు మూతపడ్డాయి. రాజేశ్వరి నా మీదపడి నన్ను వుక్కిరిబిక్కిరి చేస్తోంది మబ్బుల చాటునుంచి మగువలు లేచారు, మమ్మల్ని చూసి కిలకిలా నవ్వారు

నాకు చటుక్కున మెలకువ వచ్చింది. వొళ్ళంతా చెమటలు పక్కని కుర్చీలో

రాజేశ్వరి గాఢనిద్రలో వుంది నా గుండెలు దడదడా కొట్టుకున్నాయి, మెల్లగా లేచాను ఈసారి ఆమె కళ్ళు తెరవలేదు చల్లగా అవతలికి జారి పోయాను మేడమెట్లు దిగుతుంటే చెప్పులు చప్పుడుచేశాయి అవి విప్పి చేత్తోపట్టుకుని కిందకి దిగాను ఒక్క అడుగు వేశానో లేదో - వెనకనించి నా చొక్కా పట్టుకుంది కుక్క ! ఎంతకీ వదల్దు - మెల్లగా చొక్కా విప్పేసి జారిపోదామని చూశాను అది వదిత్తేగా దానితో ఆడుకుంటున్నాననుకుందో ఏమో, నేను పాకితే పాకటం, ఆగితే ఆగడం - ఎలాగో గుమ్మందాకా చేరాను అప్పుడూ నన్ను కుక్క వదిలి పెట్టలేదు చివరికి ఏం తోచక నా చెప్పు విసిరాను, అది తీసుకురావడానికి పరుగెత్తింది మెల్లగా తలుపు దగ్గరగా జరిగాను అది చెప్పు తీసుకొచ్చి నా కిచ్చింది మళ్ళీ విసిరాను అది తెచ్చే లోగా తలుపుతెరచుకొని బయట పడ్డాను తలుపు మూసేశాను అది ఊరికే మొరుగుతోంది రాజేశ్వరి లేచి వస్తుంది, నేనింక వెనక్కి తిరిగి చూడ కండా గబగబా లాడ్జికి వచ్చేశాను, ఒంటి చెప్పుతో

తలుపులు తెరిచివున్నాయి నా కాశ్చర్యం వేసింది లోపలికి అడుగు పెట్టాను నర్సింహం అసలు ఈ లోకంలోనే లేడు కుర్చీలో ఒక అమ్మాయి పడుకుని వుంది, వీడు ఆప్యాయంగా విసురుతూ పాడు తున్నాడు-

"సోజా రాజకుమారీ సోజా" అంటూ-

నేను తలుపు తట్టాను, పిలిచాను- వెళ్ళి గట్టిగా వీపుమీద తట్టాను, ఉలికిపడి లేచాడు

"ఏరా ! తలుపు తట్టాను, పిలిచాను, వినపడలా ?"

"తలపులన్నీ వలపుతో నిండిపోతే, తలుపూ పిలుపూ యేం వినపడతాయి," అంటూ కవిత్వం వెలగబెట్టాడు

ఇంతలో ఆ అమ్మాయి లేచింది నాకు పరిచయం చేశాడు గేబ్రియేలు గారి కూతురు రోసీఅట వీళ్ళిద్దరూ ఒకళ్ళనొకళ్ళు చూసుకోగానే ప్రేమలో పడిపోయారట గేబ్రియేలుగారు ఏమ య్యారని అడిగాను ముగ్గురూ కలిసి సినిమాకి వెళ్ళారట, రెండో ఆటకి దీపాలు ఆర్పెయ్యగానే ఆయన్ని అక్కడ వదిలేసి వీళ్ళిద్దరూ వచ్చే శారట ఆ తరవాత నన్ను రోసీకి పరిచయం చేశాడు నర్సింహం-

"రోసీ ! ఇతనే అసలు మత్తయ్య ! తన వేషం నాచేత వేయించి, నిన్ను నాకు ప్రసాదించాడు "

ఆ తరవాత,

"గేబ్రియేలు మావ మా పెళ్ళికి యెలాగూ ఒప్పుకోడు నువ్వే మా

పెళ్ళి పెద్దవి. మమ్మల్నిద్దర్నీ ఆశీర్వదించు," అంటూ ఆమెకు సంజ్ఞచేశాడు. యిద్దరూ నా కాళ్ళకు దణ్ణంపెట్టారు.

"ఏసుప్రభువు మీ యిద్దర్నీ పది కాలాలపాటు చల్లగా చూస్తాడు," అని ఆశీర్వదించాడు

"ఏసుప్రభువు నీ విషయంలో ఏమంటున్నాడు ?" అని అడిగాడు నర్సింహం

"బొంబాయి పొమ్మంటున్నాడు," అన్నాను తరవాత చెప్పాను-

"రెండు కంపెనీలనుంచి ఇంటర్వ్యూకి రమ్మని వచ్చింది. రేపు శేషాద్రిగారు రాగానే ఆయనదగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోతాను," అన్నాను

నర్సింహం అదృష్టవంతుడు చొరవ గలవాడు, హాయిగా సమయం రాగానే లోసికి తనెవరో చెప్పేశాడు ఆ అమ్మాయి ఒప్పుకుంది అతనికి యే అడ్డంకులూ లేవు నేనే బలహీనుణ్ణి. రాజేశ్వరికి నన్ను గురించి నిజం చెప్పలేకపోయాను, చెప్పలేనుకూడా, నాకన్నీ అంధాలే, నర్సింహం స్వతంత్రుడు. సరే ఏమయితేనేం, బొంబాయి వెళ్ళిపోతున్నాను, శేషాద్రిగారికి యెలాగా యిష్టం వుండదు, వాళ్ళమ్మాయిని నాకు యివ్వటానికి నేను వెళ్ళిపోతున్నానంటే నిజంగా సంతోషిస్తారు ఆ తరవాత మెల్లగా రాజేశ్వరే మనసు సమాధాన పర్చుకుంటుంది, నాకన్న అన్ని విధాలా యోగ్యుడు ఎవరో ఆ అమ్మాయికి దొరుకుతాడు

నేను వాళ్ళింట్లో అడుగుపెట్టేసరికి హాలులో యెవరూలేరు బతికానను కున్నాను - తిన్నగా మేడమీదికి వెళ్ళి పోయాను శేషాద్రిగారు వొక్కరూ కూర్చుని వున్నారు నమస్కారం చేసి, నాకిలా బొంబాయిలో ఉద్యోగం దొరికిందనీ, వెళ్ళిపోతున్నాననీ చెప్పాను. ఒక క్షణం ఆయనేమీ మాట్లాడలేదు ఆ తర్వాత అడిగారు యెందుకు వెళ్ళి పోతున్నావని, అప్పుడు చెప్పాను-

"ఇంక అమ్మాయిగారికి నేను చెప్పే చదువేంలేదండి ఊరికే మీ దగ్గర జీతం పుచ్చుకోడం నా కిష్టంలేదు మీరు యెన్నో విధాల సహాయంచేశారు నాకు - మీరు యిచ్చిన అప్పు చాలా భాగం తీర్చేశాను ఉద్యోగంలో చేరగానే మిగిలింది కూడా పంపించేస్తాను. నావల్ల యేమైనా పొరపాట్లు జరిగుంటే మన్నించండి, సెలవిప్పించండి," అని చెప్పేసి యివతలికి వచ్చేశాను ఆయన కూడా మనసులో యేదో బాధపడుతున్నట్టుగా అనిపించింది అంచేత ఆయన యేమీ అనకండానే బయట పడ్డాను నా మనసు కాస్త తేలికపడింది. నా రహస్యం బయటపెట్టవలసిన అవసరం లేకండాపోయింది.

మెట్లు దిగుతుంటే రాజేశ్వరీ నానమ్మగారూ ఎదురయ్యారు. వాళ్ళకి

కూడా చెప్పేశాను నేను బొంబాయి వెళ్లిపోతున్నానని - యిద్దరూ బిత్తర పోయారు

"ఉండరా అబ్బాయి," అని నానమ్మ గారు, రాజేశ్వరితో చరచరా పైకెళ్లారు శేషాద్రి గారితో ఆవిడ చర్చ ప్రారంభి స్తుంది అంచేత నేనక్కడ ఉండదల్చుకో లేదు గబగబా లాడ్జికి వచ్చేశాను నేను ఊళ్ళోంచి వెళ్లిపోతే అన్ని చిక్కులూ వాటంతట అవే విడిపోతాయి రాజేశ్వరి ముఖంచూస్తే నాకెంతో బాధేసింది నేను వెళ్లిపోతున్నానని చెప్పినప్పుడు ఆ అమ్మాయి ముఖాన నెత్తురు చుక్క లేదు నేనామెకెంతో ద్రోహంచేశానని పించింది కానీ యిలా వెళ్లిపోవడమే మేలు

నేను లాడ్జిలో అడుగుపెట్టేసరికి, నేను అనుకోని కొత్త సమస్య యెదు రయ్యింది మా నాన్నగారొచ్చేశారు! ఆయన్నిచూసి, గుమ్మంలో అలాగే నిల బడిపోయాను గేబ్రియేల్ నన్ను చూసి

"ఏం పంతులుగారూ! మా ముత్తయ్య కనిపించాడా?" అన్నాడు! నేనేం సమా ధానం చెపుతాను? కన్నంలో దొరికి పోయిన దొంగలాగ నిలబడిపోయాను మా నాన్నగారు నావంక కొర కొర చూస్తున్నారు. గేబ్రియేల్ వంక తిరిగి,

"ఎవర్నయ్యా పంతులంటున్నావు?" అన్నారు గేబ్రియేలు చిరునవ్వు నవ్వుతూ—

"ముత్తయ్య దీక్షితులని ఎడ్రసు యివ్వాలా మనోవడు ఈయనే ఆ ముత్తయ్య," అన్నాడు, నాన్న నావంక తిరిగి,—

"ఏరా! ఎప్పటినుంచి నువ్వు పంతు లైంది?" అన్నాడు గేబ్రియేల్ —

"అదేంటి బావగారూ! ఈయన ముత్తయ్య, కళ్లజోడు పెట్టుకుని చూడండి, సరిగా కనబడ్డంలేదేమో," అన్నాడు—

"నాకు కళ్ళజోడు ఎందుకయ్యా!" అని నా వంకతిరిగి—

"ఏరా మాట్లాడవేం?" అన్నాడు నాన్న—

గొంతు సవరించుకుంటూ, "నాన్నా" అన్నాను నేను, గేబ్రియేల్ బిత్తర పోయాడు...

"నాన్న?" అన్నాడు అర్థంకానట్టు

"నాన్న కాపోతే అమ్మా అంటాడా నన్ను?" అన్నాడు నాన్న

"ఇతనేనా ముత్తయ్య, అయితే అత నెవరు?" అని ఆత్రంగా అడిగాడు గేబ్రియేల్

"నర్సింహం అని నా స్నేహితుడు," అన్నాను నేను

"ఏసునాదా! అమ్మాయ్ రోసీ, ఆయన బేపన పంతులే! ముత్తయ్య కాదు," అంటూ లోపలికెళ్ళాడు, నాన్న అప్పుడు నా వంక తిరిగి—

"ఏమిట్రా ఈ నాటకం?" అని అడిగాడు. నేను చెప్పేశాను–

"ఏంలేదు నాన్నా, ఇక్కడొక బ్రాహ్మల ఇంట్లో ట్యూషను దొరికింది శేషాద్రిగారని హోటల్ ప్రొప్రయిటర్. బ్రాహ్మలికి తప్ప ఆయన ఉద్యోగాలివ్వడు ఎంత తిరిగినా ఎక్కడా పని దొరకలేదు అంచేత ముత్తయ్య దీక్షితులని పేరు మార్చుకుని, వాళ్ళింట్లో ట్యూటరుగా చేరాను "

"ఛీ! క్రైస్తవ పుట్టుక పుట్టలేదురా? ఉద్యోగంకోసం మతం మార్చుకున్నావా?"

"మతం మార్చుకోలేదు నాన్నా, పేరే మార్చుకున్నాను యిప్పుడింక ఎవర్నీ మోసం చెయ్యవలసిన అవసరంలేదు బొంబాయిలో నాకొక మంచి ఉద్యోగం–దొరికింది – ఈవేళే బయలుదేరి వెళుతున్నాను!" అన్నాను

"నీది ఏ మాట నమ్మమంటావురా? ఆ శేషాద్రిగారు ఎవరో, అసలు అలాంటి మనిషి వున్నాడో లేడో, ఉంటే – ఆ వెయ్యి నీకు ఆయన నిజంగా ఇచ్చాడో–నువ్వే ఆయనకి టోపీవేసి కొట్టేశావో, అన్నీ తేల్చుకుని వస్తాను," అని చర్రున వెళ్ళిపోయాడు నాన్న నాకు తల తిరిగిపోయింది–"ఓ మైగాడ్" అంటూ తల పట్టుకు కూర్చున్నాను గేబ్రియేల్ నరసింహంకోసం, రోసీ కోసం ఇల్లంతా వెతికినట్టున్నాడు నాన్న రాగానే వాళ్ళు దాచేసి ఉంటారు. ఆత్రంగా నా దగ్గర కొచ్చి,

"పంతులూ–అదే – మత్తయ్యా! మా రోసీ, ఆ దొంగ మత్తయ్యా ఏమయిపోయారయ్యా?"

"గంగలో దిగారు," అన్నాను చిరాగ్గా–అతని స్థితిమాసి, నిజంగా జాలి పడవలసిందేగాని – నేనిప్పుడు ఎవరి యెడలా సానుభూతిచూపించేస్థితిలోలేను మా నాన్న ఆ శేషాద్రిగారి ఇల్లెక్కడో పట్టుకుని వెడతాడు, నారహస్యం అంతా బయటపడిపోతుంది ఇంక నేనెవరి ముఖం చూడలేను నా కొకటే మిగిలింది దారి మా నాన్న తిరిగి రాకండా బొంబాయి వెళ్ళిపోతాను. ఆ తరవాత ఏంజరిగితే అది జరుగుతుంది

## 8. పె. శేషాద్రి నిర్ణయం

ముత్తయ్య ఎంత మంచి కుర్రాడు

అమ్మాయి మనసు తనమీద లగ్నమయిందని, దానికి వెంకాయమ్మ ప్రోత్సాహం పూర్తిగా వుందని, యెందుకో నాకుమాత్రం అది యిష్టం లేదని గ్రహించినట్టున్నాడు అందుకే అంత అకస్మాత్తుగా బొంబాయిలో ఉద్యోగం చూసుకుని వెళ్ళిపోతున్నాడు ఇంకో కుర్రాడైతే – ఒక లక్షాధికారి కూతురు తనమీద మోజు పడుతోందంటే వదలిపెట్టి పోతాడా? అతను నాకు రుణపడ్డంకాదు, నేనే అతనికెంతో రుణపడి



వున్నాను. నేనే బ్రాహ్మణ్ణైతే, నా బిడ్డని బతిమాలి అతని చేతిలో పెట్టే వాణ్ణి. సరే-నా సమస్యకి అతనే పరిష్కారం చూపిందాడు. వెంటనే రమ్మని జాన్‌కి టెలిగ్రాం యిచ్చేస్తాను. అతను వచ్చాక సంగతంతా అమ్మాయికీ, వెంకాయమ్మకీ చెప్పేస్తాను. జాన్ కొడుకు మాత్రం బుద్ధిమంతుడు కాదని యేముంది ?—

ఎప్పుడో పదిహేనేళ్ళ క్రితం చూశాను జాన్‌ని. అసలు యిప్పుడు రామాపురంలో ఉన్నాడో లేదో కూడా తెలియదు. అయినా వెళ్ళాను. నా అదృష్టంకొద్దీ అక్కడే వున్నాడు. నన్ను చూడ్డంతోటే యెంతో ఆప్యాయంగా పలకరించాడు. తన కొడుక్కి నా కూతుర్ని చేసుకోమని అడిగినప్పుడు భార్య వచ్చి చిన్న అడ్డుపుల్ల వేసింది. గాని, అతను చాలా ధారాళంగా ఒప్పుకున్నాడు. చిన్ననాటి స్నేహాలు యెవరయినా ఎలా మర్చిపోగలరు ?

నేనిలా ఆలోచించుకుంటుండే, ఉప్పెనలా వచ్చింది వెంకాయమ్మ, అమ్మాయిని వెంటబెట్టుకుని—

"ఏం అబ్బాయీ ! ముత్తయ్య బొంబాయి పోతానంటున్నాడు ?" అంది, అదేదో నా తప్పు అయినట్టు.

"ఉద్యోగం దొరికిందట, పోతున్నాడు," అన్నాను. యిందులో పెద్ద ఆశ్చర్యపడవలసింది ఏముంది ? అన్నట్టు.

"మరి అమ్మాయికి ఇష్టమయితే-వాడికిచ్చి పెళ్ళిచేస్తానన్నావుగా ?" అంది.

నిజమే ఒకప్పుడు మాటవరసకన్నాను, కాని అదే పట్టుకుంటే ఎలాగ ? పైగా అమ్మాయిని ఉసిగొల్పింది—

''చెప్పవే తల్లీ నీ కిష్టమేనని."

రాణీ సిగ్గుపడుతూ నిలబడింది—"చెప్పు" అంది మళ్ళీ వెంకాయమ్మ. నాకు కోపం వచ్చింది.

"ఉండవమ్మా, దాన్ని చెప్పనియ్యి—ఇలా రా తల్లీ !"

రాణీ వచ్చి నా పక్కని కుర్చీ చెయ్యి మీద కూర్చుంది. ఆప్యాయంగా ఆమె తల నిమురుతూ అన్నాను—

"చెప్పమ్మా. నాన్న ఇష్టమే నా ఇష్ట మని చెప్పు " రాణీ సిగ్గుపడుతూ తల వంచుకుని,

"ఆయన్నే చేసుకుంటాను నాన్నా!" అంది

నేను చ్రరున లేచాను-

"చేసుకుంటావా ? నా యిష్టం అక్కర్లేదన్నమాట. నాన్న చచ్చి పోయాడనుకున్నావా ?"

రాణీ బిత్తరపోయింది వెంకాయమ్మ అంది-

"ఏమిటా అఘాయిత్యం మాటలు అబ్బాయి?"

"అవునమ్మా, తల్లితండ్రుల ప్రమేయం లేకండా పిల్లలు ప్రేమించు కోడాలు, పెళ్ళిచేసుకోడాలు నాకు నచ్చవు ''

"నచ్చవూ ? మరి నేను పాతకాలపు మనిషిననీ, దాన్ని ఛాదస్తంగా పెంచు తున్నాననీ యెత్తిపొడిచేవాడివే పాత కాలపు మనిషివి నువ్వానేనా ?"

దానికి నేనేం సమాధానం చెపు తాను ?

"అవును- పాతకాలపు మనిషిని నేనే," అన్నాను మొండిగా. వెంకా యమ్మ ఊరుకుంటుందా ?-

"మరి దానికి చదువూ సంధ్యా యెందుకు చెప్పించావు ? ఇంగ్లీషన్నావు, డాన్సన్నావు ఈ కాలపు పిల్లల్లాగ దాన్ని తయారుచెయ్యాలన్నావు ఇంట్లోపడి వున్నదానికి లోకం చూపిం చావు- ఇప్పుడది మనసిచ్చిన కుర్రాణ్ణి పెళ్ళిచేసుకుంటానంటే వల్లకాదంటు న్నావు "

ఏమయినాసరే నేను మాత్రం మెత్తబడకూడదనుకున్నాను

"వల్లకాదనక ? వాడికేముందని యిస్తాం- దారిని పోయేవాడికి ?"

"నీకున్నదంతా చాలదా ఏమిటి?"

''నాకుంటే వాడికెలా వస్తుంది ? నన్ను ఊరికే వేపించుకు తినకు- ఈ పెళ్ళి జరగదు "

"జరగదూ ? దాని బతుకేమౌతుందో ఆలోచించావా ? అది వాడిమీద యెన్ని ఆశలు పెట్టుకుందో నీకేమన్నా తెలుసా? కన్న బిడ్డని ఇలా క్షోభపెట్టే నువ్వు తండ్రివికాదు, కర్కోటకుడివి "

వెంటనే రాణీ తన దుఃఖం అంతా దిగమింగుకుంటూ-

"వొద్దు నానమ్మా, నాన్నని అంత మాట అనొద్దు" అంది. దాని గొంతులో ఆవేదన వింటుంటే, నా గుండె చెరువై పోయింది నిజంగా దాని బతుకు నాశనం చేస్తున్నానా ?

"వాడు నాన్న కాదమ్మా ! రాక్ష సుడు," అంది వెంకాయమ్మ పట్టరాని కోపంతో

"నానమ్మా !'' అంటూ వెంకా యమ్మ నోరు మూసింది రాణీ.

"నువ్వూరుకోవే పిచ్చి తల్లీ !"

అంది వెంకాయమ్మ. రాజీ దుఃఖం, బాధ ఆపుకోలేక చర్రున తన గదిలోకి వెళ్ళిపోయింది. వెంకాయమ్మ నావంక తిరిగి-

"చూడరా! దానికి నీ మీదున్న ఆపేక్షలో నూరో వంతుందా నీకు?" అంది.

నేనేమీ సమాధానం చెప్పలేకపోయాను. గుండెల్లో ఆవేదన అణచుకుంటూ అలాగే నిలబడ్డాను.

"సరే నీ యిష్టం వచ్చినట్టే కానియ్యి, నీ పరువు నీకు దక్కుతుందేమోగాని, బిడ్డమాత్రం నీకు దక్కదు." అనేసి వెంకాయమ్మ వెళ్ళిపోయింది. వాళ్ళిద్దర్నీ పిలిచి నిజం బయటపెట్టేద్దామా అనిపించింది. వెంకాయమ్మ చెప్పిందే నిజం. కాని చూస్తూ చూస్తూ, ఒక అమాయక బ్రాహ్మణ్ణి యెలా మోసం చెయ్యను? ఇప్పుడేమిటి దారి? నా మనసంతా అల్లకల్లోలమయిపోయింది. గబగబా మెట్లు దిగి నా గదిలోకి వెళ్ళాను. మేరీ విగ్రహం ముందు మోకరించి కూర్చున్నాను. దీనంగా ప్రార్థించాను. యిప్పుడేం చెయ్యాలో చెప్పమని. దీనికి పరిష్కారం వొకటే. వెళ్ళి ముత్తయ్యతో నిజం చెప్పేస్తాను, నా బిడ్డ ప్రాణం నిలబెట్టమని బతిమాలతాను. ఆ తరవాత జాన్‌కి యేదో సమాధానం చెప్పుకుంటాను. ఏమయినా సరే నేను చేసిన తప్పుకి నా బిడ్డ బలి గావటానికి వీల్లేదు.

కార్లో బయలుదేరాను. ట్రెయిన్ టయిము దగ్గరపడుతోంది. ముత్తయ్య స్టేషనుకి వెళ్ళిపోయాడో ఏమో! స్టేషనుకి వెళ్ళి అయినా సరే అతన్ని పట్టుకోవాలి.

లాడ్జిముందు కారాపి, ఆత్రంగా లోపలికి వెళ్ళాను.

ముత్తయ్య యింకా బట్టలు సర్దుకుంటున్నాడు. అమ్మయ్య! నా అదృష్టం బాగుంది- 'ముత్తయ్యా' అని పిలిచాను. అతను వెనక్కి తిరిగి నన్ను చూసి ఆశ్చర్యపోయాడు.

"మీరా! మీరు రావటమెందుకు? కబురు చేస్తే నేనే వచ్చేవాణ్ణిగా," అన్నాడు.

"కబురు చెయ్యటానికి టైమేదీ? నువ్వు వెళ్ళిపోతున్నావు, అందుకని నేనే వచ్చేశాను."

ఆ తరవాత అసలు విషయం యెలా ప్రారంభించాలో నాకు అర్థంకాలేదు. ఆఖరికి అన్నాను-

"ఒక్క రెండు రోజులు నాకోసం ఆగలేవూ?"

"ఎల్లుండి అక్కడికి చేరకపోతే నా ఉద్యోగం పోతుందండి,'' అన్నాడు.

''అవసరమయితే నిన్ను విమానంలో పంపుతాను," అనేసి తరవాత మాటల

కోసం తడుముకుంటూ మెల్లగా ప్రారంభించాను-

"ముత్తయ్యా ! నేను చెప్పేది సావకాశంగా విను నీవల్ల నాకో సహాయం కావాలి "

"సహాయం అన్న మాటెందుకండి ? మీకు నేనెంతో రుణపడివున్నాను మీరు చెప్పండి-నేను చేస్తాను "

"నిజానికి యిది సహాయం కాదు-స్వార్ధం, నీకు పెద్ద త్యాగం అయినా నిన్ను అర్ధించక తప్పటంలేదు నువ్వు కాదంటే నాకు జీవితమంతా మన శ్శాంతి వుండదు అవునంటే నీకు వుండకపోవచ్చు అందుకే సందేహిస్తున్నాను "

"మీరేమీ సందేహించక్కర్లేదు మీరంటే నాకెంతో గౌరవం నాకు బతకట మెలాగో నేర్పారు, అడగండి "

నాకు కాస్త ధైర్యం వచ్చింది

"మా అమ్మాయిని గురించి నీ అభిప్రాయం ఏమిటి ?" అని అడిగాను

''నన్నడుగుతారేమిటండి ? నాకన్న మీకే బాగా తెలుసు మీ అమ్మాయిని గురించి "

"నాకా !"

"అవునండి నేను ఆ రోజున వుద్యోగం మానేసి పోతానంటే మీరే అన్నారు, 'మా అమ్మాయి మహంకాళి కాదు, రాజరాజేశ్వరి, దానిది జాలి గుండె నీ కోపం నామీద చూపించే కంటె, అమ్మాయి దగ్గరికి పోయిచెప్పుకో అన్నారు."

నాకు నవ్వొచ్చింది ఇంతలో అకస్మాత్తుగా ముత్తయ్య వెనక్కి తిరిగి వల వల ఏడవటం మొదలుపెట్టాడు. ఎందుకో నాకర్ధం కాలేదు

"అలాగే వెళ్ళాను, లేనిపోని అబద్ధాలన్నీ కల్పించి చెప్పాను," అంటూ యేదో దారుణమైన తప్పు చేసినవాడిలా ఏడుస్తున్నాడు నేను భుజంమీద చెయ్యేసి ఆప్యాయంగా అన్నాను-

''ఏమిటోయ్ యిది ? యెందుకలా ? ఊరుకో "

''ఆవేళ అమ్మాయిగార్ని అనవసరంగా ఏడిపించానండి నేను చేసిన మోసం మర్చిపోలేను నన్ను జీవితాంతం దహిస్తుంటుంది.''

ఇంత చిన్నవిషయానికి యిలా బాధపడిపోతున్నాడని నాకు నవ్వొచ్చింది-

"ఫరవాలేదు, దానికి పరిహారం నేను చెపుతాను" అన్నాడు

''చెప్పండి చేస్తాను- నా మనసులోంచి ఆ బరువు తొలగిపోతే చాలు "

"అయితే మా అమ్మాయిని చేసుకో !''

ముత్తయ్య అదిరిపోయాడు

"అది మాత్రం అనక్కండి - ఇంకో మోసం చెయ్యలేను" అన్నాడు

"మోసం ఏముంది? నేను వచ్చి అడుగుతున్నాను కదా"

ముత్తయ్య యెందుకో మహా కంగారు పడిపోతూ, చేతులు జోడించి, వద్దండి, అంతటి పాపానికి వొడిగట్టలేను- మా నాన్నగారు కూడా ఊళ్ళోనే వున్నారు. ఆయన యెంతమాత్రం ఒప్పుకోరు" అన్నాడు.

నేనింకా అసలు విషయం చెప్ప కుండానే అభ్యంతరం చెబుతున్నా దేమిటి?

"ఆయన కాళ్ళు కడుపూ పట్టుకుని నేను వొప్పిస్తాను నువ్వు సరే అను,"- అన్నాను

చటుక్కుని ముత్తయ్య వంగి నా కాళ్ళు పట్టుకుంటూ-

"నన్ను క్షమించండి" అన్నాడు.

"ముత్తయ్యా!" అంటూ అతన్ని లేవదీశాను.

అతను నా ముఖం చూడలేనట్టు వెనక్కి తిరిగి అన్నాడు-

"ఈ విషయం బయటపడకుండానే నేనిక్కడి నుంచి వెళ్ళిపోదామను కున్నాను— యిప్పుడు చెప్పక తప్పటం లేదు నేను - బ్రాహ్మణ్ణి కాను - క్రిష్టియన్ని"

నాకు ఆశ్చర్యం, ఆనందం వొక్క సారే కలిగాయి ఏమిటీ విచిత్రం?

"మీ నాన్నగారి పేరు?" అని అడిగాను.

"జాన్" అన్నాడు.

"మీ ఊరు?" అని ఆత్రంగా అడిగాను-

"రామాపురం"

ఇంకేం! వెదకబోయిన తీగ కాళ్లకే తగిలింది ఇదంతా మేరీమాత అను గ్రహమే! నా సమస్యకి యింత సుల భంగా పరిష్కారం దొరుకుతుందని నేను కలలోకూడా అనుకోలేదు

"ఆయన ఈ ఊళ్ళోనే వున్నారా?" అని అడిగాను

"ఇంతవరకూ యిక్కడే వున్నారు- బహుశా మీ ఇంటికే వెళ్లారేమో! నా తరపున క్షమార్పణ చెప్పటానికి", అన్నాడతను.

"అయితే పద యింటికి వెడదాం" అన్నాను.

అతను సందేహిస్తూ పెట్టె తీసుకో బోయాడు అక్కడనుంచి అలాగే స్టేషనుకి వెళ్లాలని కాబోలు-

"ఇప్పుడవన్నీ అక్కర్లేదు - రా చెపుతాను," అంటూ చెయ్యిపట్టుకుని నడిపించుకునిపోయాను నాకు లోకా న్నంతనీ జయించినంత సంతృప్తిగా వుంది.

## 9. ఐం. పి. రాజేశ్వరి

## తెగింపు

నా ఆశలన్నీ నేలపాలు చేసేశాడు నాన్న.

ఆ రోజుని గెస్టుహౌస్‌లో మాస్టారు వొప్పుకున్న నాటినుంచీ నేను నిజంగా గాలిలో తేలిపోతున్నాను. ఆడుతూ పాడుతూ నా జీవితమంతా హాయిగా గడపవచ్చు అనుకున్నాను. మేస్టారు జ్వరంవచ్చి, మా ఇంట్లో పడుకున్న నాలుగురోజులూ క్షణంలా గడిచి పోయాయి. ఎంత సరదాగా వుంది! నేను పరిచర్య చేస్తుంటే, మేస్టారు యిబ్బందిపడిపోతుంటే, నాకు మహా ముచ్చటగా వుంది. ఆయన మంచం పక్కనే కూర్చున్నాను, అన్నిరోజులూ. రాత్రిళ్ళుకూడా పడక అక్కడే. నాన్న వస్తాడు, మా యిద్దరికీ పెళ్ళయి పోతుంది. ఇంక యెల్లకాలం ఆయన పక్కని అలాగే కూర్చోవచ్చు. ఇలా ఎన్ని కలలు కన్నాను - అన్నీ ఒక దెబ్బలో నేలపాలు చేసేశాడు నాన్న.



మేస్టారు నాన్నతో మాట్లాడి కిందికి వస్తుంటేనే, నాకేదో అనుమానం తగిలిం:. తను బొంబాయి వెళ్ళిపోతున్నానని చెప్పారాయన. పిడుగులాంటి వార్త! నాన్న వెళ్ళిపొమ్మన్నాడా? మేస్టార్ని వుండమంది నానమ్మ, నాకు కాస్త ధైర్యం వచ్చింది. నానమ్మ గట్టిగా చెపుతుంది, నాన్న వొప్పుకు తీరతాడు అని ఆశపడ్డాను. నా ఆశ నిరాశయింది.

నాన్న ధోరణి చూస్తే విపరీతంగా అనిపించింది. ఎన్నివిధాల చెప్పింది నానమ్మ! మొండిపట్టు పట్టుకు కూచున్నాడు. ఎ:దుకిలా అయిపోయాడు? నా బతుకంతా తల్లకిందులయిపోయింది. పాపం! నానమ్మ నేనేమైపోతానో అని, నన్ను కనిపెట్టుకునే కూచుంది. మంచం మీద పడుకుని, ముఖం తలగడాలో దాచుకుని యెంతసేపు యేడ్చానో. చటుక్కుని నాకు చెప్పరానంత దుగ్ధ, కోపం వచ్చాయి ప్రత్యేకంగా యెవరి మీదా కాదు, పిచ్చి ఆవేశం నన్ను ఆవహించింది. ఎవరితోటో కోరి దెబ్బలాట పెట్టుకోవాలనిపించింది. గదిలోంచి యివతలికి వచ్చాను.

నాన్న తన గ:లోకి వెడుతున్నాడు. ఆ గదిలో ఏముంది? ఇన్నాళ్ళూ మమ్మల్నెవర్నీ యెందుకు చూడనివ్వ

లేదు ? లోపలికెళ్ళి సుత్తి తీసుకొచ్చాను నానమ్మ చూస్తూనే వుంది మేడమీద వరండాలోకి వచ్చాను

నాన్న తన గది తలుపు తాళంవేసి గబగబా వెళ్ళిపోతున్నాడు. ఆయన వీధి గుమ్మం దాటేదాకా ఆగాను ఆ తరువాత పరిగెత్తాను నానమ్మ 'రాజీ రాజీ' అంటూ అరుస్తూనే వుంది, నేను వినిపించుకోలేదు. రివ్వున గది దగ్గరికి వెళ్ళిపోయాను నానమ్మ ఆపబోతే ఆవిణ్ణి తోసేశాను సుత్తితో రెండు దెబ్బలు గట్టిగా కొట్టేసరికి, గడియ తాళంతోసహా వూడిపోయింది తలుపు తోసి లోపలికి వెళ్లాను

నాకు తల తిరిగిపోయింది

లోపల మేరీమాత విగ్రహం, గోడల నిండా క్రైస్తవ పటాలు !! ఎవరో సుత్తితో నా తలమీద కొట్టినట్టయింది నాన్న క్రైస్తవుడు !! ఇన్నాళ్ళుగా ఆయన దాచిన రహస్యం యిది ! అయితే నేనూ క్రిష్టియన్నే !! అందుకే నాన్న వొప్పుకోలేదు మా పెళ్ళికి

జ్ఞానం వచ్చిన నాటినుంచీ హిందువుల పూజలు చేశాను నా పేరింటి దైవం రాజరాజేశ్వరిని కొలిచాను హిందువుల పిల్లలాగ నోములు వ్రతాలు చేశాను ఇప్పుడంతా తల్లక్రిందులై పోయింది నేనూ, నాన్నా దేవుళ్ళని మోసంచేశాం, లోకాన్నే మోసం చేశాం అన్నిటికన్నా దేవతలాంటి నానమ్మని మోసంచేశాం, 'మోసం మోసం' అని నాలో నేనే అనుకోవటం వొకటే నాకు తెలుసు ఆ తరువాత మూర్ఛపోయినట్టున్నాను కళ్ళు తెరిచి చూసేసరికి నానమ్మ వొళ్ళో పడుకోబెట్టుకుని ముఖానికిపట్టిన చెమట తుడుస్తూ, 'రాజీ రాజీ' అంటోంది

నేను చప్పున లేచాను-

"వద్దు నానమ్మా, నన్ను తాకొద్దు నన్ను తాకితే నువ్వు మైలపడిపోతావు" అంటూ దూరంగా జరగబోయాను తూలాను, నానమ్మ పట్టుకుంది

"అయ్యో వెర్రిపిల్లా ! మైలపడిపోవడమేమిటే ? బిడ్డని తాకితే తల్లెక్కడన్నా మైలపడిపోతుందా ?"

నానమ్మది యెంతో గొప్ప మనసు గనక, ఆ మాట అంత ధారాళంగా అనగలిగింది కాని యీ రహస్యం తెలిసిన తరవాత నానమ్మని యెలా తాకగలను ?

"కాదు నానమ్మా, మన మతాలు వేరు, మన దేవుళ్ళు వేరు"

అన్నాను వలవల యేడుస్తూ

నానమ్మ ఏ సంకోచంలేకండా నన్ను దగ్గరగా తీసుకుంది-

"మతాల దేముందే తల్లీ, ఏ దేవుళ్ళని కొలిస్తే యేమిటి ? అవీ బొమ్మలే - యివీ బొమ్మలే !" అంది

"నాకు బతకాలని లేదు నానమ్మా!" అంటూ ఆవిడ భుజంమీద తలపెట్టి

వల వల యేడ్చాను. నానమ్మ నా కళ్ళు తుడుస్తూ-

"తప్పమ్మా అలా అనగూడదు - మీ నాన్న చాలా మంచివాడమ్మా, ఆఖరికి అన్నీ నువ్వు అనుకున్నట్టే జరుగుతాయి," అంటూ సముదాయించింది

మెల్లగా నన్ను మేడమీద గదిలోకి తీసుకుపోయి, మంచంమీద పడుకో బెట్టింది తను పక్కనే కూచుంది అలా యెంత సేపు గడిచిందో.

చటుక్కున నాన్న గొంతు వినిపించింది నేను అటు తిరిగి చూడలేదు నానమ్మ గుమ్మం దగ్గర కెళ్ళి-

"నువ్వెక్కడి కెళ్లావ్ ? నీ కోసం కబురుచేస్తే హోటల్లో లేవన్నారు," అంది

నాన్న దానికి సమాధానం చెప్పకుండా-

"అమ్మాయి యెలా వుంది ?" అని అడిగాడు

"చిన్నపిల్ల కదా అదే తేరుకుంటుంది," అంది నానమ్మ. తన రహస్యం నాకు తెలిసిపోయిందని నాన్నకి అర్థమైందా ? కింద తెరచున్న తలుపులు చూశాడా ? ఇంతలో నానమ్మ అతి ఉత్సాహంగా నా దగ్గరకు వచ్చి అంది-

"చూడవే తల్లీ, మీ నాన్న యెవరిని తీసుకొచ్చాడో ! నేను చెప్పలా, అన్నీ నువ్వు అనుకున్నట్టే జరుగుతాయని ? ముత్తయ్య వచ్చేశాడు " నేను ఆత్రంగా లేచి యివతలికి వచ్చాను మేస్టారిని చూడ్డంతోటే పోయినప్రాణం తిరిగి వచ్చినట్టయింది నాకు కాని వెంటనే గుర్తుకొచ్చింది, నేను క్రిష్టియన్ని, ఆయన బ్రాహ్మడు

"ఇప్పుడెందుకు నానమ్మా? వెళ్ళిపొమ్మని చెప్పు," అన్నాను, ముఖం తిప్పేసుకుని నాన్న దగ్గరగా వచ్చాడు-

"బొంబాయి ప్రయాణం మాన్పించి తీసుకొచ్చానమ్మా ! నీ కోసం అతన్నే చేసుకోవాలని ఎంతో ముచ్చటపడ్డావు కదా," అన్నాడు

"అప్పుడు తెలీక అన్నాను ఇప్పుడు తెలిసి ఆయన కెలా ద్రోహం చేస్తాను ? జరిగిన మోసం చాలు "-

నా గొంతులో ధ్వనించిన దోషారోపణ నాన్నని యెంతో బాధపెట్టి వుండాలి

"నిజమేనమ్మా ! కాని, ఏ పరిస్థితుల్లో నేనీ నాటకం మొదలెట్టానో మీకు తెలియదు నా అసలు పేరు శామ్యూల్ - " అన్నాడు

"శామ్యూల్ !! " అన్నారు మేస్టారు

ఆయన వంక అనుకోకుండా చూశాను బిత్తరపోయి ఉండాలి ఆయన, పిడుగు దెబ్బతిన్నట్టు కాని ఆశ్చర్యంతోపాటు ఒక చిన్న చిరునవ్వుకూడా ఆయన ముఖంలో మెరిసి

నట్టు నా కనిపించింది నాకర్ధంకాలేదు నాన్న అప్పుడు చెప్పాడు తన చరిత్ర- ఇరవై ఏళ్ళ క్రితం తను ఈ ఊరొచ్చి మిలిటరీ హోటల్ పెట్టడం, అది దివాలా తియ్యడం, ఆ తరవాత శేషాద్రిగా పేరుమార్చుకుని ఒక బ్రాహ్మణ హోటల్లో చేరడం, నేను పుట్టడం, మా అమ్మ చనిపోవడం, నానమ్మ నన్ను పెంచడం, తరవాత నా పేర ఒక కాఫీ కొట్టుపెట్టడం, అదృష్టం కలిసొచ్చి అది పెద్ద హోటల్ కావడం, అన్నీ

"నీకు ఎప్పుడు తెలిసినా నువ్వు యిలాగే బాధపడతావని నేనే ఆ బాధంతా భరిస్తూ వచ్చాను. ఆ కష్టం నాకు తప్పించారు, మీ అంతట మీరే తెలుసుకున్నారు."

ఆ తరవాత మెల్లగా నానమ్మ వంక తిరిగి, అతి దీనంగా అన్నాడు-

"వెంకాయమ్మా ! నీకుమాత్రం తీరని ద్రోహంచేశాను నీ నియమం, నిష్ఠ అంతా మంటగలిపాను క్షమించ మని అడగడానికి కూడా నా కర్హత లేదు "

"అవేం పిచ్చిమాటలు అబ్బాయీ ? నువ్వు చేసిందేముంది ? నా కళ్ళు తెరి పించడానికి భగవంతుడే ఇదంతా చేశాడు 'ఎన్ని పేర్లు పెట్టి పిలిచినా, నే నొక్కణ్ణే, దైవం అంటే ప్రేమే నుమా' అని చెప్పాడు "

నానమ్మ ఆ మాటలు అంటుంటే నిజంగా దైవం అంటే ఆవిడే అనిపించింది నాకు మేస్టారూ అదే అన్నారు

"మీది చాలా గొప్ప మనసు నానమ్మగారూ ! మీరు నన్నుకూడా క్షమించాలి నేనూ క్రిష్టియన్నే "

నాలో ఒక్కసారి వెయ్యి వీణలు మోగినట్టయింది కళ్ళప్పగించి చూశాను, ఆయన వంక నా నమ్మ ఆశ్చర్యంనించి తేరుకుని పకపక నవ్వింది.

"నువ్వూ గట్టివాడివేరా, మా శేషు లాగ. నీ అసలు పేరేమిట్రా ?"

"మేథ్యూ "

"అబ్బే ఏం పేర్రా అది ? నాకు మాత్రం నువ్వు ముత్తయ్యవే, ముత్యా లువి. నా రత్నాల్ని నీ కిస్తున్నాను, ఇలారా," అంది దర్జాగా ఇంతలో నాన్న కలుగజేసుకున్నాడు-

"ఉండవమ్మా ! వాళ్ళ నాన్నకి చెప్పొద్దూ ?"

నానమ్మ మహారాణీ పోజుపెట్టి,

"పిల్లా పిల్లాడూ ఇష్టపడ్డారు, నానమ్మని నే నొప్పుకున్నాను మధ్య వాళ్ళ నాన్నెవడు ?...తల్లీ! మీరిద్దరూ మీ నాన్నకి మొక్కండి "

మేస్టారూ నేనూ కదిలాం, నాన్న చెయ్యి అడ్డుపెట్టాడు.

"మధ్య నేనెవణ్ణి ? నానమ్మకి మొక్కండి"

ఇద్దరం నానమ్మ కాళ్ళకి మొక్కుతున్నాం ఆమె మౌనంగానే దీవిస్తోంది మా వెనకాలే నాన్నకూడా వచ్చి మాతో పాటు నానమ్మకి మొక్కాడు. నానమ్మ ఆయన్ని జబ్బలు పట్టుకుని ఆపింది-

"ఏవిఁటబ్బాయీ! యీ చాదస్తం?"

"ఏవుంది ? నీ చాదస్తమే నాకు పట్టుకుంది"

ఎంత తేలికగా అన్నా, మా నాన్న మాటల వెనక ఎంతో భక్తి వుంది ఆమె కాళ్ళకి మొక్కడంతో, ఇన్నాళ్లూ భరిస్తూ వచ్చిన బరువంతా తగ్గి ఆయన మనసు తేటపడింది. ఈ సాకుతో ఆవిడికి క్షమార్పణ చెప్పుకున్నాడు.

మేస్టారి నాన్నగారు ఊళ్ళోనే ఉన్నారట ఆయనకి కబురు చెయ్యాలన్నాడు నాన్న. ఆయనా, నేనూ, మేస్టారూ, కిందికి వెళ్లాం

మేస్టారి నాన్నగారు రానే వచ్చారు ఆయనతో కూడా ఇంకొక పెద్దమనిషి ఉన్నాడు ఆయన పేరు గేబ్రియెలట జాన్‌గారికి కాబోయే వియ్యంకుడట.

నాన్న మొగాన్ని విభూతి చూసి, ఈయన శేషాద్రో, శామ్యూలో అర్థం కాక కాస్త తికమకపడుతూ దగ్గరగా వచ్చారాయన.

"శామ్యూల్ !"

అన్నారు - నాన్న మొహం వంక చూస్తూ-

"ఇది శేషాద్రి అవతారం!" అన్నాడు నాన్న — నవ్వుతూ -ఆయన ఆశ్చర్యపోయి;

"అయితే నువ్వుకూడా...!"

అప్పుడు నానమ్మ అంది

"మా అబ్బాయేం తక్కువవాడు కాడు మీ వాడికన్నా ఇరవయ్యేళ్ళు ముందే వేళాడీవేషం !"

నేను జాన్‌గారి కాళ్ళవంక చూశాను - కొంటెగా మేస్టారితో అన్నాను

"యేం మేస్టారూ ? మీ నాన్న అవిటివాడన్నారు బాగానే వున్నారే !"

మేస్టారు కొంచెం కంగారుపడ్డారు - వాళ్ల నాన్నగారు ఏమనుకుంటారోనని - నాన్న సర్దేశాడు

"అవిటివాడు జానకిరామయ్య - ఇతను జాన్ ।"

జాన్‌గారు నావంక నవ్వుతూ చూసి-

"ఏం బావా - అమ్మాయిని బాగానే తయారుచేశావే - అప్పుడే పరాచికాలు మొదలెట్టింది!"

"ఇందులో నాదేంలేదు అంతా మీ అబ్బాయి ట్రెయినింగే !"

"ఏవఁమ్మా ఇంత పెద్ద భవంతీ,

మీ నాన్ననీ వొదిలిపెట్టి మా ఇంటి కొస్తావా !!"

అని అడిగారు జాన్‌గారు

"మీరు రమ్మంటే అలాగే వస్తాను !"

అని హాయిగా చెప్పేశాను.

"ఏం తల్లీ-మీ నాన్నని వొక్కణ్ణీ వొదిలేసి వెళ్ళిపోతావా !"

అని జాలిగా అన్నాడు నాన్న - నానమ్మే సమాధానం చెప్పింది-

"ఇదిగో జానకిరామయ్యా !"

మాకు నవ్వొచ్చింది — జాన్‌గారికి కూడా ! - నానమ్మ తక్కువదా !

"నాకు జానకిరామయ్యే. నువ్వూ-మీ ఆవిడా కూడా వచ్చి మా ఇంట్లోనే వుండాలి !''

జాన్‌గారికేం సమాధానం చెప్పాలో తోచలేదు - ఇంతలో కాస్త దూరంగా నిలబడ్డ గేబ్రియల్‌గారు - దగ్గరగా వస్తూ-

"మీరూ మీరూ బాగానే వున్నారు నా బ్రతుకే అల్లరైపోయింది - ఆ పంతులు మా రోసీని లేవదీసుకు పోయాడు !"

అంటూండగానే మెళ్లో దండల్తో - నర్సింహం అన్నయ్య అ రోసీ వచ్చారు.

"లేవదీసుకు పోవడమేవిఁటీ ! తప్పు ! తప్పు ! ఇద్దరం రిజిస్ట్రారాఫీసుకెళ్ళి పెళ్ళి చేసుకొనివచ్చాం !"

"ఏసునాధా మా సుగుణమ్మ ఒప్పుకోదే !"

అన్నారు గేబ్రియల్‌గారు కంగారుగా. అప్పుడు నానమ్మ అంది

"ఆవిడొప్పుకొనేదాకా వీళ్ళిక్కడే వుంటారు - నీకంత భయంగా వుంటే నువ్వు ఇక్కడే వుండు - ముందు వాళ్ల నాశీర్వదించు !"

అందరం నవ్వాం - గేబ్రియల్‌గారు అయిష్టంగానే ఆశీర్వదించారు

"ఇదీ వరస !"

అన్నాడు నాన్న అందరం మళ్ళీ నవ్వాం

* శుభం *






"దేవా, గురువాయూరప్పా! నిన్నే నమ్ముకున్నాను నన్ను క్షేమంగా ఇల్లు చేర్చు స్వామీ నీదే భారం కృష్ణా! గురువాయూరప్పా"

మూపమ్మ కళ్ళుమూసుకుని దేవుడిని వేడుకుంటున్నపుడు డ్రైవర్ రామన్ పైగుడ్డ నడుముకి చుట్టుకొని చేతులు జోడించి ఆమె ప్రక్కనే నుంచుని చెవులారా వింటున్నాడు.

అతని మనసు దేవుడిమీద లేదు అతని ఆలోచనలే వేరుగా వున్నాయి

ఈమెని జాగ్రత్తగా ఇల్లు చేర్చే భారం గురువాయూరప్పమీద ఎక్కడుంది? దేవుడేమో గుళ్ళో పీఠంవేసుకుని,

చక్కగా కూర్చుని వుంటాడు. తాను కదా ఆమెను ఇల్లు చేర్చే భారం పైన వేసుకునేది తనను కాకుండా గురువాయూరప్పను నమ్ముకుంటుందా ఈ అమ్మగారు!

కోళికోడునుండి గురువాయూరు దాకా తను ఒక్కడే జాగ్రత్తగా తీసుకు రాలేదూ కారులో! అప్పుడు ఇలా గురువాయూరప్పమీద భారం వేసుకు నుండదు ఆమెకు మద్రాసునుంచికొడుకు ఉత్తరం వ్రాశాడు అతనొక ఫిలిమ్ ప్రొడ్యూసర్ తాను తీసిన సినిమా విజయవంతమై లాభాలు తెస్తే గురువాయూరప్పకు మహాపూజ చేయించి సేవించాలనుకున్నాడు అతని కోరిక ఫలించింది

"అమ్మా నేను ఫలానారోజున గురువాయూరు వస్తాను. పెళ్ళాం పిల్ల లను తీసుకువస్తాను.కాని కోళికోడువచ్చి మీ దర్శనం చేసుకునేటంత సమయానుకూలంలేదు పిల్లలు నిన్ను చూడాలని ఆశపడుతున్నారు. కనుక నువ్వు ఇద్దరు చెల్లెళ్ళను, వారి పిల్లలను తీసుకుని గురువాయూరు వస్తే అక్కడ మిమ్మల్నందర్నీ చూసి సంతోషించాలని వుంది" – ఇలా వ్రాసిన కొడుకు ఉత్తరం చూసి ముదుసలి మూపమ్మ తన వయసు కూడా మరచి, మురిసిపోతూ ప్రయాణం కట్టింది. 'రామన్! రామన్!' అని మాటి మాటికి పిలుస్తూ గురువాయూరు వెళ్ళిరావడానికి కారు సిద్ధంచేయమని పురమాయించింది

కారుకేం? బంగారంలాంటి కారు బ్రహ్మాండంగా పనిచేసే కారు. ఒక్కపూపులో దక్షిణదేశ యాత్రచేసి రావచ్చు

మూపమ్మ కొడుకు కుంజ్ కృష్ణన్ మద్రాసులో స్థిరనివాసం ఏర్పరుచుకున్నాడు కోళికోడు దగ్గర వున్న పాలంపాడులో వున్న తల్లిదండ్రుల్ని చూసి మూడేళ్లు కావస్తున్నాయి పెద్ద జమీందారీ వాళ్ళది మూపమ్మ పెద్ద కొడుకు ఇల్లు, భూముల వ్యవహారం చూస్తాడు తండ్రి పెద్దవారైనారు 'కృష్ణా, రామా' అనుకుంటూ వాత దోషంతో మంచంలో పడుకునే పురాణాలు చదివించుకుని వింటూ కాలక్షేపం చేస్తుంటారు 'మరుమక్కత్తాయం' పద్ధతిమేరకు మూపమ్మ ఇంటికి యజమానురాలు పల్లెటూరిలో ఇల్లయినా కోళికోడు నగరానికి దగ్గర్లో కారున్న శ్రీమంతుల ఇల్లు మూపమ్మది డ్రైవర్ రామన్ చాలా ఏళ్ళనుండి వాళ్ళింట్లో డ్రైవర్ నమ్మకంగా ఇంటివాడిలాగే వుండేవాడు

కొడుకుని, కోడల్ని, మనవల్ని చూడాలన్న ఆతృత మూపమ్మకు – అందులోనూ గురువాయూరులాంటి పుణ్యస్థలంలో ఆమె గురువాయూరు వెళ్ళికూడా చాలా రోజులయింది.

ఇప్పుడు మళ్ళీ ఇదో అవకాశం. మద్రాసు మనుమలకు ఇష్టమైన 'నేంద్రం గాయివరువల్', ఒక డబ్బానిండా "వడమాగాయి", ఎండపెట్టిన పళ్ళ చిప్స్ అన్నీ సిద్ధంచేసుకుంది. తన ఇద్దరు కూతుళ్ళకూ కబురుపెట్టింది కాని వాళ్ళెవరికీ బయల్దేరడానికి వీలులేని పరిస్థితులు ఒక్కొక్కరికి ఒక్కొక్క రకం అననుకూలాలు ఒకావిడ పిల్లలకు అనారోగ్యం ఇంకొకావిడ భర్తకు ఒంట్లో బాగోలేదు పెద్ద కొడుక్కి ఆ రోజు కోర్టులో ఏదో కేసు రాలేదు పెద్ద కోడలు వచ్చిబాలెంత. ఇక చేసేదేంలేక మూపమ్మ తనొక్కతే కారెక్కి బయల్దేరింది నమ్మకమైన మనిషి కారు నడపడంలో తెలివైన వాడు - రామన్ తోడున్నాడు గనుక భయపడవల్సిన అవసరమేమీ లేదు కాని, ఇంటినుండి బయల్దేరేటప్పుడు ఏ దేముడిమీదా భారం వెయ్యని ముసల్ది ఇప్పుడు గురువాయూరునుండి బయల్దేరే టప్పుడు దేముడిమీద భారంమోపి వేడు కుంటుంటే, డ్రైవర్ హృదయంలో పుట్టిన వ్యంగ్యపుహాసం మొహంలో ప్రతిఫలించింది

అలాంటి నవ్వు నమ్మకస్తుడైన డ్రైవర్ రామన్ హృదయంలోంచి ఎందుకు పుట్టుకొచ్చింది ?

వచ్చేటప్పుడు అతనిలో ఏ ఆలోచ నలూ లేవు. గురువాయూరులో అతని పాతమిత్రులిద్దర్ని కలుసుకుని, వాళ్ళతో బాటు దేవస్థానంలో జరిగిన పూజా పునస్కారాలలోను, ఉత్సవంలోనూ కలిసి వుండి, మద్రాసునుండి వచ్చిన మూపమ్మ కొడుకు-కోడలు, మనుమల మాటలను విన్నాక, కొడుకు-కోడలు మూపమ్మ చేతికి ఓ సంచి ఇచ్చి అందు లోని వస్తువులను చూపించి వివరించాక కూడా అతనికేమీ అనిపించలేదు కాని ఆ విషయాలన్నింటిని తన మిత్రులతో చెప్పినపుడు మాత్రం, చేతకానివాళ్ళే నిజాయితీ అన్న ముసుగు ధరిస్తారని వాళ్ళు వాదించినప్పుడు అతనికీ అవుననిపించింది

ఆ మిత్రుల కున్నంత తెలివితేటలు తనకూ వుండి వుంటే ఇన్నేళ్ళుగా ఆ జమీందారుగారింటి నమ్మకస్తుడైన డ్రైవర్ అనిపించుకుని, చింతపండు ముద్దలా పడివుండటమే సుఖం అనుకుని వుండేవాడా : బాగా సంపాదించి ఒక పెంకుటిల్లయినా కట్టుకుని వుండేవాడు ఎంత గొప్ప జమీందారింటి నౌకరయి తేనేం ? ఇవ్వవలసినంతే ఇస్తారు పైన ఏ కాస్త ఇచ్చినా అది వాళ్ల ఎంగిలితో సమానమే ఎప్పుడూ ఒకే రకమైన - అటూ ఇటూ కాని బ్రతుకు

ఆ సంచిలో ఫిలిమ్ ప్రొడ్యూసర్‌గా వున్న కొడుకు తన చెల్లెళ్ళకూ, వారి పిల్లలకూ ఇవ్వమని ఇచ్చిన నగలూఅవీ, వెంగళవీ,వజ్రాలు పొదిగినవీవున్నాయి.




ఎంతలేదన్నా ఏభై వేలకు తక్కు వుండదు ముసలిదాని చెవులకు వ్రేలాడుతున్న బంగారు ఆభరణాలే ఓ వెయ్యిరూపాయిలు చేస్తాయి మెడలో వజ్రాలు పొదిగిన పతకంగల గొలుసు, చేతికి బంగారు గాజులు నడుముకి బంగారు వడ్డాణం వుంది ముసలిదాని వంటిమీద నగలే పదివేలు చేస్తాయి.

పదేళ్ళనుండి మనసుకు తట్టని ఈ విషయాలన్నీ మిత్రులు చెప్పాక తెలిసాయి రామన్‌కు ఇంతవరకూ ఆ దృష్టితో ఆలోచించి ఎరుగడెప్పుడూ

గురువాయూరులో దేవుడి సేవలన్నీ పూర్తయ్యాక కొడుకు తల్లి చరణధూళి తీసుకుని "అమ్మను జాగ్రత్తగా ఇంటికి తీసుకువెళ్ళు రామన్" అంటూ రామన్ చేతికి పాతిక రూపాయలు 'బహుమతి' ఇచ్చాడు అతను తన కారులో కుటుంబంతో సహా మద్రాసు వేపు వెళ్ళాక మూపమ్మ గురువాయూరప్పమీద భారంమోపి కారెక్కింది ధనలక్ష్మితో నిండిన సంచి, గురువాయూరప్ప ప్రసాదమూ ఆమె ప్రక్కనే వున్నాయి. డ్రైవర్ రామన్ మళ్ళీ తను వచ్చిన దారినే కోళిక్కోడు బయల్దేరాడు

"గురువాయూరప్పా నీదే భారం" అంటూ మూపమ్మ కారులో కూడా రెండు మూడుసార్లు గొణుక్కుందెందుకు? రామన్ మనసులోని ఆలోచనలు ఆమెకు తెలిసిపోయాయా? ఉహూం అలా జరిగుండదు ఆమె అలా అనుకుంటే రామన్‌మీద ఆమెకు విశ్వాసం లేదన్నమాట ఈ పదేళ్లలో 'విశ్వాస పాత్రు'డంటూ పొగుడుతున్నదంతా బూటకమన్నమాట ఆ మిత్రులమాట ఎంత నిజం! ఇలాటి విశ్వాస రహితులపై తాను ఎంత విశ్వాసం పెంచుకున్నాడు!

(ఎవరెవరిని ఎంతెంత ప్రేమించి కాపాడినా వాళ్ల బుద్ధులు వాళ్ళవే) అన్న సామెత పూర్తిగా నిజం

రామన్ పళ్ళుకొరుకుతూ కారువేగం హెచ్చించాడు

"మెల్లిగా పోనియ్యరా బాబూ!"

"భయపడకండి అమ్మా"

హైరోడ్‌లో పోతోంది కారు ఉదయం గురువాయూరునుంచి బయల్దేరిన కారు కుట్టిక్కాడు గ్రామానికి వచ్చేసరికి పదిగంటలయింది రామన్ మిత్రులు చెప్పిన గ్రామం అదే అక్కడనుండి మూడుమైళ్ళు హైరోడ్‌లో వెళ్ళాక ఒక 'గోళీ' చెట్టు దగ్గర్నుంచి చిన్న ప్రక్కదారి వస్తుంది. అరమైలు దూరంలో కనిపించే గుట్టదాటి వెడితే అక్కడో కుగ్రామం, రామాలయం వున్నాయి

"ఆ రామాలయానికివెళ్ళి దర్శనం చేసుకుందామోయ్" అని మూపమ్మ అన్నదంటే ఎవరైనా నమ్ముతారు. తనలా చెప్పలేదనడానికి మూపమ్మ వుంటేగా!

అవును ఆ గుట్ట దాటాక వుండేది మూపమ్మ దేహం మాత్రమే

ఆ గుట్టదగ్గర తన మిత్రులు తప్ప వేరే ఎవరూ వుండరు వాళ్ళు హఠాత్తుగా వచ్చి కారును అడ్డగిస్తారు విధిలేక కారు ఆగుతుంది ఇద్దరూ కారులోపలికి చొచ్చుకు వస్తుంటే ముసిల్ది కేకలు పెడుతుంది. ఒకడు గొంతు నులుముతాడు. రామన్ ఇంకొకడితో పోరాడుతాడు రామన్ కాళ్ళకు, చేతులకూ నాల్గారు కత్తిపోట్లు తగుల్తాయి అదేమంత పెద్ద విషయం కాదు ఓ క్ష

కోవాలి తరువాత వాడి నోట్లో గుడ్డలు కుక్కుతారు చేతులు, కాళ్ళు కట్టేస్తారు. ఒక పక్కకు లాగేనరికి ముసలిదాని పని పూర్తయుంటుంది ఆ మిత్రులు ముసలిదాని వంటిమీద వున్న నగలను, నంచినీ తీసుకుని మాయమైపోతారు

వాళ్ళుండే చోటు, విలాసం అన్నీ తెలుసు రామన్‌కు మిత్రులు ఈసారి దొరికినదాంట్లో ముప్పాతిక భాగం రామన్‌కు ఇస్తారు భలే కిలాడీ హంతకులు - రామన్ అడిగినప్పుడు కొద్ది కొద్దిగా పంపిస్తుంటారు రామన్ వాళ్ళని నమ్మాడు ఇలా ఎంతో సంపాదించారు వాళ్ళు - అపురూపంగా దొరికిన స్నేహితుణ్ణి మోసం చెయ్యరు అలా ఎవర్నో ఒకర్ని నమ్మకపోతే బ్రతుకులు పైకి వచ్చేదెలా ? సంశయాత్మా వినశ్యతి

ఇలా హత్యచేయబడాలని మూపమ్మ నుదుట వ్రాశాడేమో ఆ గురువాయూరప్ప ! పాపం ముసలిది బ్రతికినా ఇంకెన్నేళ్లు బ్రతుకుతుంది ? జబ్బుతో మంచానపడ్డ మొగుడు చచ్చేదాకా ముసలిదెందుకు బ్రతికుండడం సుమంగళిగా పోతోంది పుణ్యం చేసుకుంది

గొడవ తా సద్దుమణిగాక "దేవత లాంటి మూపమ్మ పోయాక నాకు బ్రతుకే వద్దనిపిస్తోంది ." అంటూ విరాగిలా పరధ్యానంగా కొన్నాళ్లుంటే, ఉపాయంగా ఆ యింట్లోంచి జారుకోవచ్చు ఆ తరువాత ఏ మద్రాసో, బొంబాయో వెళ్ళిపోయి, దర్జాగా క్రొత్త బ్రతుకు ప్రారంభించవచ్చు

రామన్ చేతిలో స్టీరింగ్‌తోపాటుగా మనసులో ఆలోచనా చక్రం తిరుగుతోంది కారు కుట్టికోడు దాటి ఒక మైలు వెళ్ళాక

అరె ! ఎవరా కుర్రాడు ? !

సుమారు పన్నెండేళ్లుంటాయి పల్లెటూరి కుర్రాడు తుండుగుడ్డ చుట్టుకున్నాడు పొట్టిచేతుల చొక్కా తొడుక్కున్నాడు జుట్టు చెదిరిపోయింది ఏడుపుమొహం ఏడుస్తూ కారుకు అడ్డంగా పరుగెత్తుకొచ్చాడు చెయ్యి వూపుతూ "ఆపండి ఆపండి !" అని అరిచాడు కీచుగొంతుకతో

కారు ఆపక తప్పలేదు

కారు ఆగగానే ఆ కుర్రాడు వెనక సీటులో కూర్చున్న మూపమ్మ దగ్గరికి పరుగెత్తి "కోళికోడు కేగా, నన్నూ కూర్చుబెట్టుకోండమ్మా. అక్కడ మా అమ్మకు ప్రాణంమీద కొచ్చిందట. తంత వచ్చింది చేతిలో నయాపైస లేదు కోళికోడులో దింపెయ్యండి నన్ను మీకు పుణ్యముంటుంది " అంటూ మనసు కరిగేలా వేడుకోసాగాడు

"పోరా బయటికి - కూర్చోబెట్టుకుంటారు ఈ ముష్టివాడిని ! కారు వదులు శనీ !" అని అరిచాడు డ్రైవర్-

మూపమ్మ "ఫరవాలేదు కూర్చోని పోనిం", అంది

మరుక్షణంలో కుర్రవాడు ముందు వేపు తలుపు తెరుచుకుని రామన్ ప్రక్కన కూర్చున్నాడు.

ఇదెక్కడి శని దాపురించింది ? పల్లె కొరికాడు రామన్ ఒక్కసారి ఓరగా కుర్రాడివేపు చూశాడు గుద్దుకు చస్తాడు తనొక్కడు చాలు వీడికి అనుకున్నాడు.

కారు పరిగెడుతుండగా ఆ కుర్రాడు వెనుదిరిగి మూపమ్మతో తన సంగతి వివరించాడు

"నేను గురువాయూరు దేవస్థానంలో చిన్న చిన్న పనులు చేస్తుంటాను కోళికోడు కేశంపీధిలో మా అమ్మ వుంది. జబ్బుగా వుందని తంతి వచ్చింది చేతిలో డబ్బులేదు నడిచే వెడదాం అని బయలేరాను నిన్న వచ్చాను కుట్టికోడుకు కాళ్ళు నొప్పులు పుట్టాయి ఎవరూ సాయం చెయ్యలేదు మీరు చేశారు నేను వెళ్ళే సరికి అమ్మకి బాగుంటే అంతే చాలు"

"మీ అమ్మకేం ఫరవాలేదు వేశం పీధి ప్రక్కగానే వెడుతుంది కారు. అక్కడ నిన్ను దింపేస్తాంలే." అంది మూపమ్మ

రామన్ ఎదురు చూస్తున్న ఒత్తుగా వున్న కొమ్మలుండే గోళీ చెట్టు, దాని పక్కనున్న సన్నది దాం సబు పించాయి

రామన్ అటువేపు కారు తిప్పాడో లేదో ఆ కుర్రాడు కెవ్వుమని అరిచాడు. అయ్యయ్యో ! అదెందుకు తిప్పుతాను ! వద్దు బాబోయ్" అని గోలచేశాడు

"రామన్ గబుక్కున బ్రేక్‌వేసి, ఎందుకురా అలా అరుస్తావ్ శనిగాడా !" అని కసురుకున్నాడు

"అవునూ, ఇటెందుకు తిప్పుతున్నావ్ కారుని" మూపమ్మ అడిగింది,

ఏంలేదమ్మా . ఆ గుట్ట వెనక కోళంకట్టి రామాలయ క్షేత్రముంది కదా ! దేముడి దర్శనం చేసుకుని "

"వద్దు, వద్దు. ఇప్పుడు దేవాలయం తెరచి వెండదు ఉత్సవ కాలంలోనే అదిక్షేత్రం ఎంబ్రాద్రిస్వామి ఉదయం పూజచేసి వెళ్ళిపోతే మళ్ళీ రావడం రాత్రికే. ఇప్పుడక్కడ మంచినీళ్ళు కూడా దొరకవ్" అన్నాడా కుర్రాడు

"తెరవకపోతే మానె దేవాలయానికో ప్రదక్షిణచేసి అటునుండి అటే హైరోడ్‌కి వెళ్లొచ్చు. దగ్గర దారి" అంటూ రామన్ బ్రేక్‌నుండి కాలు తీయబోయాడు

"అయ్యొయో వద్దు లాబోయ్ ! వద్దు అది చుట్టుదారి ఆ గుట్టదగ్గిర దొంగలుంటారెప్పుడూ నాల్గురోజుల క్రిందట ఒకామె మెడలో బంగార మంతా కాజేశారట శవం దిక్కు

లేకుండా పడుందట అక్కడే." ఇలా అంటూ ఆ కుర్రాడు క్రిందికి దూకి కారుముందు ఆ త్రోవకు అడ్డుగా నుంచున్నాడు అతని మాటలూ, ఏడుపు గొంతుకా రామన్‌కి దిగ్భ్రమ కలిగించాయి

అతని మాటలూ. అరుపులూ విని హైరోడ్‌లో చాలామంది 'ఏమిటి సంగతి ?' అంటూ దగ్గరకొచ్చారు

వాళ్ళు కూడా కుర్రాడి మాటలని సమర్థించారు అది దగ్గర త్రోవ అన్న రామన్ మాటలకు నవ్వేశారు-అతనికేం తెలియదన్నట్లుగా

"సరేనయ్యా, రామన్ ! అడ్డ త్రోవలూ వద్దు, దేవాలయమూ వద్దు తిన్నగా వున్న దారిలోనే కారును పోనివ్వు చాలు." అని మూపమ్మ ఆజ్ఞాపించింది

కుర్రాడు చప్పున కారు ఎక్కి కూర్చున్నాడు. చేసేది లేక రామన్ లోలోపలే పళ్ళు కొరికాడు పైపైన మాత్రం "అదే, అదే అప్పుడే అన్నానా ఈ కుర్రాణ్ణి ఎక్కించద్దని వీడెవడు ఇంత గొడవ చెయ్యటానికి అని గొణుక్కున్నాడు

కారు హైరోడ్‌లో సరైన దారిలోనే పోతోంది చేతికి వచ్చింది నోటికి రాలేదు - ఒక్క నంబరుతో లాటరీ తప్పిపోయినట్లు ఆ ఒక్క నంబరు సరిచేస్తే ! ఇవన్నీ రామన్ మనసులోని ఆలోచనలు కాని ఇలాటి పనిచేసిన అలవాటు ఎక్కడిదతనికి ? మనసులో అనుకుంటే అయిందా ? చేతులకి అలవా టుండద్దూ

కారు సరాసరి కోళిక్కోడు వేడుతోంది

ఆ మిత్రులు గుట్ట వెనుక కాచుకు నుంటాదు

తనను గురించి ఏమనుకుంటారు ? నమ్మించి ద్రోహంచేశానని పళ్ళు .. కాదు కత్తులు నూరుతుంటారు ఆ ద్వేషంతో కోళిక్కోడు వచ్చి తనను ఏం చేసినా చేస్తారు వాళ్ళు నమ్మేలా చెప్పట మెలా ఈ కుర్రాడి గొడవ ?

ఒక్కడు - కుర్రాడు ఒక్క ముసలిది వీళ్ళిద్దరినీ లేరనిపించడానికి చేతకాని తనూ

ఆలోచనల్లోపడి కారు పక్కదారి పడుతుంటే ఆ కుర్రాడు 'హోహో హోహో' అని అరుస్తాడు.

"ఊరుకోరా శనిగా" రామన్ గసురుతాడు

"చూసుకుంటూ నడపవయ్యా నీకు ఒంట్లో బాగున్నట్లు లేదు " అని రెండు మార్లు హెచ్చరించింది మూపమ్మ.

ఆ కుర్రాడే సరియైన దారిలో నడుపు తున్నట్టున్నాడు. డ్రైవర్ కేవలం ఎద్దులా పోతున్నట్టున్నాడు

కోపం, నిరాశ .. మోసపోయా

మనుకున్న మిత్రులు ఏంచేస్తారోనన్న భయం

అయినా రామన్ సరైన త్రోవలోనే కారు పోనిస్తున్నాడు హైరోడ్ కనుక దారిపొడుగునా చిన్న చిన్న పల్లెలు, వచ్చే పోయే మనుషులూ వుంటూనే వున్నారు వాహనాలు సైకిళ్ళూ ఏదో ఒకటి నిర్జనమైన వీధి కాస్తకూడా రావడంలేదు ఏ కాస్త నిర్జనమైన ప్రదేశం వచ్చినా ఈ పాడు కుర్రాడినీ ముసలిదాన్ని తనే లేదనిపించి ఏమయినా చెయ్యొచ్చు

ఆ పని చెయ్యగలడా తను ? ఉహూఁ, అలవాటులేని పనికి చేతులు రావు, మనసు కలవరిస్తోందంతే

అదృష్టవశాత్తు కోళిక్కోడు వచ్చే దాకా అలాటి నిర్జన ప్రదేశం రానూ లేదు

నగరం దాటి కేరళంవీధి రాగానే కుర్రాడు "మా అమ్మ ఉండేది ఇక్కడే" అనగానే రామన్ కారు ఆపాడు మరుక్షణమే "అమ్మకి ఎలా ఉందో" అంటూ కారు దిగి పరుగు తీశాడు

పాడు పిల్లాడు అని గొణిగాడు రామన్

చిన్న కుర్రాడు అమ్మను గురించి బెంగపెట్టుకున్నాడేమో మూపమ్మ చిరునవ్వు నవ్వి 'మా యింటికి ఒకసారి రా బాబూ' అన్న మాట అతనికి వినిపించిందో లేదో

"మంచి కుర్రాడు" అనుకుంది తనలో తనే

ఇల్లు చేరగానే ఆ కుర్రాడే తనను క్షేమంగా ఇంటికి చేర్చినట్టనిపించి 'గురువాయూరప్ప నన్ను కాపాడాడు మరువలేదు' అనుకుంటూ మూపమ్మ కారు దిగి ఇంట్లోకి వెడుతుంటే ధన లక్ష్మి నిండివ సంచీని తీసుకుని రామన్ ఆమె వెంట ఇంట్లోకి నడిచాడు

ఆ కుర్రాడు మళ్ళీ కనిపించనేలేదు.







# మేం చేసిన తప్పు మీరూ చేస్తారా?

అవసరాల రామకృష్ణారావు

(గత సంచిక తరువాయి)

## 10

తను పెట్టుకొన్న గడువు దగ్గిర అవుతున్నకొద్దీ, తను కూడబెడదామన్న మొత్తం సొమ్ము పూర్తి అవుతున్నకొద్దీ, యాలిస్ మరింత చురుకుగా ఉత్సాహంగా రోజులు గడపజొచ్చింది

'అతను లక్షాధికారి అని ముందే తెలుసు నీకు నువ్వెన్నేళ్లు ఎన్నివేలు కూడబెడితే అతన్తో పోటీకి రాగలవు?'

అనే ఆలోచన అనేకసార్లు ఆమెని నిలదియ్యకపోలేదు. ఇదే సందేహం తన కేసు గురించి మొట్టమొదట్నుంచీ శ్రద్ధ చూపిస్తున్న రాఘవయ్యగారి దగ్గిర వెలిబుచ్చింది

''అదేమిటమ్మా ఎప్పుడూ డబ్బున్నవైపే తీర్పు జరిగితే యిక న్యాయమేమిటి? అన్యాయమేమిటి? నాకు తెలిసిన ఓ కేసులో మొగుడితో సంబంధం పెట్టుకున్నదనే అసూయతో ఓ జమీందారిణి ఓ సెక్రటరీని హత్య చేయించింది ఆఖరికి ఏమయింది, ఆవిడ తప్పించుకోగలిగిందా, ఎంత డబ్బున్నదైనా చేసిన పాపానికి ఆమెకి శిక్ష తప్పలేదే.''

అన్నాడు ఆయన

''అయితే వెంటనే ప్రొసీడ్ అవక యీ అయిదువేలూ మాత్రం ఎందుకు?''

అనే మరో సందేహానికి కూడా అక్కడే జవాబు దొరికింది

'చూడమ్మా, కేసు ఏ విధంగా చూసినా చాలా కాంప్లికేటెడ్‌గా ఉంది అవతల వాళ్ల అన్నిటికీ తెగించినవాళ్లు పైగా బ్రతుకులో స్థిరపడ్డవాళ్లూ దేని కయినా వెనుదీయని వాళ్లను నువ్వా ఊరూ పేరూ లేని అమాయకురాలివి. ఇక కోర్టు అన్నాక అనేక ఖర్చు లుంటాయి ఓసారి దిగేక ఇక వెనకంజ వేస్తే లాభంలేదు ఫీజులుంటాయి రివాజులుంటాయి, ఎందుకనైనా అడ క్కుండా ఎంతైనా జమకట్టెయ్యవలసి వస్తూంటుంది అప్పుడప్పుడు-కాబట్టి కనీసం ఆ మాత్రమైనా లేకపోతే ఎలాగూ?''

ఈ కోర్టు గొడవ లేమిటో కొంత రాఘవయ్యగారు బోధపరచకపోలేదు గాని తనకేం తలకెక్కడంలేదు. తనకి తెలిసింది ఒక్కటే బాబుకి తను తల్లి పుట్టుకతో తను బాబుకి తల్లిగా హక్కు తెచ్చుకున్నది బాబు వయసుతో ఆ హక్కు పెరుగుతోందేగాని తరగడం లేదు తల్లినీ పిల్లనీ వేరుచేస్తే ఏ న్యాయ శాస్త్రమేనా ఒప్పుకుంటుందా? పైగా ఎప్పుడో వివాహితుడైన మదన్ తనని తల్లిని చేసి, అలాగైనా మిగలనివ్వ కుండా, తనకి మత్తుమందిచ్చి తన పిల్లాణ్ణి తీసుకుంటాడా! ఇంత అన్యాయం జరుగుతూ ఉంటే ఇందరు న్యాయమూర్తులుండి ఊరుకుంటారా? తన పిల్లాడు తనకి కాకుండా పోతాడని కలలో అయినా అనుకోలేదు, యాలిన్ ఎటోచ్చీ ఇన్నాళ్లు వేచి ఉండడం తల్లికి కష్టమే, కాని చేసేదేముంది!

ఏవో కోర్టు కాగితాలు కొనాలంటే, ఆ మధ్య అయిదువందలు రాఘవయ్య గారికిచ్చింది మరొకసారి దేనికో రెండు వందలు కావాలంటే ఇచ్చింది. ఈ లీగల్ పాయింట్సు ఏమిటో తనకేం తెలిసిచస్తాయి!

విజయవాడనుంచి వచ్చిన ఇన్ఫ ర్మేషన్ ఎంతో ఆత్రతతో ఎన్నో సార్లు చదువుకుంది యాలిన్ తనతో ఆ ఊరి స్కూల్లో పనిచేసే జానకికి విజ వాడ ట్రాన్స్ఫరయింది ఆమెనురిక్వెస్టు చెయ్యగా చెయ్యగా ఆ ఇన్ఫర్మేషన్ పంపింది-ఆలశ్యం చేస్తేనేం చాలా వివ రాలే ఇచ్చింది అన్నీ పాపం జానకి సరిగ్గానే కనుక్కుంది. విశాలాంధ్ర ఆటోమొబయిల్స్ ప్రొప్రయిటర్ పేరు మదన్ గోపాలస్వామేట చాలా మంచి వాడని అందరూ చెప్పేరుట! వాళ్ల గుంటూరు వెళ్లే రోడ్డులో కొత్త సినిమా హాలుకి నూరు గజాల దూరంలో రాస విహార్ అనే పెద్ద బంగళాలో ఉంటున్నా రుట అతనికి ఒక్కడే కొడుకు గీతా కాన్వెంట్‌లో ఒకటో క్లాసు చదువు తున్నాడు పేరు వేణుగోపాల్.

యాలిన్ గుండె దడదడ కొట్టు కుంది కళ్లు చెమర్చాయి

వేణుగోపాల్ ! ఎంత చక్కని పేరు!

'అయ్యో! ఎలాగానైనా నా బాబు ఫోటో అయినా పంపమన్నానుగాను, జానకిని! ఎలా ఉన్నాడో! ఎప్పుడు చూస్తానో !'

ఎడ్రసు తెలిశాక ఇక అయిదు నిము షాలు ఆగబుద్ధి పుట్టలేదు యాలిన్‌కి వెంటనే విజయవాడ రైలెక్కితే ! పోనీ రాసవిహార్ కి కాకపోతే గీతా కాన్వెంట్ కి వెళ్లి బాబుని చూసి వస్తే!

ఎన్ని పగళ్లు, ఎన్ని రాత్రులు— ఎన్నెన్ని దీర్ఘరాత్రులు పూర్తి అయితే ఒక నెల అవును ! అలాంటి ఎన్ని నెలలు కలిపితే ఒక ఏడాది! అలాంటివి ఒకటా రెండా అయిదేళ్లు ' బాబూ, ఇంకెన్నాళ్లు గడపను ! నిన్ను చూడకుండా ఇంకె న్నాళ్లు ఎలా, ఎలా భరించను !!

వెంటనే రాఘవయ్య దగ్గిరకి పరి గెత్తి తన ఉద్దేశం చెప్పింది

"అయ్యో! వెర్రితల్లీ! ఇన్నాళ్లూ కష్ట పడి వేచి ఉన్నది ఇప్పుడు చేజేతులా కాచినపాలు పారబోసుకోడానికా ! నువ్వి లాంటి ప్రయత్నం చేస్తున్నావని తెలిస్తే వాళ్లు నిన్ను ప్రాణాలతో వదిలిపెడ తారా ? ఇలాంటివాళ్లకి అట్నించి నరు క్కొచ్చి, సమయం చూసి, కళ్లు మూసుకుని ఉన్నప్పుడు కాటు వెయ్యాలి. నేనంతా నడిపిస్తున్నాను గదా, నీకెందుకూ ? నువ్వు చెప్పేవే పరిమళ అని, ఆ అమ్మాయి సాక్షం చెప్పడానికి వెయ్యి రూపాయిలు అడుగు తోంది తగ్గేటట్టులేదు డబ్బు సిద్ధం చేసి తెస్తావా? ఎంత బోధపరిచినా రసీదు మాత్రం ఇవ్వలేనన్నది''

యాలిన్‌కి మొదటిసారిగా చిన్న అనుమానంలాంటిది కలిగింది ఈ మూడు నెలల్నుంచీ రాఘవయ్యగారు ఆ స్తమానూ ఒడికేస్తున్నాడు, ఏదీ ఇద మిద్ధమని తేల్చడు. దేనికీ వివరాలు ఇవ్వడు ఆఖరికి ఇతను కూడా, తనని మోసంచెయ్యడంలేదు గదా !

ఆమె ఏమీ మాట్లాడకపోడం అతనికి చిరాకెత్తిచ్చింది

"చూడమ్మా, అనాధవయిన నీకు అంతులేని అన్యాయం జరిగిందనే జాలి తోటే మొట్టమొదట్నుంచీ ఇందులో నేను తలదూర్చేనుగాని నాకేం ఒరుగు తుందని కాదు ఇంతకీ కొండతో పొట్టేలు డీకొట్టడం లాంటిది నీ వ్యవ హారం నేనేదో తినేస్తున్నాననుకుంటే నువ్వింక రావడం అనవసరం నువ్విచ్చిన డబ్బు ఎలా ఇచ్చింది అలా తిరిగి ఇవ్వ గలను నా పద్ధతిలో, మొదట మాటా, తర్వాత ప్రాణమున్నూ !''

తను ఏమీ మాట్లాడకుండానే రాఘ వయ్య ఇలా మాట్లాడ్డం యాలిన్ అను మానాన్ని హెచ్చించిందే గాని తగ్గించ

లేదు. అయినా ఆమె ఆ అనుమానాన్ని బయటపెట్టి దల్చుకోలేదు

"నేనేమీ అనందే మీరలా బాధపడతా రెందుకు బాబాయిగారూ. తండ్రిలాంటి వారు, మిమ్మల్ని కాదని నేనెక్కడికి పోయేది! ఇవాళ శలవయిపోయింది రేపిపాటకి వెయ్యో తెచ్చి జమకట్టనా!"

అని నేర్పుగా సర్దిచెప్పి అక్కణ్ణుంచి బయటపడింది అక్కణ్ణుంచి కిరణ్ దగ్గిరకి వెడదామా అనుకుంది యాలిస్ ఈ ఆలోచన ఆమెకిదివరకే ఎన్నో సార్లు రాకపోలేదు. కిరణ్ దగ్గిరకి వెడితే అక్కడితో ఆగదు. ప్రభుదాసు ప్రసక్తి వస్తుంది

వద్దు ఆ ఆలోచనలు వద్దు, ఆ ఆకర్షణలూ వద్దు

తన బాబుని తననుంచి దూరం చేసే ఏ శక్తులూ, అవి చెడ్డవైనా అఖరికి మంచివైనా తనకొద్దు తనమటుకు తను తన వేణుగోపాల్‌ని తెచ్చుకోగలిగితే చాలు

కాని... ఈ పాడు లోకంలో... ఈ దిక్కుమాలిన సంఘంలో... తన లాంటి అనాధ, వంచిత ఒంటిగా ఏం చెయ్యగలదు!

ఆమెకు దయామయి గుర్తొచ్చింది

తనని రక్షించింది. ఆదరించింది. రక్షణ కల్పించింది ఆసలు ఆమెకు తెలియకుండా తను ఏదీ దాచడమే తప్పు ఏదైనా చెయ్యడమే తప్పు ఈ మధ్య ఓ వారంరోజులుగా తన గొడవలో పడి ఆమెను పట్టించుకోవడమే లేదు చూడ్డమే పడలేదు ఏమో గాని ఆమె కూడా తనని చూడానికి తన కాలేజీకి రావడంలేదు ఏమో, ఎందు చేతో!

దయామయి ద్వారా కృపానంద్‌ని కలుసుకుంటే సరి రాఘవయ్య ప్రవర్తన వాళ్ళతో చెప్పి ఏంచెయ్యాలో సలహా తీసుకుంటే సరి. రాఘవయ్య విషయంలో ఒకవేళ తనే అనవసరంగా శంకిస్తోందేమో! తను కృపానంద్ నుంచి కూడా ఎన్నో విషయాలు దాచింది తనకి లెక్కలు చెప్పి పరీక్ష ప్యాసుచేయించినవాడు ట్రెయినింగ్‌కి సీటు తెప్పించినవాడు టీచరు ఉద్యోగం ఇప్పించినవాడు ఇన్ని చేసినా తన కాలేజీకి వచ్చి కలుపుగోరుగా మాట్లాడితే ఏనాడూ ఆయన్ని కాన్ఫిడెన్సులోకి తీసుకోలేకపోయింది నోరారా పలకరించలేకపోయింది కష్టం సుఖం చెప్పుకోలేకపోయింది.

వాళ్ళందరూ కలసి తనకి సహాయం చేద్దామని ఎన్నోసార్లు ప్రయత్నిస్తే 'మీకూ మీ సహాయానికి ఓ నమస్కారం నా బతుకు నన్ను బతకనివ్వండి' అని వాళ్ళని తిప్పికొట్టింది. ముక్కూ మొహం ఎరగని ఓ ప్లీడరుకి కొంత సొమ్ము ముట్టజెప్పి పనిచేయించు

కోవాలని చూసింది. తన కాళ్లమీద తను నిలవాలనుకోడం ఆత్మవిశ్వాసం కావొచ్చు, తనని ప్రేమించి, సహాయం చేస్తామని సిద్ధపడేవాళ్లని తిరస్కరించడం అహంకారం అనిపించుకోదా!

యాలిన్ పరుగు పరుగున ఇల్లు చేరింది. తన కాలేజ్ దగ్గిర కూడా క్షణంసేపు ఆగలేదు తిన్నగా మెయిన్ బిల్డింగ్ వైపు పరుగు తీసింది

'ఎక్కడికి వెళిపోయేవమ్మా '' అని గుమ్మంలోనే నిలదీసింది మరియమ్మ ఆశ్చర్యంగా అక్కడే నిలబడిపోయింది యాలిన్

'నీతో చెప్పి వెళదామని గంటల కొద్దీ చూసింది పెద్దమ్మగారు అసలు నేను కూడా వచ్చేస్తానన్నాను నీతో చెప్పి మరీ రమ్మని బలవంతాన నన్ను ఆపింది ''

''ఎక్కడికి వెళ్లడం ?''

''బాగుంది, నువ్వేమో నీ లోక మేమో... ఇక్కడ ఏం జరుగుతూందో నువ్వు పట్టించుకుందేగా ?''

'అవన్నీ ఇప్పుడెందుకు, ఏం జరిగిందో త్వరగా చెప్పు మరియమ్మా!'

'ఈ మధ్య కృపానంద్ ఒంట్లో ఏమీ బాగుండడం లేదుట ఎప్పుడూ అతనిది అంతపాటి ఆరోగ్యమే. ఇదిగాక మానసికంగా కూడా అతనికి ఆందోళన కలిగించే విషయ మొకటి జరిగింది తన బ్రాంచి ఆఫీసుకు దగ్గిరగా ఇల్లొకటి మాట్లాడుకుని అక్కడికి తనూ పిల్లలూ మొగుడూ వేరే వెళ్లిపోతామని పట్టు పట్టిందిట ప్రశాంతి

కాపరానికి ముందునుంచే ఉద్యోగం చేస్తున్నది కనుక ఆమె చేతిమీదుగా ఇంతకూడు మొగాళ్లకు దక్కుతుందని ఆయింట్లో ఎవరూ ఎప్పుడూ అనుకున్నదిలేదు కృపానంద్‌కి పిల్లలతో బాగా అలవాటైపోయిందిట. స్కూల్నుంచి రాగానే ఓ గంటయినా వాళ్లతో ఆడుకోందే అతనికి తోచదు. ఉన్నట్టుండి ఆ ఎడబాటు ఎలా భరించడమో అతనికి అర్థంకాలేదు వెళ్లిపోవద్దని ఎన్నివిధాల చెప్పినా ప్రశాంతి వినలేదు

'పోనీ మా స్కూలుకి దూరమైతే అవుతుంది, అంతేకదా! పాతదో డొక్కుదో నాకూ కారు ఒకటుంది కదా! ఇక సరే సరి ప్రభుదాసుకి స్కూటరు ఉండనే ఉంది మేమూ అక్కడికే వచ్చేస్తాంరా శామ్యూల్'' అన్నాడుట.

''అలాగే - ఇప్పుడు నేను చూసిన యిల్లు ఇందరికి సరిపడదు మేం పెద్ద యిల్లు చూసి కబురంపినప్పుడు తప్పకుండా వద్దురుగాని''

అని సామానులు బయటపెట్టిస్తూ స్పష్టంగా చెప్పిందిట ప్రశాంతి

''తల్లీతండ్రీ, అత్తా మామా ఇలాంటి వాళ్లనే భరించలేకపోతున్నారు ఇప్పటి

యువ దంపతులు ఇక మీరు మాకెలాంటి చుట్టం ?'

అన్నా ఇంకా బాగుండేదని దయా మయితో చెప్పి దుఃఖపడ్డాడుట

'మా చెల్లెలు పోతే, దాని మొగుడు ఎవరితోనో పోయి యీ ఇద్దర్నీ వీధి లోకి వదిలేస్తే, ఇంతప్పట్నుంచీ పెంచి పెద్దచేశాను ఇంట్లో ఉండి అన్నీ విని ఆ శ్యామ్యూల్‌గాడైనా ఒక్కమాట మాట్లాడకపోవడం నాకు మరీ కష్టంగా ఉంది దయా !'

అన్నాట్ట కళ్ల నీళ్లు పెట్టుకుని

"ఎన్నెన్నిసార్లు ఎదురుదెబ్బలు తిన్నా మనిషి అనేవాడు చచ్చేదాకా అలా మమతలు పెంచుకుంటూనే ఉంటాడు చిన్నప్పట్నుంచీ ఎదురెదురు ఇళ్లల్లో ఉండేవాళ్ళం నువ్వుమాత్రం నన్నేం ఉద్ధరించావు గనకనా, నీతో చెప్పుకోవడమేమిటి, నాకు సిగ్గులేక గాని !"

అని కూడా అనేవాడుట !

మరియమ్మద్వారా యీ ఆఖరి మాట విని నోటమాటలేకుండా ఉండిపోయింది యాలిస్ కృపానంద్‌కీ దయామయికీ ఏ మాట అయినా అరమరికలులేకుండా హాస్యమాడుకోడానికి తగినంత చనువు ఉందని మాత్రమే తనకి తెలుసు తనకి తెలియంది కూడా ఉందా, ఇన్నేళ్ళయి ఉండికూడా తనీ ముఖ్యవిషయం పసి గట్టలేకపోయిందా ?

"మరియమ్మా పేరుకి వండిపెడు తున్నావుగాని – నువ్వు మా మదర్‌కి ఏ వినతల్లిలాంటిదానివో ! ఇక నేనా, దయామయి కూతురు మెర్సీలాంటి దాన్ని ... నీకు యీ యింట్లో తెలీని రహస్యాలంటూ లేవు నీకు అభ్యంతరం లేకపోతే తప్పకుండా చెప్పు నువ్వింం దాక అన్నట్టు నా గొడవలో నేను పడి ఇతరులపట్ల యిప్పటికి చూపిన అశ్రద్ధ చాలు'' అని అడక్కుండా ఉండలేక పోయింది

"నేను వెళ్లానమ్మా, ఆ బాబుకి ఎలా ఉందో, యిప్పుడివన్నీ నీతో చెబుతూ కూచుంటే ఎలాగ !" అని విసుక్కుంటూనే మరియమ్మ ఒకటీ ఒకటీ తను ఊహించని విషయాలు బయటపెట్టింది

మొట్టమొదట్నుంచీ కృపానంద్, దయామయీ చాలా స్నేహంగా ఉండే వారుట దయామయికి ఇంకా ఎలాంటి భావమూ ఏర్పడలేదుగాని ఆమెకంటె ఎనిమిదేళ్ళు పెద్దయిన కృపానంద్ మాత్రం ఆమెను చేసుకుందామని మొద ట్నుంచీ కలలు కన్నాడుట అతను బియ్యే చదువుతూంటే ఆమె మెట్రిక్ చదివేదిట, చదువు పూర్తి అయి, ట్రెయినింగ్ కూడా అవందే, ఉద్యోగం దొరకందే పెళ్ళిచేసుకోడం అతనికి యిష్టంలేదు దయామయి అతనికి కాకుండా పోతుందని కలలో కూడా

అనుకోలేదు గనక ఆ విషయమే బయట పెట్టలేదు.

తీరా అతనికి ఉద్యోగమై శలవల్లో యింటికి వచ్చేసరికి ఆమె నర్స్ ట్రెయినింగ్ పూర్తిచేసుకుని ఒక ప్రైవేటు హాస్పటల్‌లో నర్సుగా చేరడం సహా జరిగిందని విన్నాడు. ఇంకో ఆరునెలలు దాటకుండానే అసిస్టెంటు సర్జెన్ జేమ్సుతో ఆమెకు వివాహం కూడా జరిగిందని అతను ఆ చెవులతోనే వినవలసివచ్చింది !

నెలలపాటు పిచ్చివాడిలా తిరిగేడు. తిన్నప్పుడు తినేవాడు, లేకపోతే లేదు. ఉన్న ఉద్యోగాన్ని రిజైన్ చేసేసి మతిపోయినవాడిలా తయారయ్యాడు ఏడాది గడిచేసరికి మళ్ళీ ఎలాగో మెల్లి మెల్లిగా మనుషుల్లో పడ్డాడు ఎవర్నో పట్టుకుని ఎలాగో మళ్ళీ ఉద్యోగం సంపాదించాడుగాని - అతనికి పెళ్ళి చెయ్యడం మాత్రం ఎవరితరమూ అయిందికాదు ఇంకో రెండేళ్లకి ఉన్న ఒకే ఒక చెల్లెలూ చచ్చిపోయింది. అప్పట్నుంచి ఆ మేనల్లుళ్ళని పెట్టుకుని అలా మొరడులా బతుకుతున్నాడు

భర్తనీ, కుమార్తెనీ ఒకేసారి పోగొట్టుకున్న నిర్భాగ్యురాలు దయామయి నర్స్‌గా అక్కడ ఉండలేక మత బోధకురాలుగా స్థిరపడిన ఊరిలోనే - మరొక క్రిష్టియన్ స్కూలికి హెడ్మాస్టరుగా వచ్చాడు కృపానంద్.

వాళ్ళిద్దరూ మళ్ళీ కలుసుకున్న నెలా నెల పదిహేనురోజులకి దయామయి ఓసారి అందిట

"చూడు మరియమ్మా - ఈ ఆనంద్‌కి ఏమైనా బుద్ధుందా ? కూడా మేనల్లుళ్ళు ఉన్నారు ఈ వయసులో అతను అనవలసిన మాటేనా యిది ?''

మరియమ్మ తెల్లబోయి చూసిందిట

"తనేమో పిల్లలకి సత్ప్రవర్తన బోధించే ప్రధానోపాధ్యాయుడు నేనేమో ప్రమాణం తీసుకున్న మత ప్రవక్తని. ఈ సంగతి ఆ మాత్రం తెలియదంటావా అతనికి !"

''ఏమిటమ్మా ?'' అని బుర్ర గోక్కుంది మరియమ్మ.

''అబ్బ, నీకు చెప్పలేక చస్తున్నాను బాబూ ... ఈ నలభయ్యోపడిలోనే ఎప్పుడో చిన్నప్పుడు ప్రేమించిన దాన్నని నన్ను వెంట బెడుతున్నాడే, ఇక వయసులో ఎలా ఉండేవో అయ్యగారి అటలు !''

''ఇన్ని చెప్పేను నేనోమాట అంటాను, నువ్వేం అనుకోవు గద ?'' అంటూ మరియమ్మ యాలిస్‌తో ఇలా అంది :

'ఇరవై ఏళ్ళక్రిందట మళ్ళీ వాళ్ళిద్దరూ ఈ ఊళ్ళో కలుసుకున్నారు అప్పటికి పెద్దమ్మగారికి ఏ ముప్పై రెండో ఉంటుంది వయసు. అతనికి

దగ్గిర దగ్గిర నలభై ఉండొచ్చు. అప్పట్లో ఏ ఒక్కరికి తెగింపు ఉన్నా యిలా చూసి చూసి బతుకులు ఎండ బెట్టుకున్నవాళ్ళు అయి ఉండరు ''

''అంటే ?''

''ఇద్దరికీ ఒకరంటే ఒకరికి చెప్ప లేనంత అభిమానం రెండ్రోజులపాటు ఆ బాబు రాకపోతే నా చేత కబురంపే దాకా ఆ అమ్మకి తోచేదికాదు. ఇక యీావిడ ఒక్కరోజు ఇవతలికొచ్చి మాట్లాడకపోతే ఆ బాబు విలవిలలాడి పోయేవాడు ఏవో పైకి హాస్యపు కబుర్లు చెప్పేవాడుగాని అతనికి చొరవ లేదు. ఈ అమ్మ పైకి తెగ విసుక్కు నేదిగాని లోపల్లోపల ఎక్కడలేని ప్రేమాను ఏమైతేనేం ఏదో అడ్డు వచ్చింది చేజేతులా నాశనం చేసు కున్నారు ఇన్నేళ్లు గడిచాక ఇప్పుడేం మొత్తుకుంటే ఏం లాభం ?''

''పోనీ నువ్వేనా ఇద్దర్నీ కూర్చోబెట్టి నచ్చజెప్పకపోయావా మరియమ్మా !''

''నేనా !'' జవాబు చెప్పలేక ఓ పొడి నవ్వు నవ్వింది మరియమ్మ

కొంచెంసేపు ఆలోచించి అంది

''ఏమిటో ఇప్పుడు చూస్తే ఇలా అనిపించిందిగాని నిజం చెప్పొద్దూ, ఆ రోజుల్లో ఇద్దరూ నా దగ్గిరకొచ్చి 'మేం పెళ్ళిచేసుకోబోతున్నాం మరియమ్మా !' అనిగాని అని ఉంటే 'మీ కిద్దరికీ యిప్పుడు పెళ్లా - ఏమైనా మతుందా, పోయిందా ?'' అని నేనే మొట్టమొదట అడ్డుపెట్టి ఉండేదాన్ని ! అప్పుడు వాళ్లు అలాగే అనుకున్నారో ఏమో ! ఏదైనా చాలా అన్యాయం జరిగిపోయింది. ఇప్పు డేమనుకుంటే ఏం లాభం ! అప్పు డది తప్పు అనిపించింది ఇప్పుడు అలా చెయ్యకపోడమే తప్పు అని పిస్తోంది !''

యాలిస్‌లో ఎన్నో ఆలోచనలు రేకెత్తిస్తూ మరియమ్మ ఊరుకుంది

''ఇప్పుడు మీ కందరికీ క్రిస్మస్ శలవలుగా ! మనవలు లేని ఆ పెద్ద ఇంట్లో బావురుమంటూ ఉండలేక - కృపానంద్ బాబు వాళ్ల గ్రామం వెళ్ళేరు 'అసలే అతని ఆరోగ్యం బాగులేదు పైగా ఇంతటి దెబ్బతిన్నాడు ఒక్కడూ ఏమైపోతాడో' అంటూ అమ్మగారు కూడా పదిరోజుట స్పెషల్ లీవ్ తీసుకుని బయలుదేరింది నేను వెళ్ళొస్తాను యాలిస్, ఒక్కర్తివీ ఏం చెయ్యాలి ! మేం వచ్చేదాకా నౌకర్లు యిల్లు సరిగ్గా చూస్తున్నారో లేదో కొంచెం చూస్తూ ఉంటావుగా !''

అంటూ ఓ రిక్షా కేకేసి పెట్టే, పరుపు చుట్టా అందులో పెట్టించి, చూస్తూండ గానే కదిలిపోయింది మరియమ్మ

(సశేషం)




శారదని చంపెయ్యాలన్నంత కోపం వచ్చింది నాకు లేకపోతే దీనికెంత పొగరెక్కింది! ఎంత తెగించింది! నన్ను అంతలేసి మాటలు దాని జీవితంలో యెప్పుడైనా అని యెరుగునా అది!! ఇప్పుడెలా వచ్చింది దానికి తెగింపు?

"ఏదే! ఇంకోసారనా మాట"

గుండెలు భగ భగ మండిపోతూంటే కోపాన్నంతా కళ్లల్లో ప్రదర్శిస్తూ

అన్నాను చ(్రున తలెత్తి, ధీమాగా ధైర్యంగా నా ముఖంలోకి చూస్తూ అంది

"ఒక్కసారికాదు వందసార్లు అన మన్నా అంటాను ఏం నాకేం భయవా? నువ్వేవన్నా తాళిగట్టిన భర్తవా పెట్టి పోషిస్తున్న యజమానివా? నువ్వంటే నాకసహ్యం...అసహ్యం.. అస-"

'ఇక భరించలేకపోయాను నాలో సహనం చచ్చిపోయింది ఊరెగిరేలాగ అది అలాగ అంత ధైర్యంగా, మొండిగా అవమానకరంగా యిష్టమొచ్చినట్లు అరి చేస్తుంటే...నా మగతనం చంపుకొని పడివుండటం నా తరం కాలేదు

మంచం పందిరికి జార్లబడి నిల్చున్న దాన్ని జబ్బపట్టుకుని నా దగ్గరగా లాక్కున్నాను

"ఎంత మాటన్నావే..." అంటూ పళ్లు కొరుకుతూ, రెండుచేతుల్తో బలంగా దాని రెక్కలు వెనక్కి విరిచి పట్టు కున్నాను.

తలెగరేస్తూ నా ముఖంలోకి పొగ రుగా చూసింది

చుట్టూ కలియజూశాను చేతి కందు బాటులో ఏదీ కనిపించలేదు దాని రెండు రెక్కలూ ఒక చేత్తో గట్టిగా పట్టుకుని నా కోపాన్ని వెయ్యింతలు చేస్తున్న దాని ముఖాన్ని యింకో చేత్తో బలంగా నొక్కిపట్టి, మనిషి పశంగా బలంగా వెనక్కి విసిరాను

రివ్వున వెళ్ళి వుండచుట్టుకుపోయి పడింది మంచంమీద చాలా బలంగా రాక్షసుడిలా తోసెయ్యగలిగాను అని పించింది కసితీరినట్టుగా ఫీలయి ఊపిరి పీల్చుకున్నాను కాని అంత కోపంలోనూ దానికి దెబ్బ తగిలిందేమోనని యెందుకో భయంకలిగింది

అది మాత్రం కిక్కురుమనలేదు నా పౌరుషం పదింతలయింది

'ఎంత మొండిపీనుగ ఇది ! కొట్టినా కిక్కురుమనలేదు అనుకుంటూ ఒక్క వుదుటున మీద కెళ్ళాను

జుట్టుపట్టుకుని తలని పైకిఎత్తాను, ముఖం చేతులతో కప్పుకుని సన్నగా ఏడుస్తోంది శారద శారద...ఏడుస్తోంది శారద ఏడవడం నా జీవితంలో మొదటి సారి చూస్తున్నాను

అసంకల్పితంగానేవదిలేశానుజుట్టుని ఆవేశం చల్లబడుతోంది నెమ్మది నెమ్మ దిగా నేనుచేసిన తప్పు గుర్తొస్తోందినాకు

ఒక ఆడదాన్ని నా జీవితంలో మొట్టమొదటిసారిగా కొట్టాను నా శారదని కొట్టాను శారద యెవరు ? నే నెవర్ని? శారద నన్ను ఎందుకు ప్రేమించి తీరాలి? ప్రేమించకపోతే నేను కొట్టటమెందుకు ? కొట్టడానికి నా కెవరిచ్చారీ అధికారం? ఇదివరకెప్పుడూ శారదని కొట్టలేదే, కనీసం తిట్టలేదే ! కానీ శారదకూడా యిలా యెప్పుడూ ప్రవర్తించలేదే! ఈ రోజు మరెందుకింత అసహ్యం కలిగించేలాగ ప్రవర్తించింది?

అయితేమాత్రం నేను శారదని కొట్టెయ్యడమేః శారద వంటిమీద చెయ్యి చేసుకుంటానని నేను కలలోకూడా అనుకోలేదు. మా యిద్దరి మధ్యా యింత రగడ జరుగుతున్నా అత్తయ్యా, మామయ్యా గదిలోపలికెందుకు రానట్టుః శారదని నేనేమీ చెయ్యననే ధైర్యమా వాళ్లకిః నా మీద అంత నమ్మకం వుందా వాళ్లకిః ఎందుకులేదుః పూజ్యులైన అత్తయ్య, మామయ్యలమీద యిలాంటి అపనమ్మకం ఎందుకు నాకుః ఇందాక నేను తోసిన తోపుకి శారద ఏ గోడకో గుద్దుకుని, దానికి ఏ ప్రమాదమైనా సంభవించివుంటేః:ః కాపోయినా ఏదో చిన్నపిల్ల పొగరుగా మాట్లాడినంతలో - చిన్నపిల్లాః అది చిన్నపిల్లానిః: ఎంత మోసంః ఎంత దగాః ఎంత అన్యాయంః ...అయితేః పెళ్ళికాకముందే, ఆ వ్యక్తి మీద పూర్తి స్వాతంత్ర్యం లేకముందే వాళ్లింటికొచ్చి, వాళ్ళ యేకైక పుత్రిక గారాలపట్టి శారదని కొట్టెయ్యడమేః. మరి అదంతలా నోటికొచ్చినట్లు, నరం లేని నాలిక ఎలా తిరిగితే అలా వాగేస్తుంటే, నా గుండెల్ని పగులగొట్టి పిండి చేస్తూంటే, చూస్తూ వాజమ్మలా, దద్దమ్మలా వూరుకోవలసిందేః కనీసం అత్తయ్యా మాఁవయ్యా అయినా లోపలికొచ్చి దాన్ని...

ఇక బుర్ర పనిచెయ్యటంలేదు.

వెక్కుతున్న శారద ఏడుపు నా గుండెకు తగులుతోంది.

నాకు జరిగిన ఘోర అన్యాయం, నేను జరిపిన రాక్షసకృత్యం యింకెక్కడా చోటుదొరక్క నా మెదడును దొలుచుకుపోయి, అక్కడ స్థిమితంగా దెబ్బలాడుకుంటున్నాయి. వాటి ఘర్షణకి నా మెదడు వేడెక్కిపోయింది అనుకోకుండానే బయటకు వచ్చేశాను.

తిన్నగా పోయి, వాల్చిన పడక్కుర్చీలో పడిపోయాను కన్నార్పకుండా యెటోమాత్రం చూస్తున్నాను కంటికి అయితే యేవీఁ కనిపించలేదు మెదడు పనిచెయ్యకపోవడం వలన అలా ఎన్ని నిమిషాలు కూర్చున్నానో చెప్పటం నా తరంకాదు

"కాఫీ తీసుకోరా వాసూ."

అప్రయత్నంగా చూశాను, మాటలు వినిపించినవైపు.

కాఫీ గ్లాసుతో అత్తయ్యలాంటి మనిషి కాదు-అత్తయ్యే ఆమె ముఖంలోకి చూశాను ఆమె ముఖంలోని భావం-అది కోపమో, ప్రేమో, బాధో,...మరేమిటో నాకు తెలియదు

"కాఫీరా" అంది కాఫీగ్లాసు నా కళ్ళ ముందు పెడ్తూ

"అక్కడ పెట్టు అత్తయ్యా"అందామనేది నా వుద్దేశం బహుశా అనే ఉంటాను. అత్తయ్య కాఫీ గ్లాసుని కుర్చీ ప్రక్కగా పెట్టి వంటింట్లోకి వెళ్ళిపోయింది

అత్తయ్యః నేనంటే ప్రాణమిచ్చే




అత్తయ్య, అమ్మకంటే యెక్కువగా ప్రేమించే అత్తయ్య, ఎందుకింత ముభావంగా వుంది? దాన్ని ముభావం అనే అంటారా? శారద నా కింత అన్యాయం చేసినందుకు అత్తయ్య నాకు ముఖం చూపించలేకపోతోందా? నామీద జాలి పడుతోందా? లేక శారదకి యీనాడు వయసూ, ఆలోచించుకునే శక్తీ వచ్చి, నన్ను పెళ్లాడకూడదని స్వంత నిర్ణయము తీసుకున్నందుకు ఆమెని సమర్థించి, లేని అధికారంతో వాళ్ళమ్మాయి మీద చెయ్యి చేసుకున్నందుకు నన్ను అసహ్యించుకుంటోందా? లేదు, ఈనాడు వాళ్ళ పిల్లమూలంగా నాకు జరిగిన ఘోర అన్యాయానికి అత్తయ్య చచ్చేలా సిగ్గుపడుతోంది

* * *

ఈ విషయం యీనాటిదా? గత పద్దెనిమిది సంవత్సరాల్నుంచీ అనుకుంటూ వస్తున్నదే. నాకు నాలుగేళ్ల వయస్సున్నప్పుడు చూపించింది అమ్మ అత్తయ్యని. అప్పటిదాకా నాన్నగారి వుద్యోగరీత్యా ఢిల్లీలో వుండిపోయిన కారణంగా వాళ్లని యెప్పుడూ చూడేలేదు. ఆ రోజునే అనేసింది అత్తయ్య "ఏరా అల్లుడూ" అని. "నా పేరు అల్లుడుకాదు. వాసు" అన్నాను. అత్తయ్య బోలెడు సంబరపడిపోయి, యెత్తుకుని ముద్దెట్టేసుకుంది. ఆ తరవాత మాటల్లో అమ్మా, అత్తయ్యా నాగురించీ, శారద గురించీ ఏవేవో చాల చాల మాట్లాడేసుకుంటూంటే నాకు బోరుకొట్టి, వుయ్యాల్లో పడుకున్న శారదతో ఆడుకుంటున్నాను. కాసేపటికి అమ్మా, అత్తయ్యా యెందుకో విరగపడి నవ్వుకున్నారు.

అమ్మ నన్ను పిలిచి, "ఏరా వాసూ,

అత్తయ్య నిన్నల్లుణ్ణిచేసుకుంటానంటోంది. ఆ ఎర్రతేలుని పెళ్లాడతావేవిట్రా?" అంది, వుయ్యాల వైపు చూపిస్తూ.

అప్పటికి పెళ్లంటే ఏమిటో నాకేం తెలుసూ?

"ఓ యస్" అన్నాను.

మళ్ళీ యిద్దరూ నవ్వుకున్నారు.

నేనేదైనా జోకాను కాబోలు అనుకున్నాను.

అది మొదలు కొన్ని లక్షలసార్లు అత్తయ్య, మామయ్య, అమ్మ, నాన్న, యీ ఊళ్లో వాళ్లు, ఆ ఊళ్లో వాళ్లు, ఒకరేమిటి అంతా కూడా శారదనీ నన్నూ భార్యా భర్తలుగా జమకట్టేశారు. తోటి పిల్లలు కూడా అంతే బువ్వాలాటల్లోకూడా మా యిదర్నే భార్యాభర్లల్లా వుండమనేవారు. ఇంకొకళ్లతో జంటకూడదామంటే ఒప్పుకునే వారుకాదు.

హైస్కూలు చదువయ్యేవరకూ వాళ్ళింట్లోనే వుండి ఆ వూళ్లోనే చదువుతున్నాను. అత్తయ్య, మావయ్య తల్లిదండ్రులకంటే యెక్కువగా చూసేవారు నన్ను. "ఏరోయ్, అల్లుడుగాడుగారూ" అంటూ మామయ్య జోకులేస్తుండేవాడు.

ఇక శారదా, నేనూ, శరీరాలు వేరే కానీ ప్రాణాలొకటే. ప్రొద్దున్న లేచింది మొదలూ రాత్రి పడుకోబోయేవరకూ దరిదాపు ప్రతీ పనీ కలిసే చేసేవాళ్ళం. మా యిద్దరిలో ఎవరికైనా కొంచెం నలతగా వుంటే యింకొకళ్లకి నిద్రపట్టేది కాదు అన్నం ముట్టేవాళ్లంకాదు అలాగే అహోరాత్రాలు వాళ్లకి బాగయేవరకూ దిగులుగా గడిపేవాళ్లం. ఒక్కొక్కసారి యిద్దరం కలిసి స్కూలు ఎగ్గొట్టేసి, తోటలోనూ, గోదావరి ఒడ్డున ఒకరి ఒళ్లో ఒకరూపడుకుని, మావిడి పిందెలూ, రేగిపళ్ళూ, కందికాయలూ, సీమచింతకాయలూ తింటూ కూనిరాగాలు తీస్తూండే వాళ్ళం.

కొంచెం కొంచెం పెద్దవుతున్నకొద్దీ దాన్ని మాటి మాటికీ గుర్తుచేస్తూ వాళ్ల బోడి పెద్దరికాన్ని మామీద చూపించేవాళ్లు కొందరు పనిలేని పెద్దాళ్లు. క్రమేపీ సిగ్గంటే ఏవిటో శారదకి తెలిసొచ్చి, నేను కొంచెం కొంటెగా ప్రవర్తిస్తే "ఎవరైనా చూస్తారు బావా" అన్ని నన్ను నిరుత్సాహ పరుస్తూండేది.

స్కూలు ఫైనలు అయిపోయాక నాకు కాలేజీ చదువులకి మా అమ్మా నాన్నల దగ్గరకు వెళ్లిపోవలసి వచ్చింది వర్ణనాతీతమయిన బాధతో మా ఎడబాటు జరిగింది.

కాలేజీలో చేరానన్న మాటేగానీ ఒక్క ముక్క కూడా బుర్రకెక్కేది కాదు. అనునిత్యం శారద తలంపే. పుస్తకాల్నిండా శారద బొమ్మలే గీస్తూండేవాడిని. ప్రతిరోజూ వుత్తరాలు వ్రాస్తూండేవాడిని ఆమెకూడా అంతే.

"పిచ్చెక్కుతుందెమో కూడానూ వడిక అని అమ్మ భయపడేది నాన్నగారు నన్ను కేకలేసేవారు వారం వారం శారదా వాళ్ల వూరు పోయి వస్తూండే వాడిని. పోనీ శారదని మా వూరు వచ్చివుండమందామంటే అత్తయ్యా మామయ్యా శారదని విడిచి ఒక్క క్షణం వుండలేరు. వేరే మార్గం లేక వారం వారం వాళ్లవూరు వెళ్లి శారదని కలుసుకుని, ఒకరోజు ఒక క్షణంలా గడిపేసి, బాధగా మా వూరు వచ్చేస్తూ వుండేవాడిని.

బి. ఎ. ఫస్టుక్లాసులో పాసయ్యాను. దానికి శారద అనునిత్యం నా మేలు కోరుతూ చేసిన పూజలే కారణం కావచ్చు. రిజల్ట్సు వచ్చిన తర్వాత "ఎమ్ ఎ చదువుతావేవిట్రా" అన్నారు నాన్నగారు. "నావల్ల కాదు నాన్నా" అని చెప్పేశాను నిర్మోహమాటంగా. "అయితే యిహ యెక్కే గుమ్మం, దిగే గుమ్మమే నన్నమాట" అన్నారు. "ఆ అవసరం లేదులెండి. పొరబాటున క్లాసొకటి వచ్చిందిగా, ఎక్కడో అక్కడ దొరక్కపోదు'' అన్నాను.

ఉద్యోగ రీత్యా నేను మద్రాసు వెళ్లవలసి వచ్చింది నాన్నగారు కూడా ట్రాన్స్ఫరు చేయించుకుని మద్రాసు వచ్చేసారు. అప్పటినుంచీ వారం వారం కూడా కలుసుకోలేక పోతున్నందుకు శారదా నేనూ కుమిలిపోయాం

ఉత్తరాలు వ్రాసుకోవటం మాత్రం మా నిత్యకృత్యాల్లో ఒకటి అయి పోయింది. సంవత్సరం పూర్తి అవు తూనే నెల్లాళ్లు సెలవుపెట్టి శారదతో గడపాలని నిశ్చయించుకున్నాను. ఒక రోజున అమ్మతో శారదని విడిచి వుండలేకపోతున్నానని, తర్వాలో ముహూర్తం పెట్టించమని సిగ్గు విడిచి చెప్పేశాను. దానికి అమ్మ చెప్పిన జవాబు విని నా తల తిరిగిపోయింది. మంచి కట్నం విచ్చే సంబంధాలు అనేకం వస్తున్నాయని, శారదని మరిచిపొమ్మనీ చెప్పింది అమ్మ. నాన్నగారి అభి ప్రాయం కూడా అదేనని తెలిసి పోయింది చుట్టాలు దగ్గర కట్నం తీసు కోవటం తమ కిష్టంలేదని చెప్పారు. నేను పెళ్లంటూ చేసుకుంటే శారదనే చేసుకుంటానని ఖచ్చితంగా చెప్పేశాను.

రోజులు గడుస్తున్నకొదీ అమ్మా నాన్నల ప్రవర్తననిబట్టి శారదనీ నన్నూ విడదీయటానికి వాళ్లు బాగా ప్రయత్నిస్తున్నారనే అనుమానం నాకు బలవంతం కాజొచ్చింది. కొన్నిసార్లు శారదనుంచి నాకు వచ్చిన వుత్తరాలు దాచెయ్యటం, దానిమీద వాళ్లతో నాకు ఘర్షణలు జరగటం కూడా జరిగి పోయాయి.

పరస్పరం అభిమానించుకునే మను షులు దూరమవుతున్నకొద్దీ వాళ్ల మధ్య ప్రేమ పెరిగిపోతుందంటారు.

మా యిద్దరి విషయంలోనూ అదే జరిగింది. అమ్మా నాన్నా శారదని మరిచిపొమ్మని చెప్తున్నకొదీ ఆమెమీద ప్రేమ అభివృద్ధి అవసాగింది తుచ్ఛ మయిన కట్నంకోసం, పుట్టి బుద్ధెరిగి నప్పట్నుంచీ నన్నే నమ్ముకున్న శారదకి అన్యాయం చెయ్యనని ఖచ్చితంగా చెప్పేశాను యింట్లో. అవన్నీ సినిమాల్లోనూ, కథల్లోనూ మాటలని, వాళ్లమాట విని మంచి కట్నం వొచ్చే సంబంధం చేసుకోమని బ్రతిమాలాడారు. నా గొంతుకలో ప్రాణం వుండగా ఆ పని చెయ్యనన్నాను అయితే వాళ్ల గొంతుకలో ప్రాణం వుండగా యీ సంబంధానికి ఒప్పుకోమన్నారు వాళ్ల ఎవరి గొంతుకలో ప్రాణాలు వాళ్లకుండగానే వాళ్లనుంచి విడిపోయి వేరే మకాం పెట్టేశాను నేను ఈ వేర్పాటు సరిగ్గా నెల క్రితం జరిగింది

వెంటనే వుత్తరంలో నేను ఒక నెల రోజుల్లో వస్తున్నట్లు, స్వతంత్రించి శారదని పెళ్లిచేసుకోబోతున్నట్లు, అమ్మావాళ్లు యీ పెళ్లికి రావటంలేదనీ, వెంటనే ముహూర్తం నిర్ణయించమనీ అత్తయ్యకి వ్రాశాను 'పెళ్లికి తొందరరేం వొచ్చిందిరా వాసూ! ముందు అమ్మావాళ్లని చల్లబరిచి, నెమ్మదిగా వాళ్లకి నచ్చచెప్పు నేను కూడా వ్రాస్తాను. వాళ్లకి యిష్టంలేకుండా యీ పెళ్లి జరగడం యేవంత బాగుంటదోరేయ్' అంటూ అత్తయ్య నాకు వుత్తరం వ్రాసింది 'నన్నన్యాయం చెయ్యకు బావా' అంటూ శారద 'అమ్మా నాన్నా ఒప్పుకోవటం కల్లో కూడా జరగదు. వెంటనే వచ్చే నెల్లో ముహూర్తం విషయం చూడండి ఎవరికి యిష్టం వున్నా లేకపోయినా శారదని పెళ్లాడి తీరతాను' అని వ్రాసాను పెద్దాళ్ల మధ్య ఏం వుత్తర ప్రత్యుత్తరాలు జరిగాయో నాకు తెలియదు

ముహూర్తం నిర్ణయిస్తూ నాకు వుత్తరం వ్రాసింది అత్తయ్య. నన్ను నమ్ముకున్న పిల్లకి న్యాయం చేస్తున్నందుకు ఆనందం ఒకవైపు, అమ్మా నాన్నల్ని బాధ పెడుతున్నందుకు విచారం యింకోవైపు కలిగాయి నాకు ఈనాటి పరిస్థితుల్లో అమ్మా నాన్నల కోర్కెకూడా తప్పు లేదనిపించింది నాకు

బాగుండదని శుభలేఖలు కొట్టించి, పదిమందికి పంచిపెట్టేశాను.

"సారీరా అబ్బాయ్ దగ్గర్లో అయితే వచ్చేవాళ్లం" అని చెప్పేశారు అంతా 'రాకపోతేనే మంచిదిలే' అనుకున్నాను మనసులో.

తల్లిదండ్రులూ, స్నేహితులూ, బంధువులూ అందరూ వుండగా ఏకాకిలా ఒక్కణ్ణీ బయలుదేరి, గంట క్రితం దిగాను వూళ్లో బట్టలయినా మార్చుకోక ముందే చెప్పింది అత్తయ్య- "శారద



నిన్ను చేసుకోనంటోందిరా వాసూ" అని. ఎందుకో అత్తయ్య హాస్యాని కంటోందని అనిపించినప్పటికీ, ఆ విషయంలో జోకులకి నవ్వే పరిస్థితిలో నేను లేను

"నేనే పరిస్థితుల్లో వున్నానో తెలుసు కదా అత్తయ్యా. పరిహాసాలెందుకు చెప్పు" అన్నాను చిరాగ్గా

"పరిహాసం కాదురా నాయినా! నీ జీవితంతో యిలా ఆటలాడుకోవలసిన ఖర్మ పట్టింది మాకు ఏ జన్మలో ఏ పాపం చేసుకున్నామో నువ్వూ, మేమూ కూడా— ఈ జన్మలో యిలా..."

'ఆపు అత్తయ్యా. ఏది, శారద యెక్కడుంది?" పూడుకుపోతున్న నా గొంతుకలోంచి చీల్చుకుంటూ వచ్చింది సన్నటి స్వరం

బాధతో నోట మాటరాక శారద వున్న గదివైపు చూపించింది అత్తయ్య గదిలోకి పరిగెత్తాను తలవంచుకుని మంచంమీద కూర్చుని వుంది శారద.

"నువ్వు తనతో నన్ను పెళ్లిచేసుకోనన్నావంటోంది అత్తయ్య. అది అబద్ధం కదూ!" అన్నాను భయంతోనూ బాధతోనూ గొంతు పెగలక అతి కష్టంగా వికృతంగా వచ్చిన స్వరంతో నా కాళ్లు వణుకుతూంటే ఆమె ప్రక్కనే మంచంమీద కూలబడ్డాను

"లేదు. అమ్మ చెప్పింది నిజమే! నిజంగానే నేను నిన్ను పెళ్లిచేసుకో దలుచుకో..."

"ఆపు"

ఎలా అరిచానో తెలియదు గానీ అది మాత్రం అరుపే. కాదు- గావుకేక. కళ్లముందు కన్నకొడుకు తప్పతాగ బోతే కన్న తల్లి అరిచే అరుపులాంటి అరుపు. పిచ్చివాడిలా శారదవైపు చూస్తూ. తలబరికేసుకుని, రెండు చేతుల్తోనూ ముఖం కప్పుకుని, ఆడదాన్లా భోరున ఏడ్చేశాను. శారద మౌనంగానే వుంది. అలాగే తల ప్రేల్లాడేసుకుని యింకొకవైపు తిరిగి కూర్చుంది.

ఏడ్చి, ఏడ్చి కొంచెం భారం తీరి వూరట కలిగింది నాకు. నెమ్మదిగా మొండితనం, మొగతనం తలెత్తింది. నెమ్మదిగా బాధ స్థానే కోపం చోటు చేసుకోసాగింది నా హృదయంలో

"శారదా! నా ముఖంలోకి చూసి చెప్పు. ఎందుకీ నిర్ణయం తీసుకున్నావు నువ్వు?"

"........."

"పోనీ వేరే యెవర్నయినా ప్రేమించావా?"

"........."

"శారదా! ప్లీజ్ మాట్లాడు ప్రేమించకపోయినా వేరే యెవర్నయినా పెళ్లి చేసుకోవాలని నిర్ణయించుకున్నావా?"

'అవున' న్నట్లు తలూపింది శారద.

దెబ్బతిన్నాను. 'ఎవరతన'ని అడుగుదామనుకున్నాను. కాని అనవసరమనిపించింది

"ఎందువల్ల యింకొకర్ని పెళ్లిచేసుకోవాలని నిర్ణయించుకున్నావు? మా అమ్మా, నాన్నా మన పెళ్లికి యిష్టపడలేదనా?" ఝంగుమంది నా గొంతు.

'అవున న్నట్లు తలూపింది మళ్లీ.

"ఇది చాలా సిల్లీగావుంది శారదా! పెళ్లాడేవాడ్ని నేను గాని, వాళ్లు కాదు గదా! నేను నీకేం ద్రోహం చేయటం లేదే! నన్ను కని, పెంచి, నా మీద యెన్నో ఆశలు పెట్టుకున్న తల్లిదండ్రుల్నే నీకోసం దూరంచేసుకున్నానే! ఇలా అర్థాంతరంగా నన్ను న్యాయం చేస్తావా శారదా!! ఇది నీకు న్యాయంగా వుందా?"

"........."

"మాట్లాడూ" వురిమాను

శారదనీ, ఆమె ఆచరిస్తున్న

మౌనాన్నీ చూస్తూంటే కోపం కట్టలు తెంచుకుంటోంది నాలో

"ఏం మాట్లాడనూ ?— ఇది నా స్వవిషయం !"

తెల్లబోయాను

"ఏది స్వవిషయం ??"

"జీవితంలో భా'స్వుణ్ణి కోరుకోవడ మనేది" అంది నెమ్మదిగా

"ఛీ! చిన్నప్పట్నుంచీ "బావా! నువ్వే నా దైవం, జీవితంలో పెళ్లాడితే నిన్నే పెళ్లాడుతా" నంటూ నా చుట్టూ తిరిగి, నన్ను నమ్మించి; యీ రోజు అందర్నీ కాదని నిన్నో దేవతలా భావించి వచ్చినందుకు నన్ను నువ్వు యింత చులకన చేస్తావా ? మరి యీ విషయం వుత్తరంలో యెందుకు వ్రాయలేదు నాకు ?"

"........."

"మాట్లాడవేం రాక్షసీ"

నేను అరచిన అరుపుకి లంకంత యిల్లూ మారుమ్రోగింది.

"ఏం మాట్లాడనూ ?" చిరాగ్గా అంటూ లేచి నిల్చుంది

"నన్నెందుకిలా మోసంచేసావు ?" నేనూ నిలబడుతూ కోపంగా అన్నాను.

"నేనేం మోసంచేసాను ?" అంది నంగనాచిలా

"ఏం మోసంచేసావా ? చిన్నప్పట్నుంచీ నేనంటే నీ కిష్టమున్నట్లు ఎందుకు నటించావు ?"

"నేనేం నటించలేదు నువ్వే నన్ను నీ వెనక తిరిగేలా చేసుకున్నావు. చిన్నతనంలో చేసిన తప్పుకి యిప్పుడు బాధ పడుతున్నాను.''

"చిన్నతనంలో చేసిన తప్పా ?? నాలుగు రోజుల క్రితం వరకూ తాళికట్టిన భార్యకంటె యెక్కువగా వుత్తరాలు వ్రాసినదానివి, యింతలోనే చిన్నతనం పోయి పెద్దదానివయి పోయావా?"

"అనవసరం. నువ్వింక నాతో మాట్లాడొద్దు" దూరంగా పోయింది.

''ఏం ? ఎందుకని ?" మొండిగా దగ్గరగా వెళ్లాను

"నువ్వంటేనే నాకసహ్యం" గబుక్కున అనేసింది.

మళ్లీ తెల్లబోయాను.

సభకి ముఖ్య అతిథిగా పిలిచి బట్టలు విప్పి నగ్నంగా వేదికమీద నిలబెట్టి నట్లయింది నాకు.

కారదని చంపెయ్యాలన్నంత కోపం వచ్చింది నాకు...

.......

"మరేం బాధపడకురా అబ్బాయ్. దానికేం రోగం వచ్చిందో యీ పాడు బుద్ధి పుట్టింది మేమెంత నచ్చచెప్పినా వినటంలేదు. నీకేం రాజాలాంటి కుర్రాడివి బంగారంలాంటి సంబంధం దొరుకు..." యేదో చెప్తున్నాడు మామయ్య మంచంమీద లేచి కూర్చుంటూ

"అనవసరం మావయ్యా దయచేసి నన్నెవరూ పలకరించకండి" అంటూ పడక్కుర్చీలోంచి నెమ్మదిగా లేచి, శారద గదిలోకి వెళ్లాను

తలగడాలో ముఖం దాచుకుని, పరుపుమీద అపసవ్యంగా శోషకొట్టినట్లు పడివుంది శారద

ఆమె దగ్గరగా వెళ్లాను మంచానికి రెండు అడుగుల దూరంలో నిలబడ్డాను

"శారదా! నన్ను క్షమించు నీ మనసు బాధపెట్టాను మన పెళ్లి కేవలం నా యిష్టంమీదే జరిగితే అది అన్యాయం నీ మనసు తెలిసీ నిన్ను బలవంతంగా పెళ్లాడ బూనుకుంటే అది మూర్ఖత్వం మన యిద్దరికీ వున్న సంబంధం కారణంగా నువ్వు నీ యిష్టమయిన వాణ్ణి పెళ్లాడ్డం విషయంలో ఏమైనా అడ్డంకులొస్తే ఆ పాపం నాదే నేను నీ కంటే పెద్దవాడిని చిన్నప్పుడే నేను నీకు అన్యాయం చేసాను నీ మీద నేను మమకారం పెంచుకోవటంతో సరి పెట్టుకోక, నువ్వు కూడా నన్ను ప్రేమించేలాగ చేసుకున్నాను ఇది కేవలం నా స్వార్థం నీ వ్యక్తిత్వాన్ని యీనాటికి గుర్తించుకున్నావు చేతులు కాలక ముందే జాగ్రత్తపడ్డావు భగవంతుడు నీకు అనుక్షణం అండగావుండి, సకల ఐశ్వర్యాలూ, ఆయురారోగ్యాలూ యివ్వాలనీ, సకల సంపదలూ వున్న వ్యక్తి నీకు భర్తగా లభించి పిల్లాపాపలతో నీ సంసారం కళకళలాడాలని మనసారా కోరుకుంటున్నాను ఇక నీ జీవితంలోకి యెప్పటికీ రానని భగవంతుడిమీద ప్రమాణం చేస్తున్నాను నన్ను దయ చేసి క్షమించు"

ఇప్పుడు నా మనసు యెంతో తేలిక పడింది మెదడులో యెటువంటి ఆలోచనాలేదు హాయిగావుంది హుషారుగా బయటకు నడిచాను గాలిలో తేలుతున్నట్లుగా వుంది

"ఎక్కడికిరా వాసూ? వేణ్ణీళ్ల పెట్టించాను బట్టలు మార్చుకో స్నానం చేసి కొంచెం యెంగిలిపడి వెళ్దువుగాని బయటకు అసలూ తలకాయల్లేవ్రా యింట్లో యెవ్వళ్లకీ వాడు పాపం కనీసం బట్టలైనా మార్చుకోకుండానే దిక్కుమాలిన భాగోతం పెట్టారు ఒరేయ్ వాసూ ఆగరా" అరుస్తున్నాడు మామయ్య వెనకనుంచి

కనీసం వెనక్కైనా తిరక్కుండా నడకసాగించాను

..... .

నా బాధను చూడలేక కాబోలు దిన కరుడు పశ్చిమకొండల చాటున ముఖం దాచుకుంటున్నాడు లొల్లాయి పదం పాడుతూ ఏకాకిలా నెమ్మదిగా పడవ నడుపుతున్నాడు ఒక పల్లెవాడు

జీవితంలో దగా పడ్డందుకు బాధ పడాలో, భవబంధాలు తెంపుకుని స్వతంత్ర జీవినయినందులకు సంతో




షించాలో తెలియక, శూన్యంలోకి చూస్తూ మెట్టుమీద కూర్చుని వున్నాను నేను చాలాసేపే అయింది నేను అక్కడ చేరి ఆ ప్రశాంత వాతావరణంలో మనసు కొంత తేలికపడింది జరిగిన మంచిచెడులమీద ఘర్షణ తగ్గించి, పల్లెవాడు పాడుతున్న పాట వింటూ, ఆకాశంలోని అరుణ కాంతిని ఆస్వాదిస్తున్నాను

'బావా!"

ఉలిక్కిపడ్డాను ఏమిటీ భ్రమ?! మళ్లీ మనసు యెందుకిలా చంచలమవుతోంది? జరిగిన సన్మానం చాలదా?!

"బావా!"

నూతిలోనుంచి వచ్చినట్లున్న ధ్వని

కంగారుగా ప్రక్కకి చూశాను

శారద!

శారదా?

అవును శారదే! చేతిలో నా పెట్టి

అయోమయంగా చూస్తూ పైకి లేచాను

పెట్టి క్రింద పెడ్తూ నా కాళ్లమీద పడిపోయింది శారద నాకేమీ అర్థం కావటంలేదు ఏమిటీ వింత సంఘటన?!

"నన్ను క్షమించు బావా! నీకు ఘోరమైన అన్యాయం తలపెట్టాను" వణుకుతున్న హీనస్వరంతో అంటూ, నా కాళ్లను చుట్టేసుకుంది శారద

"శారదా! లే ఎవరి ఖర్మకు వాళ్లు కర్తలు ఏ జన్మలో ఏం పాపం చేసుకున్నానో యీ జన్మలో యిలా అందరికీ దూరమయ్యాను దీనికి యెవరూ బాధ్యులుకారు లే! లేచి యింటికి వెళ్లు"

ఆమెను ముట్టుకోవాలంటేనే నాకెందుకో భయంగావుంది కాళ్లు వెనక్కి లాక్కోవడానికి ప్రయత్నించాను

ఆమె నాకాళ్లు వదల్లేదు ఆమె అశ్రు ధారల్తో నా పాదాలు తడిసిపోతున్నాయి

"బావా ! నువ్వు నన్ను క్షమించా ననేదాకా నీ పాదాలు వదల్ను నేను నన్ను పెళ్లిచేసుకోమని కోరటంలేదు నేను ఆ అర్హతని పోగొట్టుకున్నాను కనీసం నిన్ను బ్రతిమలాడే అధికారం కూడా నాకు లేదు నా అంత పాపి యిప్పటి వరకూ యీ భూమ్మీద పుట్ట లేదు. పుట్టబోదు పుట్టకూడదు. నేను నిన్ను అర్థించేది, పాకులాడి ప్రార్థించేది ఒక్కటే- నన్ను క్షమించగలనని ఒక్కమాట అను చాలు. తర్వాత నా దారి నేను చూసుకుంటాను"

బ్రాన్పడిపోయాను ఏమిటీ వింత ప్రవర్తన ?!! శారదకి మతిచెడిందా ? నాలుగు రోజుల క్రితంవరకూ నన్ను ఆరాధ్య దైవంగా కొలిచింది సంవ త్సరం నుంచీ ఆమెని కలల్లోనే కలుసు కుంటూ, యీనాడు యెంతో ఆత్రుతతో తన యింటి కొచ్చిన నన్ను అసహ్యించు కుంది మళ్లీ ఒక్క రెండు గంటల్లోనే మనసు మార్చుకుని తన తప్పు తెలుసు కుని నా కాళ్లమీద పడి, క్షమించమని ప్రాధేయపడుతోంది పరిస్థితి నా కేమీ బోధపడటంలేదు క్రిందకు చూసాను కుప్పలా నాకాళ్లమీద కూలిపోయివుంది శారద కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తోంది

అసంకల్పితంగానే శారదని నెమ్మదిగా లేవనెత్తాను

కన్నెత్తి నన్ను చూడలేకపోతోంది శారద సిగ్గుతో చచ్చిపోతోంది కళ్లు జలపాతాలులాగ వున్నాయి

"నిన్ను మనస్ఫూర్తిగా క్షమి స్తున్నాను శారదా'' అనగలిగాను. అంతే !

నా చేతుల్లోంచి విడిపోయింది నాకు దూరంగా వెళ్ళిపోసాగింది

''చాలు బావా చాలు ! నాకిప్పుడు యెంతో హాయిగావుంది నీ బ్యాగ్ అదిగో వెంటనే మద్రాసు వెళ్లిపో. మా యింటికి మాత్రం వెళ్లొద్దు ఆ పాప కూపంనుంచి దూరంగా పో త్వరగా దేవుడు నీకు మేలు చెయ్యాలని కోరు కుంటున్నాను శలవు" అంటూ గోదావరి వైపు పరుగుపెట్టసాగింది

ఈ హఠాత్పరిణామానికి అదిరి పోయాను నేను.

"ఆగు శారదా ! శారదా ! ప్లీజ్, శారదా ! ఆగు !''

బలంకొద్దీ పరిగెట్టాను అప్పటికే నీళ్లల్లోకి వెళ్లిపోయింది ఆమె గంగమ్మ తల్లి ఆమెని తనలో కలుపుకోకముందే పట్టుకున్నాను శారదని

"నన్ను ఆపుచెయ్యొద్దు బావా ! నన్నొదిలెయ్, ప్లీజ్, వదిలెయ్ నేను మహా పాపిని నన్ను చావనియ్ నా

పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోనియ్ వదిలెయ్ బావా ! నన్నొదిలెయ్ ''

నా చేతుల్లోంచి విడిపించుకోడానికి విఫల ప్రయత్నం వేస్తూంది

"నీ పాపానికి ప్రాయశ్చిత్తం జరిగి పోయింది శారదా, నీ తప్పు నువ్వు తెలుసుకొని, క్షమాపణ కోరుతున్నావు అంతకు మించిన ప్రాయశ్చిత్తం ఏమీ లేదు నువ్వు నిర్దోషివి నా మాట నమ్ము బుజ్జగిస్తూ అన్నాను

''బావా అంటూ నా గుండెలమీద వాలి యింకొకసారి బావురుమంది నేను ఆమెను వారించలేదు లోపలున్న దుఃఖ మంతా బయటకుపోతే మనసు తేలిక పడుతుందని ఊరుకున్నాను ఆమె జుట్టు నిమురుతూ, నుదుటిమీద ముద్దుపెట్టు కున్నాను

దుఃఖ భారం తీరాక నా గుండెలకు హత్తుకుపోయింది ఆమెని నెమ్మదిగా నడిపించుకుంటూ ఒడ్డుకు తీసుకవచ్చాను

ఆదరణగా అనునయిస్తూ యిసుకలో కూర్చోపెట్టాను పరీక్షగా ఆమె ముఖం లోకి చూస్తూ పాత సంఘటనలు జ్ఞప్తికి తెచ్చుకొంటున్నాను అయిదు నిమి షాలవరకూ ఏమీ మాట్లాడలేదు శారద తల దించుకునే కూర్చుంది ఆమె భుజం మీద చెయ్యివేశాను అప్యాయంగా నెమ్మదిగా తలయెత్తి నా కళ్ళల్లోకి చూసింది ఎంతో ప్రేమగా జాలిగొలిపే లాగ వుంది ఆమెచూపు ఏ చూపు




అయితే చిన్నప్పట్నుంచీ నేను శారద మీద మమకారం పెంచుకోటానికి మూల కారణమో — ఆ చూపు అది సంవ త్సరం తర్వాత చూడగలుగుతున్నాను నా అసలు శారదని

''శారదా" తన్మయత్వం కలుగు తోంది నాకు ఆమె (ను)అలా చూస్తోంటే

"బావా"

ఎంతటి తియ్యని పిలుపు! హృద యాంతరాళంలోంచి వచ్చిన ఆ పిలుపు నా మనసులో మల్లెలు పూయిస్తోంది

"బావా! నిజం చెబుతాను వింటావా?"

"వద్దు! వద్దు శారదా! జరిగింది పీడ కలలా మరచిపో ఇక ముందు మాత్రం ఏ శక్తి మనల్ని విడదీయ కూడదనీ ఆ భగవంతుడ్ని ప్రార్థిద్దాం"

"కాదు బావా! జరిగింది నువ్వు తెలుసుకోవాలి! నేను వున్మాదిననుకుంటున్నావు కదూ ఈ రోజు నా ప్రవర్తన చూసి!! ఉన్మాదిని కాకపోయినా ఆడదాన్ని అందువల్లే అలా ప్రవర్తించాను"

కొంగుతో శుభ్రంగా ముఖమంతా తుడుచుకుంది

నెమ్మదిగా చెప్పటం మొదలుపెట్టింది

"నెల క్రితం నీ వుత్తరంలో మామయ్యా, అత్తయ్యా మన పెళ్ళికి ఒప్పుకోవటం లేదనీ వాళ్ళనుంచి వేరయి పోతున్నావనీ, మన పెళ్ళికి ముహూర్తం పెట్టించమనీ వ్రాసావు అప్పటిదాకా మన పెళ్ళికి యెటువంటి అవాంతరాలులేవు నువ్వు మీ వాళ్ళ నుంచి విడిపోయి నన్ను పెళ్ళాడ్డం మా అమ్మా, నాన్న లిద్దరికీ యిష్టంలేదు అందుకనే తొందరపడవద్దని అమ్మ నీకు వ్రాసింది చిన్నప్పట్నుంచీ అనుకుంటున్న సంబంధమేకదా అని, మనిద్దరినీ విడదీయొద్దనీ అత్తయ్యకి అమ్మ ఎంతో యిదిగా వుత్తరం వ్రాసింది ఆ వుత్తరానికి గానీ ఆ తర్వాత అమ్మ వ్రాసిన రెండు వుత్తరాలకుగానీ అత్తయ్య అసలు జవాబే ఇవ్వలేదు దాంతో నాన్నకి బాగా కోపమొచ్చి చస్తే ఈ సంబంధం చేసుకోవడానికి వీల్లేదన్నారు కానీ నా బాధ చూడలేక అమ్మ ఎలాగో నాన్నగార్ని ఒప్పించి, ముహూర్తం పెట్టించి నీకు వుత్తరం వ్రాసింది

ఈ సమయంలోనే, నాలుగయిదు రోజుల క్రితం నా పాలిటి శనిగాడిలా ప్రక్కింటి లాయరుగారి తమ్ముడు యీ వూళ్ళో దిగాడు వాడొక డాక్టరు మొదటి భార్య నెల క్రితమే పోయింది పిల్లలులేరుకానీ వాడికి వాడ్ని కప్పెట్టేంత ఆస్తి వుంది నన్ను వాడికి కట్నం లేకుండా చేసుకుంటామని నాన్నతో అన్నాడు లాయరుగారు ఇక నాన్న సంతోషానికి అవధుల్లేవు లక్షాధికారి ఆయనకి అల్లుడు కాబోతున్నాడంటే యింక ఆయనకి కాలు నేలమీద ఆనలేదు అతనికున్న గొప్పల్ని వెయ్యింతలు చేసి చెప్పి ఆ సంబంధం చేసుకోడానికి అమ్మచేత వొప్పించాడు నాన్న నన్నెలాగైనా వొప్పించేభారం అమ్మ మీద వేశాడు ఎలా చెప్పాలో తెలియక అమ్మ నిన్నటి వరకూ తికమక పడింది కానీ ఈ నాలుగు రోజుల్నుంచీ ప్రతి నిమిషం ఏదో మిషతో ఆ డాక్టరి అందం చదువు, డబ్బు గురించి నాదగ్గర పొగడ సాగింది విని ఊరుకోట్టడమే తప్పితే అమ్మ మనసులో వున్నదేమిటో

వూహించలేకపోయాను నిన్నపొద్దున్న నీ ఫోటో ఆ డాక్టరు ఫోటో ప్రక్క ప్రక్కనపెట్టి "ఇతని ముందు బావగాడు యెంత వెలవెల పోతున్నాడో చూడవే అమ్మాయ్!" అంది అమ్మ బాహ్య సౌందర్యానికి ఆ ఫోటోలో కన్పిస్తు న్నంతవరకూ నీమీద అతను అంద గాడేనని చెప్పవచ్చు కానీ మొదటిభార్య పోయి నెల తిరక్క ముందే పెళ్ళి పీటెక్కటానికి వువ్విళ్ళూరుతున్న ఆ ప్రబుద్ధుడి సంస్కారం-నమ్మిన వ్యక్తి కోసం సర్వం త్యాగం చేసిన నీ సంస్కా రం ముందు యెంత వెలవెల పోతుందో నేనూహించగలను ఆ మాటే అన్నాను అమ్మతో కానీ అమ్మ తన మాటల చాక చక్యంతో నన్ను మార్చెయ్య గలిగింది ఆ చాకచక్యంతోనే పెద్దయ్యాక నాకు ఎక్కడ పెళ్ళి చెయ్యలేకపోతా మోనని చిన్నప్పట్నుంచీ యెంతో ఆప్యాయత కనబరుస్తూ నిన్ను తనగుప్పిట్లోంచి దాటి పోకుండా కాపాడుకొంటూ వస్తోంది అమ్మ మన చుట్టాలెవరికీ యిష్టంలేని ఈ పెళ్ళివల్ల నాకు సుఖం కలగదంది బంధువులందరూ తమ యిద్దర్నీ కూడా వెలివేస్తారంది ఈ వయసులో వాళ్ళు పడరాని బాధలు పడవలసి వస్తుంది అంది నువ్విప్పుడు ఆవేశంలో నా మెళ్లో తాళి కట్టినప్పటికీ తర్వాత మీ వాళ్ళ నుంచి నువ్వు దూరమవడానికి నేనే కారణ మంటూ నన్ననేక విధాల బాధలు పెడతానంది మళ్ళీ మీ వాళ్ళతో నువ్వు ఏకమయి మీరంతా నన్నొక వంట మనిషిలాగ దాసిదానిలాగ చూస్తా రంది మీ కన్న తల్లిదండ్రుల్నుంచి నిన్ను వేరుచేశానని నన్ను మన బంధువు లంతా దుమ్మెత్తిపోస్తారంది ఊళ్లో అంతా వుమ్మేస్తారంది నీ కంటే ఆ డాక్టరు అందమైనవాడని డబ్బున్న వాడనీ, వాడ్ని చేసుకుంటే యెవరి పోరూ లేక మహారాణిలాగ దాస దాసీలతో సుఖపడతానంది మేడల్లో జీవిస్తూ కార్లలో దర్జాగా తిరగొచ్చంది ఈ మాట లన్నీ ఆడిదాన్ని కాబట్టి నా మనసుకి బాగా పట్టేశాయి నిన్ను పెళ్ళాడితే ఆమె చెప్పిన బాధలన్నీ పడాలనే భయం అతన్ని పెళ్ళాడితే ఆమె చెప్పినట్లుగా మేడల్లో జీవిస్తూ కార్లలో తిరగొచ్చనే ఆశ కలిగాయి నాలో నువ్విివాళవస్తే నేనెలా నటించాలో బాగా నూరిపోశారు అమ్మా, నాన్న నువ్వెంత బాధపడ్డా నేను కరగకూడదన్నారు ఆ ప్రకా రమే యిందాక నటించాను అప్పుడు మాత్రం నీ శారదని కాదునేను, మేడలూ కార్లూ, ఆడంబరాలూ ఆశించే అసలైన ఆడదాన్ని మాత్రమే ప్రాణం కన్నా మిన్నగా ప్రేమించే భర్త అనురాగమే కోటి రూపాలయపెట్టు అని అర్థం చేసు కోలేని ఆ అబలని మాత్రమే అప్పుడు నువ్వు కోపంగా నన్ను తోసేసినప్పటిదాకా నీ శారదని కాదు నేను అప్పటినుంచే

ఆలోచించాను నీ కెంత ఘోర అన్యాయం నా మూలంగా జరిగి ఉండక పోతే నువ్వంత క్రూరంగా ప్రవర్తించి వుంటావనిపించింది అలా మంచంమీద పడి వుండే చిన్నప్పట్నుంచీ మన చెలి మిని గుర్తుచేసుకున్నాను ఒక్కొక్క సంఘటన నాలోని ఒక్కొక్క ఆశనీ పారద్రోలసాగింది ఇంతలో నువ్వొచ్చి అంతా నీ తప్పేనని చెప్పేసరికి నాకు బాగా కనువిప్పు కలిగి ది నీ అంత సంస్కారమున్న మనిషిని భర్తగా పొందటం కంటే భాగ్యం మరేదీలేదని పించింది నేను చేసిన పాపం కూకటి వేళ్ళతో కడుక్కు పోయేంత వరకూ కన్నీళ్ళు కార్చాను నీ కాళ్ళమీద పడి నీ క్షమాభిక్ష పొందేవరకూ నా పాపా లకి ప్రాయశ్చిత్తం లేదనిపించింది మన శ్శాంతి కోసం తోటలోగానీ, ఇక్కడ గానీ వుంటావని వూహించాను ఇక నువ్వు ఆ మనుష్యుల మధ్య ఒక క్షణం కూడా వుండకూడదనే వుద్దేశ్యంతో నీ బ్యాగ్ కూడా "

అప్పటిదాకా యెంతో కష్టంమీద ఆమె ఆపుకుంటూ వస్తూన్న కన్నీళ్ళు వెల్లుబుకి బయటకు వస్తూంటే, నా వళ్లో వాలిపోతూ బావురుమంది ఆనందంతో నామనస్సు వురకలువేస్తూంది నామంచి తనం నా అచంచలమైన మనసు నాకు న్యాయం చేకూర్చాయి ఎందుకో గర్వంగాకూడా ఫీలయ్యాను

"పిచ్చిపిల్లా! యింకా యెందుకా కన్నీళ్ళు ! మనల్ని ఏ శక్తి విడదీయ లేదు ! పద ఇంకో పదినిమిషాల్లో కాకి నాడకి బస్సుంది మనకి అక్కడ మన మిత్రులు అనేకమందున్నారు వాళ్ళ సమక్షంలో యీ ముహూర్తానికే నీ మెళ్లో తాళి కడతాను " అన్నాడు ఆమెను లేవదీస్తూ

నా తాకిడికే సిగ్గుపడ్తూ, నా చేయూత మీద లేచి పైట వంటినిండా కప్పుకుని తల దించుకుని ముసి ముసి నవ్వులతో హంసలా నడిచింది నా ప్రక్కనే పెళ్లి కూతురు శారద

సమయం చూసుకుని కన్నుకొట్టి, మేఘం చాటున దాక్కున్నాడు కలువ రేడు






ఎర్రగడ్డలో ఒక సవారీ దించగానే ఆటో డ్రయివర్ వెంటనే మరో సవారీ దొరకడం తన అదృష్టంగా భావించాడు ఆటోకోసం ఎదురు చూస్తున్న దాదాపు ఓ నలభై ఏళ్లతను కంగారుగా ఆటో ఎక్కి "త్వరగా పోనీ" అన్నాడు

"కహా జానా ? అడిగాడు ఆటో డ్రయివర్ హిందీలో-ఫ్లేగ్ దింపి

"లక్‌డీ కా పూల్" చెప్పాడతను ఆదుర్దాగా ఆటో కొద్దిదూరం వెళ్ళగానే "ఓసారి ఆ మందులషాపుదగ్గర ఆపు" అని కోరాడు ఆ ప్రయాణీకుడు వెనకసీట్‌లోంచి

ఆటో ఆగగానే, ఆ మందుఃషాపులోకి నడిచివెళ్ళి, ఆ షాపతన్ని ఏదో అడిగాడు ఆ మందులషాపతను తమ దగ్గర లేదన్నట్లుగా తల అడ్డంగా వూపాడు మళ్ళీ వచ్చి ఆటోలో కూర్చుని ఆ ప్రయాణీకుడు "పోనీ" అన్నాడు

ఆటో లక్‌డీ కా పూల్ చేరుకునే లోపల అలా అయిదారుచోట్ల అతను ఆటోని ఆపించి మందులషాపుల్లోకి వెళ్ళి ఏదో అడుగుతూనే వున్నాడు ఆ షాపులవాళ్ళు లేదని తల అడ్డంగా వూపడమో చెప్పటమో జరిగాక అతను వచ్చి ఆటోలో కూర్చుంటు న్నాడు అతనిలోని ఆదుర్దా అలా తిరిగి వచ్చిన ప్రతీసారి అధికంకావడం గమనిస్తూనే వున్నాడు ఆటో డ్రయివర్

ఎర్రగడ్డ ఆస్పత్రిలో ఎవరికో సీరియస్‌గా వుండి వుంటుందని మందు కోసం ప్రయత్నిస్తున్నాడని వూహిం చాడు డ్రయివర్ ఆటో లక్‌డీ కా పూల్ చేరుకోగానే ఓ పెద్ద మందుల షాపు ముందు ఆపించి దిగి, దాంట్లోకి వెళ్ళాడు ఆ ప్రయాణీకుడు మళ్ళీ ఏదో అడిగాడు

పది పదిహేను క్షణాల తర్వాత వెనక్కి వచ్చి ఆటోలో కూర్చున్నా డతను చిన్నబోయిన వదనంతో

నాలుగైదు నిముషాలదాకా మాట్లాడ కుండా, ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చుండిపోయాడతను

"అభీ కహా జానా ?" అడిగాడు డ్రయివర్

"వెనక్కి" అన్నాడతను పెద్దగా అట్టూర్చి

ఆటోని మళ్ళీ ఎర్రగడ్డవైపు తిప్పాడు డ్రయివర్ దారిలో ఇదివరకు అడగని ఒక మందులషాపుముందు ఆపి, చెప్పాడు డ్రయివర్ ఆ ప్రయాణీ కుడితో అందులో దొరుకుతుందేమో ప్రయత్నించమని

అతను ఆ మందులషాపులోకి వెళ్ళి, వెంటనే తిరిగి వచ్చేసాడు

"ఛత్ ఎక్కడా దొరకదులావుంది" అన్నాడు తనలో తను గొణుక్కుం టున్నట్లుగా

ఆటో ఎర్రగడ్డ ఆస్పత్రిముందు ఆగగానే అతను కిందకి దిగి, గబగబా గేటువైపు నడిచాడు

"సాబ్ ఆటో ఫేర్ ఏడు రూపా యల చిల్లరయింది" అరిచాడు డ్రయి వర్ కూడా ఆటో దిగి ఆగి, జేబులు తడుముకుని అన్నాడా ప్రయాణీకుడు దీనంగా

"లేదు నిన్న రాత్రి మా నాన్న గారితో డాక్టర్ అంటూంటే విన్నాను, మీ వాడు ఇరవై సంవత్సరాలనుంచి వుద్యోగం దొరకకపోవటంవల్ల పాడ యాడు ఉద్యోగమే సరయినమందు" అని ఎక్కడైనా ఆ మందు దొరుకు తుందేమోనని ప్రయత్నంచేసాను నువ్వే మాసావుగా దొరకలేదు ఆ సంగతి డాక్టర్‌తో చెప్పాలి ఆయనకే పిచ్చి నిజానికి అయినా వప్పుకోడు చస్తే"

ఆస్పత్రి గేటువైపు మళ్ళీ దబదబా అడుగులు వేసాడతను

ఆ ఆస్పత్రి పేరు "గవర్నమెంట్ హాస్పిటల్ ఫర్ మెంటల్ డిసీజెస్

తెలుగులో దాన్ని 'పిచ్చాసుపత్రి' అంటారు

---




కామేశ్వరరావు చెప్పిన విషయం విని నేను చాల ఆశ్చర్యపోయాను. నేను ఊహించిపదానికి పూర్తి విరుద్ధంగా ఉంది అతను చెప్పిన విషయం.

"నిజమేనోయ్...విమలమీద నాకు అటువంటి అభిప్రాయం అసలెప్పుడూ లేదు ..." అంటూ చెప్పడం ముగించాడు.

విమలా కామేశ్వరరావులు మంచి స్నేహితుల క్రిందే చెప్పుకోవచ్చు. వాళ్ళ పరిచయం ఎప్పుడు ఎక్కడ జరిగిందో తెలియదుగానీ వాళ్ళలో ఒకళ్ళంటే మరొకరికి అభిమానం ఉందనిమాత్రం తెలుసు. బహుశా ఆఫీసులో పనిచేస్తూ చేస్తూనే పరిచయం ఏర్పడి, తరువాత స్నేహంగా మారి ఉంటుందని నా ఊహ ! కామేశ్వరరావు నేనుండే సెక్షనులోనే పనిచేస్తున్నాడు.

విమల వేరే సెక్షనులో పనిచేస్తుందిగానీ మధ్యాహ్నం లంచ్ సమయానికి మా దగ్గరికి వస్తుంది. విమల నాతోకూడా మాట్లాడుతుంది గానీ కామేశ్వరరావుతో ఉన్నంత చనువుగామాత్రం ఉండదు అసలు నాతోనైనా నేను కామేశ్వర రావుకు స్నేహితుడిని గాబట్టి మాట్లాడు తుందేమో !!...

ఇన్నాళ్ళూ కామేశ్వరరావూ విమలలు ఒకళ్ళ ఇళ్ళకు మరొకళ్ళు వెళ్ళడం, సినిమాలకూ, షికార్లకూ వెళ్ళడం జరుగుతూ ఉంది. కానీ ఈ మధ్య వారికి అభిప్రాయభేదాలు వచ్చినట్లు నాకు అనుమానం పుట్టింది నా అను మానానికి సరియైన కారణం లేకపోలేదు. విమలా కామేశ్వరరావులు ఇదివరకట్లా కలుసుకోవడంలేదు. విమల కూడా లంచ్ సమయంలో మా సెక్షనుకు రావడంలేదు. ఒకవేళ ఎప్పుడైనా వచ్చినా ఆమె నాతోనే కాస్త మాట్లాడు తుంది. కామేశ్వరరావుతో ఏదో పొడి పొడిగా మాట్లాడుతుంది. వారిద్దరి మధ్యా రాను రాను మాటలు కూడా కరువైపోతుంటే నా అనుమానం దృఢ మైంది. వారిద్దరి స్నేహం ఇలా దెబ్బ తినడానికి అసలైన కారణం ఏమయి ఉంటుందో నా ఊహకు చిక్కడం లేదు. కొన్నాళ్ళు ఓపికపట్టానుగానీ ఇక కుతూహలం అణుచుకోలేక వాడినే అడిగేశాను అసలు విషయం ఏమిటని. అప్పుడు జరిగిన సంగతి ఇదన్ని అంతా చెప్పుకొచ్చాడు. అతను చెప్పిన విషయం నిజంగా నాకు చాల ఆశ్చర్యం కలిగించింది.

విమల తమ స్నేహాన్ని మరో విధంగా అర్థంచేసుకుని అపార్థంచేసు కుందనీ ... కొన్నిరోజులక్రితం తన దగ్గరికివచ్చి తనను ప్రేమిస్తున్నట్టూ... పెళ్ళిచేసుకోమని అడిగినట్లూ ... తను అందుకు నిరాకరించినట్టూ చెప్పాడు కామేశ్వరరావు.

విమలను వివాహం చేసుకోవడానికి కామేశ్వరరావు ఎందుకు నిరాకరిం చాడో నాకు అర్థంకాలేదు. విమలకంటే అందమైన, యోగ్యురాలైన అమ్మాయి అతనికి భార్యగా లభిస్తుందన్న నమ్మకం కూడా నాకు లేదు. అదే విషయం వాడితో అన్నాను.

'లేదోయ్ ... నువ్వు చాల పొర బాటు పడుతున్నావ్ !... నా మనస్త త్వానికీ ఆమె మనస్తత్వానికీ చాల తేడా ఉంది. మా ఇద్దరి అభిప్రాయాలు ఏవీ కలవవు, మేమిద్దరం పెళ్ళిచేసుకుంటే అంతగా సుఖపడమని అనుకుంటాను. అందుచేతనే స్నేహాన్ని పెళ్ళితో ముడి పెట్టకని విమలతో చెప్పాను. కానీ ఆమెకు కోపంవచ్చి నా స్నేహాన్ని కూడా వదులుకుంది...పూర్ గర్ల్..." అన్నాడు కామేశ్వరరావు నిట్టూరుస్తూ.

విమలతో వివాహం యిష్టపడక పోవడానికి కామేశ్వరరావు చెప్పిన కారణం నాకు అంత సమర్థనీయంగా

కనిపించలేదు. అంతేకాకుండా వాడు నా దగ్గర ఏదో దాస్తున్నాడన్న అను మానం కూడా వచ్చింది వాడు విమల గురించి మాట్లాడుతున్నప్పుడు వాడి ముఖం వివర్ణంకావడం, మాటలు తడ బడడమే నేను వాడిని అనుమానించ డానికి కారణమైనాయి

కొన్నాళ్లపాటు కామేశ్వరరావు విమలల గురించి నాలో అంతులేని ఆలో చనలు సాగాయి కానీ కాలక్రమాన కొన్నినెలల అనంతరం వాళ్ళవిషయం నా మనసులో మరుగున పడిపోయింది

ఒకరోజు మా సెక్షనుకు శుభలేఖల కట్టపట్టుకుని వచ్చింది విమల ఆమె వివాహం నిశ్చయం అయింది కామేశ్వర రావుకూ నాకూ శుభలేఖలు ఇచ్చింది

కామేశ్వరరావుకు శుభలేఖ ఇస్తు న్నప్పుడు "నన్ను క్షమించు కామేశం" అని విమల నెమ్మదిగా అన్నది ఆమె మాటలు నా చెవిని పడకనే పడ్డాయి కామేశ్వరరావు స్నేహభావాన్ని అపార్థం చేసుకున్నందుకు విమల ఇప్పుడు పశ్చాత్తాపపడుతుందని అనుకున్నాను

కామేశ్వరరావు ఒకసారి నా వైపు చూసి మళ్ళీ విమలవైపు తిరిగి "ఛ ... ఛ ... ఇందులో నీ తప్పేం ఉంది ... నువ్వే నన్ను క్షమించు" అన్నాడు తగ్గు స్థాయిలో

విమల పెళ్ళికి కామేశ్వరరావు రాలేదు నేను విమల పెళ్ళికి వెళ్ళ బోతుంటే నా దగ్గరికి పరుగెత్తుకవచ్చి దంతంతో చేసిన ఒక తాజ్‌మహల్ బొమ్మను నా చేతిలో పెట్టి ఇది విమలకు నా తరపున ప్రెజెంటేషన్‌గా అందజెయ్యి ... నాకు చాల ముఖ్యమైన పనొకటి తగిలింది ... నేను పెళ్ళికి ఎటెండ్ అవడానికి కుదరదు పెళ్లికి రాలేకపోయినందుకు నన్ను క్షమించ మని విమలతో చెప్పు" అని చెప్పి ఎలా వచ్చాడో అట్లానే పరుగులాంటి నడకతో వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళి పోయాడు

విమల పెళ్ళి అయిపోయింది!

పెళ్ళయిన తరువాత విమల ఉద్యో గానికి రాజీనామా చేసింది రోజులు అలా గడిచిపోతున్నాయి

ఆ ఆదివారం నేనూ, కామేశ్వరరావూ సినిమా ప్రోగ్రాం వేసుకున్నాం నేను వాళ్ళింటికి వెళ్ళాను "ఇప్పుడే బట్టలు మార్చుకుని వస్తానండు" అంటూ నన్ను డ్రాయింగ్ రూమ్‌లో కూర్చోబెట్టి లోపలికి వెళ్ళాడు కామేశ్వరరావు

ఏమీ తోచక బల్లమీద ఉన్న నవల తీసి పేజీలు తిరగవెయ్యడం మొదలు బెట్టాను. నవల మధ్యనుండి ఒక శుభ లేఖ క్రిందపడింది వంగి దానిని తీసి మడత విప్పిచూశాను

అది విమల పెళ్ళి శుభలేఖ!!

మళ్ళీ దానిని మడిచి నవల మధ్య పెట్టబోతూ ఏదో అనుమానం వచ్చి శుభలేఖ విప్పిచూసి ఉలిక్కిపడ్డాను.

ఆ శుభలేఖలో వరుడి పేరుని కొట్టి వేసి అక్కడ తన పేరు వ్రాసుకున్నాడు కామేశ్వరరావు !!!



# చక్రపాణి

కావిలిపాటి విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

"అయితే ఒక్కగా నొక్క చెల్లెల్ని నట్టేట్లో ముంచేస్తావా ?"

"ఎందుకు ఏట్లో మునగడం ? మేమింత కట్నం ఇచ్చుకోలేము బాబూ ఇంక మా ఇంటికి శునకంలా రాక పోకలు సాగించకు, అని అతగాడికి చెప్పేయ్ అయినా ఆడపిల్లగం వాళ్ళం, జాగ్రత్తగా ఉండాలి అతనలా మన ఇంటికి వచ్చిపోతూండడం బాగుండదు" వచ్చే కోపాన్ని అదిమిపెడుతూ అన్నాడు రమేష్.

"తమకున్న ఆస్తిలో కొంతభాగం వెచ్చించింది తల్లి తనకు చదువు చెప్పించిన మాట వాస్తవమే కాని తానిప్పుడు పాతికవేల రూపాయలు ఎక్కడనుంచి తేగలడు ? భార్యను పోషించడం భార

మవుతుందనే తనతో అమెరికా ఆమెను తీసుకు వెళ్ళనన్నాడు కొత్తదంపతులు విడిగా కొన్ని సంవత్సరాలు ఉండాలన గానే, విశాలహృదయంతో తన బావ మరిది చెల్లెలు ఖర్చు భరిస్తానన్నాడు. అలా భరించాడు కూడా. అతన్ని పాతిక వేలు ఇయ్యి అని అడగటం బాగుంటుందా ?"

"కొన్ని క్షణాలు వాతావరణం గంభీరంగా మారిపోయింది కొడుకు లేచి ఏడవటంతో శశి పక్కగదిలోకి వెళ్ళిపోయింది "

"మనస్సు పారేసుకుందిరా హేమ నేను ఎంత వద్దని నెత్తికొట్టుకున్నా అది ఆ అబ్బాయితో తిరగటం మానడం లేదు ఇహ ఊరూ వాడా గోలయి పోతూంటే, ఆ అబ్బాయి తల్లిదండ్రు లను కలిసి మాట్లాడాలనుకుంటూంటే ఆ అబ్బాయి చెప్పాడు పాతిక వేలిస్తే కాని మా వాళ్ళు వప్పుకోరని." చెమ్మ గిల్లుతూన్న కళ్ళు వత్తుకుంటూ రుద్ద స్వరంతో అంది రత్నమ్మ

"రమేష్ ముఖం కోపంతో ఎర్ర వారింది హేమ ఎన్ని గంటలకు వస్తుంది ఇంటికి? ఆ అబ్బాయి ఇవ్వాళవస్తాడా?" అడిగాడు

"హేమను సారధి దగ్గరకు పంపించేశాను బాబూ ? వారంరోజుల క్రిందట "

"సారధి ఎక్కడున్నాడు నా దస్సలు నాకు ఉత్తరమే వ్రాయడు "

"ఒరిస్సా రాష్ట్రంలో ఏదో అడివి ఊరు రైల్వే ఉద్యోగం కదూ ! నేనూ అక్కడికే పోదామనుకున్నాను కాని,"

"ఈ కుర్రాడు జారిపోతాడేమో ! నేనూ వస్తున్నానని ఉండిపో నూవ్ "

"అవునారి నిజమే ఏం చెయ్య మన్నావ్ "

"అమ్మా ! నువ్వు పెద్దదానవేకాని ఆలోచనలేదు మనకి ఉన్నదీ మిగిలిందీ ఈ ఒక్క ఇల్లే కదూ ! అమ్మితే పది వేలన్నా రావు శశికి వాళ్ళిచ్చిన ఆస్తి అమ్మి ఆడబిడ్డకి కట్నం ఇయ్యంటే ఏం బాగుంటుంది ? సరే, అతన్ని ఓసారి రమ్మని కబురుచెయ్యి. అతను మెడికల్ కాలేజీలో చదువుతున్నాడు కదూ !"

"ఆ, చెప్తాను ఉండు పక్కింటి వారబ్బాయీ చదువుతున్నాడు అతను ఇంటికి వచ్చాడేమో ! అంటూ గబగబా పక్కింటికి వెళ్ళింది రత్నమ్మ

"గుప్పిటతో జుట్టుపీక్కున్నాడు రమేష్ వ్వ్ అమెరికాలో ఉండిపోతే నాలుగు నెలలదాకా ఇక్కడినుంచి ఉత్తరం రావటమే జరిగేదికాదు స్వదేశం, స్వంత మనుషులూ, అని వాచిపోయి వచ్చేస్తే, రాగానే పిడుగు లాటివార్త ఇప్పుడు ఏమిటి చెయ్య టమో అతనికి తోచటంలేదు తండ్రి

పోలీస్ సబిన్స్పెక్టరుచేసి పెద్ద ఆర్జించ లేదు. కాని తామున్న ఇల్లు కట్టించేడు తండ్రి ఇచ్చిన ఆస్తి నిలబెట్టేడు. రత్నమ్మకి కొడుకులిద్దరు ఒక కూతురు. రమేష్ గురించి ఆమె కెప్పుడూ బెంగలేదు తెలివైనవాడు, చదువుకున్నాడు పైగా భార్య ఆస్తితో వచ్చింది అతను చదువుతున్నాడని. ఆ చదువుకోసం అమె కొన్ని భూములు అమ్మేసింది కూడా మిగతా మిగిలి ఉన్న భూములు సారధి చదువూ, తిండీ ఇంటి ఖర్చులక్రింద అయిపోయింది ఇప్పుడు మిగిలింది ఇల్లు మాత్రమే ఒక వాటా అద్దెకిచ్చి తానొక వాటాలో ఉంటూ, రమేష్, సారధీ పంపించే డబ్బుతో హేమను కాలేజీలో చదివిస్తూ కాలక్షేపంచేస్తూంది రత్నమ్మ "

"ఇప్పుడే వెళుతున్నాడా అబ్బాయి, చెప్పాను అతన్ని ఓసారి ఆనక మనింటికి రమ్మని చెప్పమని" అంది రత్నమ్మ వచ్చి కొడుకు ఎదర బల్లమీద కూర్చుంటూ

"సరే, రానియ్ నేను మాట్లాడు తాన్లే" అంటూ గదిలోకి వెళ్ళిపోయాడు రమేష్

* * *

"ఏమండీ! రమ్మన్నారట?" అంటూ సాయంత్రం ఆరుగంటలవేళ వచ్చాడు ఓ పాతికేళ్ళ యువకుడు బూటుశబ్దంచేస్తూ నడుస్తూ "

"ఆ, రా బాబూ కబురుచేశాను నిజమే అబ్బాయి అమెరికానుంచి వచ్చాడు..."అంటూహడావుడిగా కుర్చీ వేసింది రత్నమ్మ

తర్వాత రమేష్నీ శశినీ పిలిచి పరిచయంచేసింది కొంచెంసేపు అమెరికా అక్కడి వాతావరణం అతని ట్రెయినింగూ గురించి సంభాషణ సరళంగానే సాగింది వారి మధ్య రత్నమ్మ కాఫీలు తెచ్చి ఇచ్చింది "

తర్వాత నెమ్మదిగా, మీరు హేమను ప్రేమించారట, పెళ్ళిచేసుకుంటానన్నారట హార్టీ కంగ్రాచ్యులేషన్స్ ముహూర్తం పెట్టించమన్నారా?" అడి గాడు రమేష్

"మా అమ్మా, నాన్నగార్నీ సంప్రదించండి" అన్నాడతను

"మీరు లెటరు వ్రాయండి తర్వాత మేం వెళతాం" అతనివైపు చురుగ్గా చూస్తూ అన్నాడు రమేష్

"పాతికవేలు కట్నం ఎగ్రీవేనా?"

"ఇవ్వలేం..."కచ్చితంగా చెప్పాడు రమేష్

"అయితే...అయితే..."

"అయితే...పెళ్ళిచేసుకోరా?"

"అమ్మా, నాన్నగారూ వప్పుకోరు "

"అమ్మా, నన్నాగార్నీ అడిగే ఆడ పిల్లతో ప్రేమకలాపానికి దిగాల్సింది. వెళ్ళండి మరెప్పుడూ మా ఇంటి ఛాయలకు రాకండి''

ఛి చదువుకున్న వ్యక్తి మళ్ళీ. చీత్కారంగా అన్నాడు రమేష్

గబగబా వెళ్ళిపోయాడతను

"బాబూ ! మోహన్" కంగారుగా అతని పిలుస్తూ, ఇంతసేపై తలుపు వారన నిల్చున్న రత్నమ్మ ఇవతలికి వచ్చింది

"వెళ్ళనీ అమ్మా ! అతని కన్నులు హేమ నివ్వద్దు. ఈ ఒక్క పాతిక వేలు కట్నంతో సరిపోదు అతని తత్వం తెలియటంలేదూ ! జీవితాంతం మనని తాల్చుకుతింటాడు"

"అలా కాదు బాబూ రమేష్ వెనక్కి పిలువు ఒక్కమాట తొందర పడవద్దు" అంది రత్నమ్మ ఆత్రతగా

"ఇతని పాటి వరుడు దొరక్క పోడులే ఎందుకమ్మా ఆ కంగారు ?"

"కంగారు కాదు బాబూ !"

"మరేమిటమ్మా వెళ్ళనీ, పీడ వదిలింది"

"అదికాదు"

"ఏమిటమ్మా !"

"ఎలా అయినా హేమను అతని కిచ్చి పెళ్ళిచెయ్యాలి"

"చెయ్యలేం అది మన శక్తికి మించిన పని"

"అంతా మించిపోయింది బాబూ ! నీకు తెలియదు"

"ఏమిటది? ఏం మించిపోయింది ?" అతని కనుబొమలు ముడివడ్డాయ్

ఆమె తలవంచి మౌనంగా ఉండి పోయింది

"చెప్పమ్మా ! ఏమిటి మించి పోయింది ?" ఆమె మౌనాన్ని సహించ లేనట్లు అడిగాడు

"హేమ... హేమ."

"హేమ ఏమిటి ? ఏమన్నా హద్దులు దాటారా ?"

"చిన్న పిల్ల, గారంగా పెంచాం. క్షమించు బాబూ దాన్ని..."

"అమ్మా ! ... ఏమిటి జరిగింది ? ఏమిటి క్షమించాలి ?"

"ఆడపిల్లకు స్వేచ్ఛ ఇవ్వటం చాలా పొరపాటయ్యింది బాబూ ! చదువు కుంటూంది దానికి తెలియదా ? అను కున్నాను కాని"

"అసలేమిటయ్యిందో చెప్పమ్మా ! నాకు మహా గొప్ప చిరాగ్గా ఉంది"

"ఏముంది చెప్పటానికి ! నువ్వు గ్రహించే ఉంటావు హేమ నెల తప్పింది అందుకే ఆ మారుమూల వాడి దగ్గరకు పంపించేశాను" అతి నెమ్మదిగా చెప్పింది రత్నమ్మ

తల చేత్తోపట్టుకుని కుర్చీలో చతికిల పడ్డాడు రమేష్

రెండు క్షణాల తర్వాత మళ్ళీ అంది రత్నమ్మ, "అక్కడ డాక్టరుకి చూపించాం పోయే ప్రయత్నమేదన్నా చేస్తాడని, నాలుగు నెలలు నిండాయని ప్రాణానికి ముప్పనీ చెప్పాడు", అని

అతనికి విపరీతంగా కోపంవస్తూంది, తల్లిని చూస్తుంటే పరిస్థితి తలుచుకుంటే బాధగా ఉంది అసహ్యంగా ఉంది అప్పు అమెరికానుంచి ఎందుకు వచ్చానా అనిపిస్తూంది మౌనంగా లేచి అక్కడనుంచి వెళ్లిపోయాడు

తర్వాత విషయం భార్యకు వివరించి "ఏమిటి చేద్దాం శశీ?" అన్నాడు

"ఏమిటి చేస్తాం అత నడిగిన కట్నం ఇచ్చి పెళ్ళిచెయ్యటమే," అంది శశి

"నా దగ్గర అంత డబ్బెక్కడిది?" నవ్వాడు రమేష్

"తోటో, భూమో అమ్మకానికి పెట్టండి. ఇక ఆలస్యంచేస్తే బాగుండదు "

అతను బిడియంగా తలవంచి మౌనంగా ఉండిపోవటంచూసిన శశి, అతని క్రాపు ఆప్యాయంగా సవరిస్తూ, ఈమాత్రం దానికి ఇంత దిగులా ! నే చెప్పినట్లు చెయ్యండి ! చెల్లెలు కనుక మీకు కష్టంగా ఉంది ఇదే పని మన పాపచేస్తే !"

"శశీ'' .ఆమె ఔదార్యానికి విస్తుపోయాడతను.

"మరేమీ మాట్లాడవద్దు రేపు ఉదయాన్నే వెళ్ళి వ్యవహారం సెటలు చేసుకురండి ఆ అబ్బాయి తలిదండ్రులను కలసి ముహూర్తం పెట్టించండి "

"మీ అన్నయ్యను చూసి వద్దామనుకున్నాం.. "

"తర్వాత. హేమ పెళ్ళి అయిన తర్వాత ''

"నీకు ఎప్పుడన్నా జీవితంలో ఆ డబ్బు ఇచ్చేస్తాను శశీ ''

"ఓ అలానా ఎలా ఇస్తారు చెప్మా !''

"నిజం నీ అప్పు తీరుస్తాను "

'మిమ్మల్ని నేను కొనేసుకున్నాను కదండీ మీ సంపాదనంతా నాదే ! అలాటప్పుడు, మీరెలా తీరుస్తారు ", అంది నవ్వుతూ

"కట్నం తెచ్చావని కదూ ! అలా అంటున్నావు ?"

"అవును కట్నం ఇచ్చి కొనుక్కున్నాను కనుక మీరూ, మీ సంపాదనా, మీ మంచిచెడ్డలూ, మీ బాధ్యతలూ, నావే అన్నీ.''

''థాంక్సు'', అంటూ ఆమె చెయ్యి పట్టి ముద్దుపెట్టుకొంటూ హాయిగా నవ్వాడు రమేష్

మర్నాడు ఆ విషయం తల్లికి చెప్పి శశి ఆస్తులున్న చోటికి బయలుదేరాడు రమేష్

* * *

వారంరోజులు దొర్లాయి పద్మావతి పాణిని చూడనన్నా లేదు అతనూ ఆమె గదివైపు రావాలనీ, ఆమెతో మాట్లాడాలనీ, ప్రయత్నించలేదు

అన్నపూర్ణమ్మ మాత్రం వారిద్దరూ కలిసి సంతోషంగా జీవించాలనే ఆరాటంతో, వారికేవో అనునయ వాక్యాలు చెబుతూంది "జరిగిపోయిందానికి విచారించి లాభంలేదు మన దురదృష్టమిలా ఉంది వాడి కళ్ళు పోయాయి నువ్విలా మౌనంగా బాధపడి ఏడ్చి, నన్నూ, బాబునీ విసిగించడం బాగుందా పద్మావతీ! రూపం ఉండి గుణం, ధనంలేని వారెంతమందిలేరు ! వారికన్నా పాణి నయంకదూ!" అని ఇంకేవేవో దృష్టాంతరాలు చెప్పి పద్మావతినీ, "ఆ అమ్మాయిని ఓసారి పిల్చి మాట్లాడెయ్! ఈ గంభీరత చెదిరిపోతుంది మీ రిద్దరూ ఇలా మూతులు ముడుచుకు కూచుంటే నాకు చిరాగ్గాఉంది అని పాణినీ, మృదువుగా మందలించేది" తాను కాఫీ, ఫలహారం, భోజనం తీసుకుంటూ అప్పుడప్పుడూ "పద్మావతి భోజనం చేసిందా అత్తయ్యా?" అడిగేవాడు పాణి

పద్మావతి తాలూకు సామానులు తెచ్చి అప్పగిస్తూ పాణి రంగారావుకి డబ్బు ఇచ్చిన సంగతి కూడా చెప్పాడు పద్మావతికి సింహాచలం ఇంతకాలమై తాను అతని భార్యననే సంగతి దాచాడనే సహించలేకపోతూన్న పద్మావతికి విషయం అగ్నిలో ఆజ్యంపోసినట్లయింది రోషంతో కుతకుతలాడిపోతుంది ఆ డబ్బుకోసమేగా తాను రంగారావుచేత చెంపదెబ్బ తిన్నది తననొక ఫూల్‌ని చేశాడు పాణి అస్సలీ యింట్లోంచి తానెందుకు వెంటనే వెళ్ళిపోకూడదు ఎక్కడికి వెళుతుంది? రంగారావు రికమండుచేసిన ఉద్యోగానికా! ఛీ! ఛీ! వెళ్ళకూడదు అస్సలు రంగారావు ముఖం ఈ జన్మలో మరి చూడగూడదు తనను రంగారావు అవమానించాడని అంత పౌరుషపడి ఆవేశపడిపోయిన పాణి, ఆ రంగారావుకి మళ్ళీ ఆ డబ్బు ఎందుకివ్వాలి? ఇటుపైన ఇతని వ్యవహారాల్లో జోక్యం పెట్టుకోకూడదు ఇతనిచ్చే జీతంతో ఇలానే బ్రతికేస్తాను విధి నన్ను క్రూరంగా శిక్షించింది. నాకు తెలియకుండానే వీరి డబ్బుతో నా శరీరం పోషింపబడింది వీరి పంచనే నా జీవితం ఇలా రాలిపోతుంది? చక్రపాణిగారు ఎంత లోతుగుండెమనిషి? అసలు రంగారావు అలా నన్ను కొట్టకుండా ఉంటే ఏనాటికీ ఈ విషయం బయటపెట్టే వాడుకాదు తన భర్త ఏనాటికైనా తనను వెతుక్కుంటూ వస్తారని, ఎండమావిలాంటి ఆశతో కలలు కంటూ జీవించేది రంగారావుకి కోరి ఆ డబ్బు పంపించడంలో అతని ఉద్దేశ్యమేమిటో అడిగెయ్యాలి? అని అనుకునే పద్మావతి ఓ రోజు అతను భోజనానికి డైనింగు రూమ్‌లో కూర్చున్నప్పుడు వెళ్ళి అతని ఎదర కుర్చీలో కూర్చుంది

"అబ్బ ఇవాళ ఏం అదృష్టం" అని నవ్వి పద్మావతి ముందుకూడా ఓ ప్లేటు ఉంచి అన్నం పెట్టింది అన్నపూర్ణమ్మ

"ఏమిటత్తయ్యా ఆ అదృష్టం" చిన్నగా నవ్వుతూ అడిగాడు పాణి

''ఇవాళ నీతో భోజనానికి పద్మావతి నీ ఎదర కుర్చీలో కూర్చుంది" అంది అన్నపూర్ణమ్మ.

పాణి వదనం గంభీరంగా మారి పోయింది. "ఆరోగ్యం బాగుందా! పద్మావతీ!" పలకరింపుగా అడిగాడు పాణి.

''బాగానే ఉంది" పొడిగా జవాబు చెప్పింది పద్మావతి. అతనింకేమీ ప్రశ్నించలేదు. మౌనంగా భోజనంచేస్తున్నాడు. నాలుగు క్షణాల తర్వాత ''నన్నెందుకు పూల్‌ని చేశారు!" అడిగింది పద్మావతి.

నవ్వాడు పాణి "అలా అంటావేమిటి పద్మావతీ!" అంటూ తాను అతని 'భార్య' అని ధృవపరచిన దగ్గరనుంచీ అతను బహువచన ప్రయోగం చెయ్యటంలేదు. గ్రహించింది పద్మావతి. కాని అతని గంభీరవదనంలో ఆమె కే భావనా వ్యక్తంకావడంలేదు.

' ఆ డబ్బుకోసమే కదూ నేను చెంప దెబ్బ తిన్నాను ? మీ రా డబ్బు అతని కివ్వనే ఇచ్చారు.'' ఆమె గొంతు రుద్ధమై మూగబోయింది తర్వాత.

"క్షమించు పద్మావతీ ! నిన్ను నా దగ్గరకు తీసుకవచ్చింది ఆయన. ఆయనకు నేను చాలా ఋణపడి ఉన్నాను. ఆ ఋణం డబ్బుతో తీర్చుకునేది కాదు కూడా. అయినా ఆఖరుసారిగా ఇచ్చే శాను నిన్ను అవమానించాడు, కనుక అతనింక ఈ ఇంటి గుమ్మం తొక్కనూ లేడూ, మన డబ్బు తిననూలేడు"

"నేనింక మీ వ్యవహారాల్లో జోక్యం చేసుకోనులెండి" ఆమె గొంతు ధ్వనించిన తీరుకే మురిపెంగా పెదవులచాటున నవ్వుకుంటూ "నాకేమిటున్నాయి ఇంక వ్యవహారాలు? ఈ ఇల్లు మీది. వ్యవహారాలు మీవి. వేళకింత తిండి పడేస్తే పడి ఉండేవాడిని నేను" అన్నాడు పాణి.

"నేనేం అంత ఆశపోతును కాను. నాకిదంతా స్వంతం చేసుకోవాలనే దురాశ లేదు. తిండి పడేస్తే ఉండేదానను నేనే ..."

"నీ కెందుకో నా మీద చాలా కోపంగా ఉంది.''

"మీ మీద నేను కోపగించుకున్నంత మాత్రాన మీకేం నష్టం ? అయినా మీ మీద కోపగించుకొని నేనేం చెయ్యగలను ? నేనొక నష్టజాతకురాలిని. నాలాటి దురదృష్టవంతురా లీ ప్రపంచంలో ఉండదు. నేనెంతో పాపం చేసుకు పుట్టాను. అస్సలు నాకు అతి సామాన్యమైన స్త్రీ అనుభవించే జీవితం కూడా లేదు,'' అంటూ డైనింగ్ టేబిలుపై తల ఆన్చి అన్నం ప్లేటు పక్కకుతోసి రోదించసాగింది పద్మావతి

మంచినీళ్ళగ్లాసు తడిమి తీసుకొని

అన్నంలో చెయ్యికడిగి లేచి తన గదికి వెళిపోయాడు పాణి.

అప్పుడు తన తప్పు తెలుసుకుంది పద్మావతి. ఆలోచనా రహితంగా అతన్ని నొప్పించి తాను బాధపడుతూంది. అతను మాత్రం ఏం చెయ్యగలడు ? జరిగిన విషయాలూ, పరిస్థితులూ ఏమీ దాచకుండా వివరించి చెప్పాడు అతని హృదయం విప్పి తన ముందుంచాడు. నీ ఇష్టమొచ్చినట్టు బ్రతకొచ్చు అన్నాడు. తామిద్దరూ భార్యాభర్తలమనే విషయం ఇతరులకు తెలియకుండా కట్టుదిట్టం చేశాడు. తానిలా బాధపడి ఏడుస్తుందనేగా ఇంత కాలం ఆ రహస్యం దాచాడు. తన భార్యను పరాయివ్యక్తి అవమానిస్తూంటే సహించలేక చప్పున నోరు జారాడు. అదే అతని పొరపాటుగా అతన్ని శిక్షిస్తూందా తను ? పశ్చాత్తాపంలాటిది మనస్సును మెత్తబరుస్తూంటే, తానూ భోజనం దగ్గరనుంచి లేచిపోయింది.

అన్నపూర్ణమ్మ ఇద్దరిపైనా విసుక్కుంది. "కావాలంటే కలసి బ్రతకండి. లేదా మునపటిలా స్నేహితుల్లా ఉండండి. అదీ కాదంటే ఎవరి దారిన వారు బ్రతకండి. అంతేకాని ఈ రబసంతా దేనికి ? నాకు మహ గొప్ప చిరాగ్గా ఉంది," అని కాస్సేపు ఇద్దర్నీ మందలించి మళ్ళీ అన్నాలు తినమంది

"వద్దులే అత్తయ్యా రాత్రి తింటాను." అని నవ్వేశాడు పాణి. తన ప్రవర్తనకి తానే నవ్వుకున్నాడు. 'నిన్ను భార్యనులా ప్రేమించలేదంటూనే ఆమెను భార్యనులా చూస్తున్నాడు. ఆమె తాను అన్నం తింటూంటే ఏమేమో అన్నదని నిజమైన భర్తలా అలిగి, అన్నంలో చెయ్యికడిగి లేచిపోయాడు.' ఏమనుకుందో పద్మావతి. 'ఆమె కూడా ఇప్పుడు తనను భర్తగా భావించక తప్పదు. నిజం తెలుసుకున్నాక ఎలా కాదనుకోగలదు ? ప్చ్. పాపం. భర్త గుడ్డివాడని సహించలేకపోతూంది. తీవ్రమైన ఆవేదనతో అలమటించిపోతూంది. ఆ బాధ ఉపశమనం పొందేవరకూ, ఆమెను కదిలించి మాట్లాడకూడదు.' అనుకున్న పాణి అన్నపూర్ణమ్మకు ఆ సంగతే చెప్పాడు.

"ఒక్కసారిగా నేను భర్తనని తెలిసి తట్టుకోలేకపోతూంది పద్మావతి. ఆమెను ఏమీ అనకు. క్రమంగా మామూలు మనిషి అయ్యేదాకా." అని.

గబగబా అతని గదిలోకి వచ్చిన పద్మావతి, "క్షమించండి ఇటుపైన ఎప్పుడూ మిమ్మల్నిలాటి మాటలతో వేదించను. వెళ్ళి భోజనం చెయ్యండి." అనేసి వచ్చినంత వేగంగానే వెళ్ళిపోయింది.

మౌనంగా ఉండిపోయాడు పాణి.

అన్నపూర్ణమ్మ తన అనారోగ్యం సంగతే విస్మరించిందిలా ఉంది మంచం

మీద నుంచి లేవని మనిషి. పాణి పద్మావతి తన భార్య అని చెప్పిన దగ్గర నుంచీ జ్వరంఉన్న కాస్సేపూ పడుకొని తర్వాత లేచి తిరగడం, శ్రద్ధగా మందులు వాడటం మొదలుపెట్టింది. ఇప్పుడు ఆమెకు జ్వరంరావడంలేదు. ముఖ్యంగా మనిషికి బ్రతుకుమీద ఆశ ఉన్నప్పుడు ఏ ఔషధమైనా ద్విగుణీకృతంగా పనిచేస్తుందేమో! మనిషి మనోవ్యథతో జీవితంమీద విరక్తితో మందులు మింగితే మందుల దారి మందుదీ, రోగందారి రోగందీ అవుతుంది. ఆమెకు పాణీ, పద్మావతీ భార్యాభర్తల్లా కలిసి బ్రతకాలనీ, చాలకాలంగా, నిశ్శబ్దంగా, నైరాశ్యం నిండి ఉన్న ఈ ఇల్లు, వారి పిల్లలతో కలకలలాడాలనీ ఉంది. ఆ సమయంకోసం ఆరాటంతో ఎదురుచూస్తూంది. భగవంతుణ్ణి ప్రార్థిస్తూంది.

మళ్ళీ ఇదివరకటిలా పాణితో మాట్లాడాలనీ, చనువుగా ప్రవర్తించాలనీ, ఇంకా అతన్ని భార్యలా అనుసరించాలనీ, మనస్సుని కుదుటపరచుకునే ప్రయత్నంలో మరి రెండురోజులు గడిచాయి పద్మావతికి

పాణి కూడా ఆమెతో మాట్లాడాలని ప్రయత్నించలేదు. భవిష్యత్ గురించి ఆలోచన చెయ్యలేదు. ఆమె ఇష్టానికే వదిలిపెట్టాడు.

* * *

"పిన్నీ! ఈ రోజు చాలామంచిది కదూ!" అడిగింది ఉదయం లేస్తూనే పద్మావతి.

"ఎందుకు మంచిదికాదు? అన్నిరోజులూ మంచివే అతి సవ్వేసిందామె", పద్మావతి ఏ ఉద్దేశ్యంతో ఎందుకడిగిందో తెలుసుకోకుండానే మామూలుగా.

కాఫీ తాగి స్నానంచేసి బట్టలు వేసుకుని, అలా బజారువైపు వెళ్ళివస్తానని వెళ్ళిపోయింది పద్మావతి.

"అమ్మాయ్ కారుతీసుకెళ్ళు. పద్మావతికి వినిపించేలా అంది అన్నపూర్ణమ్మ

"అత్తయ్యా. పద్మావతి ఎక్కడికి వెళుతుంది?" అడిగాడు పాణి.

"బజారుకట."

"ఎందుకో కనుక్కోలేదా?"

"ఏ పుస్తకమో కొని తెచ్చుకుంటుందేమో!" అనేసింది. కాని తర్వాత పద్మావతి తెచ్చుకున్న వస్తువులుచూపి ఆశ్చర్యంతోపాటు ఆనందం కూడా కలిగిందామెకు.

వెళ్ళికని ఇచ్చిన పట్టుచీర కట్టుకుని దేవునిదగ్గర దీపారాధన చేస్తున్న పద్మావతి వదనం ఉదాసీనంగా గంభీరంగా ఉంది.

"నివేదనచెయ్యి" అంటూ పాలూ, పళ్ళు తెచ్చి అక్కడ పెట్టింది అన్నపూర్ణమ్మ.

ఆమె బజారునుంచి తెచ్చుకున్న

# రైతు యోధులకు జేజేలు

"జయ"—అంటే ప్రజల మనోరథంమీద ఎత్తిన జయ పతాక

"సోనా"—అంటే దీక్షా స్వర్ణ కంకణ ధారణ

"రత్న"—అంటే రత్నాల రాసుల వంటి కళ్లంలో పంటకుప్పలు

"జగన్నాథ్"— అంటే ప్రగతివైపు పరువెత్తే జగన్నాథ రథచక్రాలు

ఇవన్నీ వేటికి పేర్లు? ఇవి మన రాష్ట్రంలో పండిస్తున్న మేలురకం వంగడాలు.

పొలాలలో హలాలతో పకృతిమీద యుద్ధంచేస్తున్న రైతు వీరులకు జేజేలు.

గడచిన ఏడాది రాష్ట్రంలో వరి ధాన్యం ఉత్పత్తి 58 52 లక్షల టన్నులు. 1974–75 లో 14 లక్షల ఎకరాలకు పైగా వరిపైరు వేశారు.

సమాచార, పౌర సంబంధశాఖ, హైదరాబాదు.

వస్తువులూ, మంగళసూత్రాలూ, మట్టెలూ నల్లపూసల దండా, అవి మహాలక్ష్మిపై ఉంచి పువ్వులూ, కుంకుమాతో పూజించి మంగళసూత్రాలు మెడలో కట్టుకుంది. నల్లపూసలదండ కూడా మెడలో వేసుకొని, కాలివేళ్ళకు మట్టెలు పెట్టుకొని దైవాన్ని దీనంగా ప్రార్థించింది. తన భర్తకు దృష్టి ప్రసాదించమని అర్థించింది పద్మావతి.

తర్వాత హాలులో ఉన్న వ్యాసమూర్తి ఫోటోముందు చేతులు జోడించింది. అతనికి నమస్కరిస్తూంటే ఆమె చేతులు వణికాయి. పెదవులు అదిరాయి. అతనివేపు చూస్తున్న ఆమె చూపుల్లో చురుకుతనముంది. ఆమెనుండి నిస్సాయమైన వేడి నిట్టూర్పులు బయల్వెడలాయి. తర్వాత బొట బొటా కన్నీళ్ళు చెంపల మీంచి జారిపోయాయి. చప్పున దోసిట్లో వదనం దాచుకుంది. రెండు క్షణాల్లో చెదిరే మనస్సునీ? చిందే కన్నీటినీ చిక్కబట్టుకుని ఇవతలికి వచ్చి అన్నపూర్ణమ్మ పాదాలు తాకి నమస్కరించింది.

ఆమె పద్మావతి చేతులు పట్టుకొని "మనసు కుదుటపర్చుకో తల్లీ. ధైర్యం తెచ్చుకో" అంది రుద్ధస్వరంతో చెమ్మగిల్లిన కళ్లు తుడుచుకొని పద్మావతి ముంగురులు సవరించి ఆప్యాయంగా తల ముద్దుపెట్టుకుంది.

పద్మావతి ఇలా చేసింది అని పాణి చెవిలో గుసగుసలాడింది. అన్నపూర్ణమ్మ.

విన్న పాణి కనుబొమలు ముడి వడ్డాయి. "ఎందుకిలా పిచ్చిపని చేసింది. తీసేసి మామూలుగా ఉండమని చెప్పు. నేను అలా చెప్పానని చెప్పు" అన్నాడు.

"అమ్మాయ్ 'బాబు ఇలా అన్నాడే" అని ఆ మాట పద్మావతికి చెప్పి పద్మావతి వదనంలోకి పరిశీలనగా చూసింది. అన్నపూర్ణమ్మ.

చిన్నగా నవ్వి మౌనంగా ఉండిపోయింది. పద్మావతి.

* * *

"సినిమా కెళ్దాదాం వస్తారా?" పద్మావతి గొంతు.

వెంటనే జవాబియ్యలేకపోయాడు. పాణి. పగిరోజులై తనతో అస్సలు మాట్లాడలి మనిషి, మాట్లాడినా నిందా నిష్ఠూరం తర్వాత రోదనా, తప్ప ప్రసన్నంగా మాట్లాడని పద్మావతి "సినిమాకి వెళ్దాదాం వస్తారా?" అనేసరికి తడబడిపోయాడు.

"మొహంకడిగి బట్టలు మార్చుకొండి డ్రయివరికి చెప్పి తాను కారు సిద్ధం చెయ్యమని తెమలండి. పావుగంటమాత్రమైముంది." అని చెబుతూనే అతని అంగీకారం వినకుండానే వెళ్ళిపోయింది. పద్మావతి కచ్చితంగా వచ్చితీరాలన్నట్లు,

ఏదో అడగాలని "పద్మావతీ; అని పిలిచిన పాణికి జవాబు రాలేదు. నవ్వుకున్నాడు, తను సినిమాకు రానన్నా రెక్కపట్టుకు లాక్కుపోయేటట్టున్న ఆమె దోరణికి.

## చేసిన పరీక్షల వలన తేలింది...





# రుచికీ, విటమిన్లకూ, పుష్టికీ బిస్కట్ అంటేనే ఇది

## బ్రిటానియా గ్లూకోజ్-డి



పోల్చి చూసేందుకు చేసిన పరీక్షల వల్ల తేలిందేమిటంటే, విటమిన్లూ, పుష్టినిచ్చే పదార్థాలూ గ్లూకోజ్-డిలో ఉన్నాయనీ, రుచికి తియ్యదనానికి, కరకర లాడే రుచికీ దీనిని కావాలంటారని.

**అందుకే మరి ఏ ఇతర గ్లూకోజ్ బిస్కట్‌కన్న బ్రిటానియా గ్లూకోజ్-డి అంటేనే ఎక్కువ మంది ఆకర్షితులవుతున్నారు.**




బ్రిటానియా — బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్-BBC.GL.10-77 TL

వాళ్ళిద్దరూ సినిమాకు ప్రయాణ మవుతున్నారని కనిపెట్టిన అన్న పూర్ణమ్మ. పద్మావతి చేతికి తాళం చెవు లిస్తూ" వాడికి బట్టలు తీసియ్యి" అంది.

అలానే కానీ పిన్నీ శశి ఈ మధ్య ఉత్తరమేదన్నా వ్రాసిందా?" అడిగింది పద్మావతి.

"అత్తవారింటికి వచ్చేశా రమ్మా! రమ్మని వ్రాశాను. ఎప్పుడు వస్తుందో జవాబు రాలేదింకా "

"మీరు వెళ్ళి ఓసారి చూసి తీసుక రారాదూ?"

''అలాగే. ఆలోచిద్దాం. బాబుని అడుగుదాం. వెళ్ళు టైమవుతూవున్న ట్టుంది "

తల దువ్వుకుంటున్న పాణి వైపు ఒక్కసారి చూసి, "ఏ బట్టలు తీసి ఇవ్వమంటారు? ఎలాటివి?" అడిగింది పద్మావతి

"అత్తయ్య లేదూ ?"

"నన్ను తీసి ఇవ్వమన్నారు. ఎలాటి బట్టలు తీసి ఇవ్వమంటారు ?"

"ఏవో ఒకటి కాని, ముందు నీ వేషం తీసెయ్."

"నేనేమీ వేషం వెయ్యలేదు."

"అత్తయ్య చెప్పింది, మంగళ సూత్రాలూ అవీ...తీసెయ్. మామూలు గానే ఉంటే సరి."

"ఎందుకు తీసెయ్యాలి ? మీరు నా భర్త అని ప్రకటించడంలో నాకేమీ చిన్నతనంలేదు."

"క్షణికమైన ఆవేశంలో అలాటి నిర్ణయానికి వచ్చి ఉంటావు. వద్దు తీసెయ్. పెళ్ళికాని అమ్మాయిలానే ఉండు. జీవితం చాలా అమూల్యమైనది. మంచి అవకాశాలు జారవిడుచుకో కూడదు.''

''మీ లెక్చరు వినడానికి నాకు ఓపిక లేదు కాని ఎవరన్నా వింటారు ఇంకేం మాట్లాడకండి. కాని ఎలాటి బట్టలు తీసి ఇవ్వమన్నారు ?"

"ఎలాటి బట్టలా ?'' అని క్షణం తర్వాత, ''నీకు బాగున్నవి" అన్నాడు.

''నేను కాదు వేసుకునేది మీరు ?"

నవ్వి, ''నేను ఏ బట్టల్లో అందంగా కనుపిస్తానో అవి," అన్నాడు. ఆమె బ్లూ కలర్ టెరిలిన్ సూటుతీసి మంచం మీద పెట్టింది ''ఇవిగో మంచంమీద ఉంచాను అంటూ.''

బట్టలు చేతిలోకి తీసుకుంటూ, ''నువ్వు రెడీయేనా ?'' అడిగాడు పాణి.

''జడ అల్లుకునీ ..

చీర మార్చుకునీ . ." అని నవ్వి, "నన్నెందుకు అంత తొందర పెట్టావు ?" అన్నాడు పాణి.

ఆమె కూడా చిన్న శబ్దమయ్యేలా నవ్వి, ''తొందరగా తెమిలిపోతాను లెండి," అని అవతలి కెళ్ళిపోయింది







# సిగ్నల్ ఫ్లూరైడ్ మాత్రమే దంతక్షయం, నోటిదుర్వాసన అరికట్టుతుందని నిరూపిస్తుంది.

**దంత పరిశుభ్రతకు అపూర్వమూలపదార్థము కలది**




**సిగ్నల్ ఫ్లూరైడ్ మాత్రమే నిదర్శనం కలది-**
**మీ దంతవైద్యుని అడగండి.**

అతని కేదో కలవరంగా బెదురుగా తడబాటుగా హృదయం తీవ్రంగా స్పందిస్తూంది. అంతేకాదు. వాటిచాటున ఆనందమూ ఉంది. పద్మావతి తన భార్యగా అంగీకరిస్తూందని.

నిజంగా ఆమెకూ తనకూ కూడా రిలీఫ్ కావాలి. పదిరోజులుగా కాలం బరువెక్కిపోయింది. క్షణమో యుగంగా గడుస్తూంది. బట్టలు వేసుకొని పద్మావతి రాకకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు పాణి.

పాణి చెయ్యిపట్టుకొని కారు దగ్గరకు నడిపించింది పద్మావతి ఇవాళ అతని చెయ్యి అందుకుంటూన్నప్పుడదేదో బెరుగ్గా అనిపించింది. తన చేతినిపట్టిన అతని చేతి స్పర్శ కొత్తగా ఏదోలా ఉంది. ఇదివరకు అతను తన కేమీ కాడు. అంధుడనే జాలితో సాను భూతితో మాత్రమే చెయ్యిపట్టి నడిపించింది. ఆ చేతిని స్పృశించడానికి బిడియం కాని మరొక భావనకి కాని అప్పుడు ఆమె హృదయంలో స్థానం లేదు. ఇప్పుడు అతను తన భర్తనే భావన అతని రూపాన్ని ఇదివరకటిలా చూడలేకపోతూంది. అతని అంధత్వం తన అంధత్వంలా కృంగిపోతూంది. అతని స్పర్శలో ఏదో కొత్తదనం అనిపిస్తూంది.

ఇదివరకైతే అతను ఫ్రెంట్ సీట్లో డ్రయివరు పక్కన కూర్చుంటే తను బేక్ సీట్లో కూర్చునేది పద్మావతి. ఇప్పుడు అతన్ని కూడా బేక్ సీట్లోనే కూర్చోమని అతని పక్కన కూర్చుంది పద్మావతి,

బాల్కనీలో అతని పక్కన అతనికి దగ్గరగా కూర్చుంది పద్మావతి. ఆమె మెత్తని స్పర్శ అతనికి గిలిగింతలు పెడుతూంది.

అతన్ని తాను అసహ్యించుకోవడం లేదనీ, ఇన్నిరోజులుగా అతను అంధుడయ్యేడే అనే బాధలోనే, అలా ఉదాసీనంగా, మౌనంగా ఉండిపోయాననీ, అతన్నీ, అతని వ్యక్తిత్వాన్నీ, ఉన్నత హృదయాన్నీ మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాననీ, అతనికెలా చెప్పాలో, తెలియ చెయ్యాలో తోచని పద్మావతి, ఒక భర్త దగ్గర భార్య ఎలా ప్రవర్తిస్తుందో అలా తానూ ప్రవర్తించాలనే నిర్ణయానికి వచ్చింది.

ఆమె మెత్తని స్పర్శ అతని కేదో తియ్యని అనుభూతినీ, ఉద్రేకాన్నీ కలుగజేస్తూంది. తనను తాను నిగ్రహించుకుంటూ తనకై తాను ఆమెను తాకకుండా మౌనంగా సినిమా వింటూ కూర్చున్నాడు పాణి.

(సశేషం)

Printed and Published by A. Chandra Sekar Rao at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001, Editor: A. SUDHAKARA RAO

## పొగగొట్టాల భుగభుగలు

పరిశ్రమలు అభ్యుదయపు రైలుకు గార్డు చూపిన పచ్చజెండాలు.

గిర్... ర్...ర్...ర్...ర్...ర్... మర చక్రాల

ధ్వనులు వినడానికి కటువుగావున్నా, అవి దేశప్రగతి వసంతంలో కోకిల కూజితాలు.

* ఆంధ్రప్రదేశ్ పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్
* రాష్ట్ర ఆర్థిక సహాయ సంస్థ
* చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్
* ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషన్
* ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక ప్రాతిపదిక సన్నాహాల సంస్థ వంటి అనేక సంస్థలు తోడ్పడతాయి.

అచిరకాలంలోనే ఆంధ్రప్రదేశ్ మనదేశ పారిశ్రామిక అభివృద్ధి పటంలో ప్రముఖ స్థానం అలంకరిస్తుంది.

నెం 7/75-76

**సమాచార, పౌరసంబంధశాఖ, హైదరాబాదు.**

# FORM IV

( See Rule 8)

| | | |
|---|---|---|
| 1. | Place of publication | ... Hyderabad |
| 2. | Periodicity of its publication | ... Monthly-First of every calendar Month |
| 3. | Printer's Name | ... A. Chandra Sekar Rao |
| | (Whether citizen of India ? ) | ... Indian |
| | Address | 5-9-88, Public Garden Road, Hyderabad-500 001 |
| 4. | Publisher's Name | ... A. Chandra Sekar Rao |
| | (Whether citizen of India ? ) | ... Indian |
| | Address | for Yuva Publications 5-9-88, P. G. Road, Hyderabad-500 001 |
| 5. | Editor's Name | ... A. Sudhakara Rao |
| | (Whether citizen of India ? ) | ... Indian |
| | Address | 5-10-194, Saifabad, Hyderabad-500 004 |
| 6. | Names and addresses of individuals who own the newspaper and partners or share holders holding more than one per cent of the total capital. | ... Smt. A. Sarada 5-10-194, Saifabad, Hyderadad-500 004 |
| | | ... Sri A. Chandra Sekar Rao 5-9-88, P. G. Road, Hyderabad-500 001 |
| | | ... A. Raja Sekar Rao 5-10-194, Saifabad, Hyderabad-500 004 (Minor) |
| | | ... A. C. Chakrapani 2&3, Arcot Road Vadapalani Madras - 26 (Minor) |

I. A. Chandra Sekar Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd./ - A. CHANDRA SEKAR RAO

1976 Signature of Publisher